

# అతను మళ్ళీ మనిషి

మురళీధర్

"ఎవడూ ఎవడినీ బాగుచెయ్యలేడు. ఇంకొకడు బాగుచేస్తే బాగుపడదా మనకునేవాడు ఆరడుగుల పొడుగు, రెండడుగుల వెడల్పుగల గొయ్యి తవ్వుకుని, అందులో అగరొత్తులు వెలిగించుకుని, పువ్వులు చల్లుకుని సొంతంగా సమాధై పోవటం మంచిది...."

మురళీధర్ : కవిగా, సృజనాత్మక రచయితగా గణుతికెక్కిన సాహిత్య పిపాసువు. విద్యాధికుడు. ఆంధ్రాంగ్ల భాషాకోవిదుడు. "భిన్నధ్రువాలు" అనే స్వచ్ఛంద కవితా సంపుటిని వెలువరించారు. ఎమెస్కో ప్రచురణ "1968 కథానికలు" సంకలనకర్త లిరువురిలో ఒకరు; స్వయంగా సమర్థుడైన కథకుడు. ఏకాంకికలు రాశారు. రవీంద్రుని "గీతాంజలి", "గార్డెనర్" తెనుగు చేశారు.

జీవితంలో పెట్టుబడి అవసరం లేకుండా తారాజువ్వలాగ పైకి పోవాలన్న పట్టుదలగలవారికి అతివాస్తవికమైన ఆధునిక జీవన సూత్రాలు గురుశిష్య సంవాదరూపంలో సోదాహరణంగా అవగతంచేసే రచన "అంతుపట్టని మనిషి."

ANTUPATTANI MANISHI

*By*

A. MURALIDHAR

*Publishers* :
M. SESHACHALAM & Co.

*First Edition* : AUGUST, 1970
EMESCO POCKET BOOKS

*Cover Design* :
BAPU

*Printers* :
HINDU PRESS, MACHILIPATNAM

*Distributors* :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
Rashtrapathi Road, Secunderabad.

Rs. 2/-




134

# 1. రామ్మూర్తిని గూర్చి ఎందుకు రాయాలంటే....

రామ్మూర్తిని నేనెరగను. రామ్మూర్తిని నేనెరగనుకదా!

'ఎందుకు రాస్తున్నావుమరి?' అని సాగదీసి అడగవచ్చు మీరు. అడగొచ్చేమిటి అడిగారుకూడాను. అంచే నేను రామ్మూర్తిని గూర్చి రాసేముందర ఒక చిన్న ప్రకటనలాంటిది చెయ్యాలని అనుకో లేదు; గప్‌చిప్‌గా రాసి, అంతకన్న గప్‌చిప్‌గా మార్కెట్‌లోకి విసిరేద్దామని ఆశ—అదే దురాశతో (దురాశ అన్నివేళలా శిక్షార్హం కాదుగదా. అనేక సందర్భాలలో హర్షించదగినది అన్నగురువాక్యం వుంది.) 'ఇంతకాలం బట్టీ మరీ జోరుజోరుగా కుండపోతలా కురుస్తున్న హర్షాన్ని అంతకన్న పేరాశతో యింకుగామార్చి రాసి పారేశానోయ్!' అన్నాను నాకు చాలాచాలా దగ్గరగా వుంటూ ఆ కథంతా లోపాయికారీగా విన్నమిత్రుడితో.

నువ్వు పెద్ద 'కొలంబస్' ననుకోబోకు. కొలంబస్‌కి సంకెళ్ళు వేసి నువ్వు వట్టి 'హోక్స్' వన్నారు తెలుసా? పోదూ మరీ గొడవ నీది? మనకళ్ళముందు చూస్తూచూస్తూ హటాహటీగా పెరిగి పోయిన వాళ్ళను, మనం నిద్రమత్తులో జోగుతున్నప్పుడు నిటారుగా ఎదిగిపోయిన వాళ్ళనీ చూడలేక, వాళ్ళు అలా పెరగటానికి తను చేసినదేమీ లేదని తెలుసుకోవటం యిష్టంలేక, వూరుకోలేక, వూరు కోక చేసేదికూడా ఏమీలేక, వూరుకున్నప్పుడు, ఏంచేస్తాం మనం?

ఇంతకీ రామ్మూర్తినిగూర్చి రామ్మూర్తే 'నాజీవిత చరిత్రవినుమా నాయనా' అని చెప్పడు. ఎందువల్లనంటే రామ్మూర్తికి అలాంటి అవసరంలేదు. తన జీవిత చరిత్ర ప్రజల నోట్లోపడి పదికాలాల పాటు బతకాలని ఆతను అనుకోవటం లేదుగనక; ప్రయివేటు బతుకుని పబ్లిక్ బతుకుగా మార్చుకోవటం ప్రమాదం గనక, ఇంకా సవాలక్ష కారణాలున్నాయి. కొన్ని తెలిసినవీ, కొన్ని తెలియనివీ మిగతావి తెలుసుకుందామనుకున్నా తెలియనివీ।

అసలు రామ్మూర్తిని గూర్చి రాయాలంటే బోలెడుంటుంది. రామ్మూర్తితో పరిచయమున్న ఎవడైనా, 'రామ్మూర్తినిగూర్చి ఎవడైనారాస్తే బాగుండును.' అని చులాగ్గా అంటాడు. కాని ఎవ్వడూ రాయడు. రామ్మూర్తి జీవితచరిత్ర 'రాయబడని ఒక ఉద్గ్రంథం'గా ఉండిపోవలసిందే. ఎవడైనా పనిగట్టుకునిరాస్తేతప్ప. నాకు పని వుందనీ చెప్పలేను. లేదనీ చెప్పలేను. ఉన్నపని పూర్తిచేసుకుని యిటువంటి చేతి దురదకి తయారవటం పెద్దకొత్తకాదునాకు.

కూసేవాడికి నోటిదురదా, రాసేవాడికి చేతిదురదాను. రాసే వాడిని ఎవడినైనా అడిగితే 'నాలోని ఏదో ఒక అవ్యక్తశక్తి నన్ను నడిపించి, ముందుకు తోయించి, నాచేత యిదిరాయించి....' యింకా వినేవాడికి బుద్ధిలేకపోతే యింకా ఎన్నైనా చెబుతాడు. చెప్పేవాడికి వినేవాడు ఎలాలోకువో, రాసేవాడికి చదివేవాడు అల్లాగేలోకువ లోకంలో.

మేకులు కొట్టేవాడు మేకులుకొట్టి మేకులుకొట్టినందుకు డబ్బులు పుచ్చుకుని, యివ్వకపోతే నీకూ ఒకమేకుకొట్టి మరీపోతాడు. అంట్లుతోమేమనిషి, గిన్నెలూ, చెంబులూతోమి, మనం డబ్బులు యివ్వకపోతే మనల్నికూడా తోమిపోతుంది. రోడ్డువేసేవాడికి కంట్రాక్టరు కూలీ యివ్వకపోతే కంట్రాక్టర్ని రోడ్డుమీదపాతేస్తాడు నిలువునా. ఎవడైనా అడ్డొస్తే వాడినికూడా వీలైనంత దగ్గరలో పాతేస్తాడు. పందిరి రాటలాంటి వాడైనా, గడ్డిపోచలాంటి వాడైనా యీ కనీసధర్మాన్ని పాటిస్తాడు.

కాని, యీ రాసేవాడూ, కూసేవాడూ లోకాన్నుంచి ఏమీ ఆశించలేరు. ఒక చిన్న 'లిటిగేషన్' వుందిక్కడ. కూసేవాడు

ఎదటవాడికి కావలసినట్టుకూస్తే అది గాడిద ఓండ్ర అయినా, కుక్క అరపైనా మహా మధురంగా వినిపిస్తుంది. మరి రాసేవాడు ఎదటివాణ్ణి పట్టుకుని పుంజీలకి పుంజీలు పద్యాలూ, గేయాలూ గుప్పేస్తే, వాడి జీవితకథ రాసిపారేస్తే, ఆ అసామి వీడిముఖాన ఏమన్నా పారేస్తాడు. అది వాడి స్తోమతుమీదా, వీడి అదృష్టంమీదా ఆధారపడి ఉంటుంది. 'పిడికెడుపైన ఎంతైనా స్వయంపాకమే' గనక ఫర్వాలేదు. బండి నడిచిపోతుంది.

ఇంతకీ వీడు రచయిత గనక 'నేను' 'నేనంటే నేను నన్నెరుగరే వీరు!' అంటేనే చిక్కు. ఆ విధంగా అంటే 'నిన్ను మేము ఎరగం అబ్బీ' అనేసే ప్రమాదం ఉంది.

అందుకనే ఎదుటివాళ్ళు 'నిన్నెరగం' అని నికరంగా చెప్పినపుడు వాళ్లని నువ్వుగూడా ఎరక్కుండా వూరుకోవచ్చు. అప్పుడు మరో ప్రమాదం వుంది. ఆ కథ అక్కడితో ఆగిపోవచ్చు.

కథ గనక ఆగిపోతే, యింక ఆగవలసింది ఏమీ వుండదు. అందులో రామ్మూర్తి కథ తెలుసుకోటంలో చిక్కులున్నాయని తెలుసు. ఇది కేవలం కబుర్ల పోగు కాదనీ తెలుసు. రామ్మూర్తి కథ 'సీక్రెట్ వాల్ట్' లాంటిది, అందులోకి వెళ్ళటానికి దారి తెలిసింతా, యింక అటునుంచి నరుక్కురావచ్చు.

అందుకు దారికాశాను, రామ్మూర్తి వెళ్ళేదారికాదు, రామ్మూర్తి ఏ దారినా వెళ్ళడు, అన్నిదార్లూ రామ్మూర్తి దగ్గరకే వెడతాయి. అందరూ రామ్మూర్తి ముందర ఎలా ఆడమంటే అలా ఆడతారు.

రామ్మూర్తిని గూర్చి, రామ్మూర్తిని కనిపెట్టుకొనివుంటూ శిష్యరికం చేసిన సామికోసం వేశాను కాపలా.

సామి నన్ను చూడలేదు. నేనే సామిని చూశాను. రాజుగారికి నా దర్శనం అయింది. వెంటనే పళ్ళికిలించి 'కాలినాస్ బ్రష్డ్ టీత్' బయటపెట్టి నమస్కరించాను. తోసుకువెళ్ళిపోవటం మరో 'రూడ్' గా ఉంటుందనుకున్నాడేమో, ఓ చూపు విసిరాడు. ఎలక్షన్లో నెగ్గినతర్వాత శాసనసభ్యుడు తన నియోజకవర్గంలోని ప్రజల్ని చూసే చిన్నచూపులాంటి దొకటి విసిరాడు సామి.

'రామ్మూర్తి కథ వినాలి మీనోటినుంచి!

'ఊఁ'

'గబగబా వెళ్ళిపోయాడు సామి. 'ఎంత నిర్లక్ష్యం' అను కున్నా నాలో నేను. నా మాట నాకే వినిపించింది.

సామి యిప్పుడు పెద్ద ఆసాములకి ఆసామి అయిపోయాడు. గాని, అసలు పేరు నారాయణస్వామి. పుట్టిన వూళ్ళో, అంటే ఆంధ్ర దేశపు ఓ కుగ్రామంలో అతనిపేరు నారిగాడి దగ్గరనుంచీ, నారాయణ గాడు మీదుగా సామిగాడి దాకా పెరిగింది. అప్పుడు నిద్రలేచి, వళ్ళు దులుపుకుని, వూరునుంచి తోక జాడించాడు. పోతూ పోతూ మళ్ళీ చిన్నవూరెందుకని, మద్రాసు వెళ్ళాడు. అక్కడ అరవంపూర్తిగా నేర్చుకోక పోయినా, తెలుగు మర్చిపోయాడు. మర్చిపోయాదే మో బతికిపోయాడు. మర్చిపోయినా మర్చిపోకపోయినా మర్చి పోయినట్లు నటించాడు. అసలు సామి లోపాయి కారిగా పాండిత్యం వెలిగిం చాడుట కూడాను. తెలుగంటే పాపం మహామనసు. కాని, కూడు పెట్టలేదు అప్పట్లో. ఏంచేస్తాడు?

కాని, ఆ నటించటం ఎంతనిజమైందంటే, బుద్ధున్న వాళ్ళె వరూ తెలుగు వాడిగా గుర్తుపట్టటం మానేశారు సామి తిరిగివచ్చే సరికి, బతికి పోయాడు. దరిమిలా రామ్మూర్తి సహవాసం. బాగు పడటంజరిగి 'సామి'గా మారిపోయాడు. కొత్తవాళ్ళతో మాట్లాడే టప్పుడు యింకా ఆ 'యాస'తో అదే విధంగా మాట్లాడుతాడు సామి.

సామి నాతో మాట్లాడక పోతేనేం? నేనే సామితో మాట్లాడాలి గనక, మర్నాడు కూడా అదేదారి కాశాను. ఏమైనాసరే, ఎంతసేపు పళ్ళికి లించవలసి వచ్చినా సరే, వెంట నంచీ మొయ్యవలసి వచ్చినా సరే సిద్ధమే. అసలు పెద్దవాళ్ళ చేతి సంచులు మోసి మోసి వాళ్ళని సంచీలో వేసిన వాళ్ళను గూర్చి మునుపే విన్నాను గనక, 'ఛాన్సు' దొరికితే సామి చేతిసంచీ మోసి తీరాలనుకున్నాను.

మర్నాడు కలవంగానే పళ్ళికిలించి, 'మీ సంచి యిప్పించండి', అన్నాను

'పుచ్చుకో. అంత మనసుగా ఉంటే?'

మళ్ళా పళ్ళికిలించాను.

'నిన్నగూడా యిక్కడే కూశావు. పనీ పాటా ఏమీలేదా?'

'ఉంది ...లేదు.'

'అయితే పద'

పది అడుగులువేసి, 'రామ్మూర్తి నిగూర్చి....'

'అవును. రామ్మూర్తి నిగూర్చి నీకు ఏమన్నా తెలుసా?'

'తెలియదు. మీరుచెప్పాలి. నేను విని దారిచేసుకోవాలి.'

'ఇంతదాకా గోళ్ళుగిల్లుకుంటున్నావా? ఏం చేస్తున్నట్టు?'

'నా సొంతగోళ్ళే గిల్లుకుంటున్నాను.'

'బాగానేవుంది. ఇంకొళ్ళ గోళ్ళు నిన్నెందుకు గిల్లనిస్తార్లే! దానికి వేరే మనుషులున్నారు?'

సామి ఆవేళ పాతమోడల్లో కళ్ళజోడూ, ముతకపంచె కట్టుకున్నాడు. ఇంతదేవాంతకుడు మరోయింత పాతకళ్ళ జోడూ, మరీ సీపుకాని కట్టిన పంచె దేనికి వేసుకున్నాడా అని అనుమానం వచ్చింది. అడిగేద్దామని అనుకుంటూండగా సామి అన్నాడు:

'అదేవిటి ఆ పంచకేసీ, ఆకళ్ళజోడుకేసి తెగచూస్తున్నావు? ఏవీ బాగావుగదా కొంపదీసి?'

'అబ్బే....అదికాదు.'

'అయితే చూడటం మానెయ్యి వాటివంక....'

నడుస్తూ నడుస్తూ నారాయణగూడా జంక్షన్ దగ్గరకి వచ్చాము. ఎదురుగా హోటల్లోకి నడిచి టీ తాగాం.

'టీ బాగానే వుందిగాని. మెడ్రాసులో అంబాభవన్‌లో సూర్యుడు పొడవకముందు ఫస్ట్‌ఫిల్టర్ కాఫీలాగ వుండదు. అది రోజు [illegible]' అన్నాడు. మద్రాసు జ్ఞాపకంరాగానే బొజ్జ నవరిసుకుంటూ. మద్రాసుపేరు తలుచుకోగానే సామికళ్ళు తళుక్కుమన్నాయి. మెదడులో ఏదో ఆలోచన మెరిసింది.

'నీకు రామ్మూర్తిని గూర్చి చెప్పేముందర కొన్ని ముఖ్య విషయాలు చెప్పాలి.... తెలుగు బాగా మాట్లాడుతున్నావుకదూ?' అంటూ 'ఆర్టిఫిషల్'గా దగ్గాడు.

'వీళ్ళందరితోనూ తెలుగు యింత యిదిగా మాట్లాడను. అయినా కొన్ని కండిషన్లున్నాయి. వాట్లవివరం విను శ్రద్ధగా. నీకు అవి వంటికిపట్టి, నువ్వు పింఛేసరే .... అయినా అసలు కథరేపు.... ఏ పబ్లిక్ గార్డెన్స్‌లోనో ....' అని, ఆగాడు. నేను ఆశ్చర్యపడతా నేమోనని కళ్ళజోడులోంచిచూశాడు అదోమాదిరిగా. ఎదటివాడిలో ఏదో యిమ 'ఎఫెక్టు' తీసుకొద్దామనుకుని పప్పులో కాలువేసినట్లు యింది.

'ఒకటి .... కండిషన్ నంబర్‌వన్. రామ్మూర్తికథ చెబుతూ న్నంతసేపూ నీకు వినడానికేగాని, ప్రశ్నలువేసే హక్కులేదు. నేను చెప్పటం, నువ్వు వినడం .... అదీ సంగతి .... !'

'మరి అనుమానాలొస్తేనో ?'

'ఇంకొకళ్ళ జీవితచరిత్రమీద నీకు అనుమానాలు రావటం ఏమిటంట ? అందులో రామ్మూర్తినిగూర్చి అసలే వీల్లేదు. వీల్లేదు గనక వీల్లేదు. అట్లాగని నూచోబెట్టి తలంటేస్తానమకోబోకు. నువ్వు ప్రశ్నలు అడగనూవచ్చు. నేను సమాధానం చెప్పనూవచ్చు. అయితే, ఒక్క షరతు. నేను అడగమన్నప్పుడే అడగాలి.'

'మీరు అడగమన్నవే అడగాలి అన్నారు కారు !'

'అంటాను. అప్పుడు నువ్వేమంటావు ?'

'అఫ్‌కోర్స్ నోరుమూసుకు వింటాను'

'అయితే విను మరి. కండిషన్ నంబర్ టూ. ఈ కథ కథ కాదుగనక నన్నడగకుండా యింకెవరికీ చెప్పగూడదు. అంటే ఈ కథ నీ ద్వారా విన్నట్లు ఎవ్వరూ నాతో చెప్పకూడదు.'

'అంటే !'

'అదుగో ? ఆ విధంగా ప్రశ్నలు వెయ్యకూడ దనే నే చెప్పింది.'

'ప్రశ్నలు వెయ్యద్దన్నది కథ మొదలెట్టిన తర్వాతకదా !'

'ఒప్పుకున్నానోయ్, భాయ్, నువ్వు ఘటికుడవే ! నీకు ఏదో ఇవ్వవలసిందే ?'

నవ్వుకున్నాను నాలో నేను. సామి అభినందించాడయే మరి ! 'ఇంక కండిషన్ నంబర్ త్రీ. 'ఈకథ నువ్వు విన్నతర్వాత రామ్మూర్తి

మీద నీ అభిప్రాయం నాకు చెప్పగూడదు' అని కొంచెం ఆగి నేను వేస్తాననుకున్న ప్రశ్నకు తనే సమాధానం చెప్పాడు.

'అంటే నీకు అసలు రామ్మూర్తి మీద ఒక అభిప్రాయము అంటూ రాకూడదు. ఒకవేళ వచ్చినా, నువ్వు నాకు చెప్పకూడదు. రామ్మూర్తి మీద నాకు ఓ అభిప్రాయం వుందా అని అడగకు. నువ్వు అడగకూడని ప్రశ్నల్లో అదొకటి.'

'ఇన్ని కండిషన్లా మరీను? అన్యాయం!' అందామనిపించింది. సామి యిదే ధాన్స చూసుకుని మానెయ్యొచ్చు. అప్పుడు నా పని ఏంగాను! ఏదో నాలుగుముక్కలు విని నాలుగు తలలుకొట్టి బత కాలనిగదా ప్రతివాడి తంటాలూను. అందుకే తెచ్చిపెట్టుకున్న బుద్ధి మంతతనంలో నోరుమూసుకూర్చున్నా.

* * * *

## 2. రామ్మూర్తి పుట్టుపూర్వోత్రాలు

వచ్చాడు బాకీ వసూలుచేసుకోటానికి వచ్చే కాబూలీవాడిలాగ వచ్చాను సామిని కలుసుకోటానికి. సామి కరక్టుగా టైముకి వచ్చేశాడు — పబ్లిక్ గార్డెన్స్‌కి.

చుట్టూరా పబ్లిక్‌గార్డెన్స్‌లో పలచగా మనుషులు తిరుగు తున్నారు. కొట్టిపారేసిన తుమ్మకొమ్మల్లాగ. అది శీతాకాలపు సాయంత్రం కావటంవల్ల అందరూ నత్తగుల్లల్లోకి నత్తల్లాగ ఎవళ్ళ ల్లోకి వాళ్ళు ముడుచుకు పోతున్నారు.

పబ్లిక్ గార్డెన్స్‌లో ప్రయివేటుగావుండే జాగాలు కొన్ని వున్నాయి. ఎక్కడ కూచుని ఏమి మాట్లాడుకుంటే ఎవడికి కావాలి అనుకోటానికి వీల్లేదు. అన్నీ అందరికీ కావల్సిందే. అందుకుగాను ఓ పక్కగా కూచుని ఓ చూపు చుట్టు పక్కలకి పారేసి, ఓచెవి అటు తిప్పి కూచోవటం అవసరం.

'రామ్మూర్తి కథ మనం ఎక్కడనుంచి ఎత్తుకుందాం? పుట్టు పూర్వోత్రాల నుంచేనా?'

'అంతకు ముందునుంచైతేనో?'

'ఈ ప్రశ్నవి నిన్ను నేను అడగమన్నానా?'

'తప్పే!'

'ఒప్పుకోవటం బాగుంది'.

పక్కగా వేరుశనక్కాయలు అమ్మేవాడిని పిలిచి, ఓ పావలా కాయలు నాచేత కొనిపించాడు. నేను ఒక్కొక్క కాయ ఒలిచి యియ్యటం, సామి తినటమూను.

'నువ్వడిగిన ప్రశ్నగూడా ఒక రకంగా బాగానేవుంది సుమీ!' అని కొంచెంఆగి, 'అదేమిటి ముఖంలోకి అంత సంతోషం వచ్చేసింది? ఆ....అదీ మంచిదే ముఖం ముడుచుకుని కూచునేకన్న. అసలు సంగతేమిటంటే. మనిషి పుట్టకముందే పుడతాడు. చావక ముందే చస్తాడు, ఏమంటావు!'

'బాగా చెప్పారు.'

'అదే విధంగా ఒక ప్రత్యేకమైన తరహా మనుషులు పుట్టటానికి కొన్ని ప్రత్యేక పరిస్థితులు అవసరం, మరికొంచెం సూటిగా చెబుతాను విను. ఒక రకమైన పరిస్థితుల్లో ఓ తరహా మనుషులు పుడతారు అందరూ అదేవిధంగా పుట్టి పెరిగేస్తారనుకో బోకు. కొందరు మాత్రమే ఆవిధంగా పుడతారు మిగతావాళ్ళ పరిస్థితుల్ని చూపి తనుని తాము మార్చుకుంటూరు. అంటే పరిస్థితులకి లొంగినట్లు లొంగి వాట్లని పిలక పట్టుకు జాడించేస్తారు. కానలిస్తే, ప్రశ్న అడుగు?' అని పురిని చూశాడు.

నేను ఆలోచిస్తుంటే, ఒక్క చెణుకులాంటి నవ్వు విసిరాడు. రోజా రెక్కలాంటి ఆ చిరునవ్వు చివరని పట్టుకుని అన్నాను.

'అయితే గురూజీ, పరిస్థితుల కీ మనుషులు పుట్టడానికీ ఏమిటి సంబంధం? ఓమనిషి పుట్టడానికి ముందుండే పరిస్థితులు, ఆ మనిషి పుట్టంగానే మారిపోతాయా ఏమన్నానా? ఇంకోసంగతి. పరిస్థితులకి లొంగాలని ఎవడికీ వుండదుకదా? పరిస్థితులే మనల్ని నడుమువంచి

పారేస్తాయ్! మరోసంగతి! ఇంతకీ రామ్మూర్తి ఏ కేటగిరిలోకి వస్తాడు?'

'చాలు, చాలు ఒక్క ప్రశ్న అడగమంటే ప్రశ్న శతం వేస్తున్నావేం?'

'ప్రశ్న ఒకటే గురూజీ. మిగతావన్నీ సప్లిమెంటరీలు.'

'అయితే నీకు రాజకీయపరిజ్ఞానంకూడా వుందన్నమాట? నిన్ను ఉద్ధరించటం ఏమంత కష్టంకాదు. ఇంతకీ మనం రామ్మూర్తిని గూర్చి దేనికి తెలుసుకుందామని అనుకుంటున్నాం? నువ్వు దేనికి తాపత్రయ పడుతున్నావు? మనం కూడా కొంతో గొప్పో పూసుకో వచ్చనే గదా? అందాకా ఎందుకు, నాకు నేను చూడు....'

'రామ్మూర్తినిగూర్చి చెప్పండి!'

'అవును. నేను చెప్పదలచు కున్నదీ, నువ్వు వినదల్చు కున్నదీ రామ్మూర్తిని గూర్చే. కథలో కథ వచ్చి కంచికి వెళ్ళి పోయినట్లు, యీ రామ్మూర్తి కథలో మిగతా జీవిత కథలు వచ్చి కలిపి యింటికివెళ్ళిపోతూ వుంటాయి. రామ్మూర్తికథ మాత్రం మనతో మిగిలిపోతుంది చివరకి.'

'అంటే మిగతా కథలనే పిల్లఏరులన్నీ రామ్మూర్తికథ అనే మహానదిలో కలిపి పోతాయన్నమాట!'

'అబ్బ. కవి హృదయమోయ్‌నీది, నిజంగా! నీ బుద్ధిసూదంటు రాయి!' అని ఒక కాంప్లిమెంటు విసరి మళ్ళాకథలో పడ్డాడు.

'ఈ కథ చెబుతూంటే నా తోటివాళ్ళే ముఖ్యంగా నా కథ వచ్చి కలుస్తూ ఉంటుంది. నువ్వుకికుర్రు మనకుండా వినాలి. ఎందువల్లనంటే, రామ్మూర్తికథలాగే నా కథకూడా ముఖ్యమేగనక! రోడ్డుమీది పులి స్తరాకు లాంటి నేను రామ్మూర్తినిచూసి నేర్చుకుని యీ స్థితికివచ్చాను. ఇప్పుడు నాకు డజను లారీలున్నాయి. అవి రాత్రిపూటేగాని పగలు నడవవు. నడిచిన ప్రతిరాత్రీ ఎంతడబ్బు తెస్తాయో అని అడగకు? మరి నాకు కొన్ని కిరసనాయిలు దుకాణా లున్నాయి .... అలా గుడ్లప్పగించి చూస్తావేం?'

'కిరసనాయిలు వ్యాపారం చేస్తారా మీరు?'

'నీ అజ్ఞానం మరీ పేరుకు పోయిందోయ్ ! కిరసనాయిలంటే కిరసనాయిలుకాదు. అదికూడా నేను చెప్పేదికాదు. చెప్పవలసినదీ కాదు. ఓ సాయంత్రం గుళ్ళోకివెళ్ళినట్టు శ్రద్ధగా కిరసనాయిలు దుకాణాలన్నీచూడు. వెదుకు. అప్పుడు అర్థం అవుతుంది. తాగే కిరసనాయిలువేరు, లాంతర్లలో, స్టౌల్లోపోసే కిరసనాయిలువేరు. ఈ కిరసనాయిలు వ్యాపారంలో ....' అని కొంచెం ఆగి చెయ్యెత్తి దణ్ణంపెట్టి, 'ఈ వ్యాపారం మరోమూడు ఊళ్లల్లోకూడా సాగుతూంది. దాన్లో రంగులోపీ భాగస్వాములకీ, చిరుగుచొక్కాల వాళ్ళకీ పోగా మిగిలింది మనది. ఇన్‌కమ్‌టాక్సు వాళ్ళకి గూడా చెప్పని యీ రహస్యాలన్నీ నీకు ఎందుకు చెబుతున్నానంటే, సత్యాన్వేషణకు బయలు దేరావుగనక....' అని చాలొచ్చి ఊరుకున్నాడు సామి.

సామి ఊరుకోగానే నాకు వళ్లు మండింది. ఇంజక్షను ఇస్తా నన్న డాక్టరు పెద్దమనిషి దబ్బనంతో కసిదీరా గుచ్చినట్లయింది.

ఏమిటి యీ పెద్దమనిషి యీ విధంగా తోమేస్తున్నాడు ? వినకాతప్పదు. భరించకా తప్పదు. జేబు కొయ్యబడ్డవిచ్చినతర్వాత లాగూ చిరిగిందని గునిసి ఏం లాభం గనక !

'ఇంత చీకటిపడింది - రామ్మూర్తి కథ....'

'ఎందుకా ఉక్రోషం ? నా కథ నువ్వు వినకతప్పదు. అవకాశం తీసుకుని 'ఆటోబయాగ్రఫీ' చెప్పెయ్యమన్నారు పెద్దలు.

'ఇదే మొదటి టెక్నిక్. రామ్మూర్తి జీవితంలోంచి నేర్చుకోవలసినది, అవకాశం వచ్చినప్పుడల్లా, లేకపోతే అవకాశం కల్పించుకునో మనవిగూర్చి మనం చెప్పేసుకుంటూ వుండాలి.

'ప్రత్యేకంగా నన్నుగూర్చి విను' అని అంటే ఎవ్వడూవినడు. మనని గూర్చి మనం ఎదుటివాడికి వాడు 'ఫీల్' కాకుండా చెప్పెయ్యడం మన్నది శుద్ధమామూలుగా కనిపించే విషయం. చాలాకీలకం, అందరి పనులూ మనమే చేసిపెడుతూన్నట్లు కనిపిస్తూ, పరోపకారం వంచి పెడుతున్నట్లు 'ఏ' క్లాస్ యాక్టర్‌లాగ నటిస్తూ మన పనులు మనం చేసుకోగలగటం, ఈ పరోపకారపు బురఖా ముసుగు ఎన్ని తప్పుడు పనుల్నయినా మూసి పెట్టగలదు.

'ఈ ముసుగులో పడ్డవాళ్లు మసైపోయినా, బొగ్గయిపోయినా, అయినట్టు తెలుసుకోలేరు. ఒకవేళ తెలుసుకున్నా దీని కంతటికీ సంధానకర్త ఎవరో తెలిసికోలేరు. ఇదబ్బాయ్, జీవిత రహస్యం: బ్రతకటంలో వున్న చెణుకూ బెణుకూను. ఈ సమాజంలో హాయిగా బతకటానికి ఏమైనా కావాలేమోగాని, తెలివితేటలు మాత్రంకాదు. తేట కావాలిగాని తెలివి అసలే అక్కర్లేదు. కావలసిందేమిటయ్యా అంటే చమత్కారం.'

'చమత్కారం అంటే?' ఎవరో పండితులు యీ మాటని మహాజోరుగా మాటమాటకీ మధ్య విసురుతూంటే విన్నాను లెండి?'

'అలా అడుగు? చమత్కారం అంటే...చమత్కారం అంటే... చమత్కారం అన్నమాట.'

సామి తమాషాగా చూశాడు. నేను ఏమంటావో అనికాదు, ఏం చెప్పాలా అని ఆలోచించటానికీ కాదు. ఏదైనా ఒక విషయం చెప్పాలనుకున్నప్పుడు కాస్త 'పోజ్' యివ్వటం మంచిది. మంచి ప్రభావం పడుతుంది వినేవాడిమీద. సామికి యీ విషయం తెలుసు.

'అర్థంకాలేదుకదూ? అంత తేలికగా అర్థంకాదది. చమత్కారం ఒకానొక జీవితమార్గానికి పేరు. ఎవరైతే ముసిముసి నవ్వులు నవ్వుతూ, తియ్యగా మాట్లాడుతూనే, నీకు తెలియకుండానే నీకాళ్ళుచ్చుకుని లాగెయ్యగల సమర్థతకలిగినవాళ్ళో, వాళ్లలోని జీవ లక్షణం చమత్కారం. కొంతకాలం అయినతర్వాత యీ 'ఏక్టివ్‌లైవ్' లోంచి 'రిటైర్' కాగానే రాసి రామ్మూర్తికి అంకితం యియ్యదల్చుకున్న గ్రంథం 'చమత్కారం'. ఈ చమత్కారమనే మహామంత్రాన్ని పఠించిన వాళ్లకి అపజయం అంటూ ఉండదు.

'రామ్మూర్తి నీలాగే, నాలాగే, ఏదోవూళ్ళో అంటే విజయవాడలో పుట్టాడనుకో.

'అంటే యీ రామ్మూర్తి రెండవతరహా మేధావుల్లోకి వస్తాడన్నమాట.'

'అయితే కథలోపట్టూ, విడుపూ బాగా 'ఫాలో' అవుతున్నావన్నమాట. అసలు యీ రెండోరకపు మేధావులే మొదటిరకాన్ని

కొనేస్తారు. మొదటితరగతి మేధావులు సిద్ధాంతాల్ని తయారు చేసి పుస్తకాలు రాసిపారేస్తారు. అంతే. అంతటితో వాళ్ళపని పరిసమాప్తి అయిపోతుంది. ఒక్కొక్కసారి, ఆపుస్తకాన్ని కొని పారేసి వీళ్ళేం పిసినట్లు వలాంటివి అనుకోవటం కూడా కద్దు. ఇది చాలా పెద్ద విషయం అనుకో. ఇప్పుడే చెపితే గాబరా పడతావు.'

'ఈ రామ్మూర్తికి తల్లీ తండ్రీ ఉన్నా ఉన్నట్లు రామ్మూర్తికి తెలియదు. రామ్మూర్తికి బుద్ధివచ్చే సరికి తనకు యీ లోకంలో ఎవ్వరూ లేరన్న సంగతి తెలిసొచ్చింది.

ఎవ్వరూ పని కట్టుకుని అనాథాశ్రమంలో చేర్పించ లేదు రామ్మూర్తిని. ఆ పంచనా, యీ పంచనా పట్టుకొని తిరిగాడు. కొంత కాలం అయ్యేసరికి విజయవాడలోని పందులకీ తనకూ తేడా ఏమీ కనిపించలేదు.

బురదలోంచి తప్పించుకోలేని పందిలాగ, పరిస్థితుల్లోంచి ఎవ్వరూ తప్పించుకోలేరు గదా!'

'బురద లోంచి పద్మాలు పుడతాయి కదూ గురూజీ!'

సామి సన్నగా నవ్వాడు. తల పంకించాడు. కళ్ళ జోడు జారిపోక పోయినా మరోసారి సర్దుకుని నావైపు చూశాడు.

'నన్ను నేను 'కోట్' చేసుకోవాలంటే, నేను యిందాక చెప్పినట్లు నీది కవి హృదయమోయ్.'

'అటువంటి విజయవాడ మహాపట్టణంలో పుట్టి పెరిగే కుక్క గొడుగులతో బాటే తనూ పెరిగాడు. పన్నెండో యేడు రాకుండానే రామ్మూర్తికి అష్టాదశ పురాణాలు వచ్చేశాయి....'

'కత్తి విరిగేటంతటి కోతకదూ యిది?'

'నేను కథ ఆపుచెయ్యనా చెప్పు?'

'వద్దు. వద్దు. ఇహనుంచీ మీరు ఎంత కోసినా పట్టీ అయినా వేసుకుంటాను గాని, మీ కోతకి అడ్డం రాను. సరేనా?'

'ఈ పురాణాలు వేరు. రామ్మూర్తిలో సగం అంశ ఉంది సామిలో. అదిగాకుండా సామికి కథచెప్పటం తెలుసు. అంటే ఎదటి వాడిని వినేలాగ చెవి మెలిపెట్టి వినేలాగ చెయ్యగల సమర్థత ఉంది.

ఈ పురాణాలు నేర్పటానికి విద్వాంసులూ వేదాంతులూ అక్కర్లేదు. పరిస్థితులనే పాములు అన్నివైపులనించీ కరుస్తూ వుంటే, యీ సమాజపురాణం పూర్తిగా వంటబడుతుంది. అది వెయ్యిపురాణాల పెట్టు.

ఈ పురాణాలు నేర్చుకున్న రామ్మూర్తి విజయవాడలో పెరిగాడు. చుట్టుపక్కల వున్న చోటా మోటా పనులన్నీ చేసాడు. ఓమూర్ఖపు చేతిపనిలో గూడా తర్ఫీదుపొందాడు.

'మంచిదేగదా? పని నేర్చుకుని బాగుపడచ్చు.

'మళ్ళీ అద్దుపుల్లా నువ్వూను. ఈ సాంకేతిక విషయాలు నీకు తెలియవు. చేతిపని అంటే వడ్రంగం, కమ్మరిపని, కుమ్మరి పనీ కాదు. నీ ఊహకందని మరో చిన్నపని జేబులు కొట్టెయ్యటం అంటే తెలుసుగా? మరీ గోపులాగ నటించకు?'

'తెలియకేం! నా జేబు వకొకడు కొట్టేశారు. ఓ ఏడాది క్రితం నాంపల్లి స్టేషన్లో నా పర్సులో మిగిలిన పావలా కొట్టేశాడు. ఆ సాయంత్రం స్టేషన్ బయట కాకులు కూడా ముట్టుకోకుండా పారవేయబడింది ఆ పర్సు. నిజానికి ఆ ఖాళీపర్సు నాదని తెలిస్తే తన్నే వాడనుకుంటా ఆ పర్సు కొట్టేసిన పెద్దమనిషి!

'నీకూ కొంత తెలుసు. అయినా పోదూ, నీది అజ్ఞానం— అదే సాంకేతిక నిపుణులకీ మామూలువాళ్ళకీ తేడా. కిరసనాయిలు అంటే తెలియదు. చేతిపని అంటే తెలియదు. రామ్మూర్తి యిలా జేబులుకొట్టేస్తూంటే, ఒకానొక పెద్దమనిషిచూసి, ఆ 'ట్రేడ్'లో తర్ఫీదు యివ్వటంకోసం మద్రాసుదగ్గర ఓ వూరు తీసుకుపోయాడు. పెట్టుబడిలేని వ్యాపారం గదా అని రామ్మూర్తి వెళ్ళాడు. రామ్మూర్తి ఏ గాలికైనా ఎగిరిపోవటానికి సిద్ధంగావున్న ఆకులాగ వున్నాడయ్యో. ఏ వూళ్ళో వుంటేనేం?

వెళ్ళినవాడు అన్ని కళల్లోనూ తర్ఫీదుపొంది వచ్చాడు పదేళ్ల తర్వాత. ఆ రావటం తను పుట్టిపెరిగిన విజయవాడకు కాకుండా, సరాసరి హైద్రాబాదువచ్చేశాడు. రామ్మూర్తిపోటీవాళ్లవి రెండుచేతు

అతో ఆహ్వానించటానికి సిద్ధంగావుంది నగరం. ఏమన్నా అడగ దలుచుకున్నావా?'

ప్రశ్నలు అడగనిస్తూంటే. ఎన్నిప్రశ్నలైనా అడగొచ్చు. సమాధానం చెప్పేవాడే ఉండాలేగాని. ఒకళ్లంటే ఒకళ్లకి విసుగైనా ఎత్తాలి. లేక ఒకళ్లనొకళ్లు సరిగ్గా అర్థం చేసుకునైనా ఉండాలి.

'హైదరాబాదే ఎందుకు వచ్చాడూ అని?'

'కారణాలు కావలసినన్ని. కాని లేవు'

'ఏమిటీ గురుజీ. యీ ద్వంద్వం'

'జీవితం దానికి భిన్నంకాదు శిష్యా. రామ్మూర్తి హైదరాబాదు కాక పోయినా మరేవూరైనా వెళ్లవలసి వచ్చేది తప్పనిసరిగా. మళ్లీ ఎందుకూ అనొచ్చు. రామ్మూర్తి ఎక్కడైతే తరిఫీదు పొందాడో అక్కడున్నవాళ్లు రామ్మూర్తికి గురువులూ, గురుతుల్యులూగనక. బతకదలుచుకున్నవాడు ఆ వూళ్ళో వుండడు. పుట్టిపెరిగినవూళ్ళో పరపతి ఎలాగూ ఉండదు గనక. విజయవాడవెళ్లటంలో అర్థంలేదు. నువ్వు అడగొచ్చు - రామ్మూర్తి పొగాకు కంపెనీలున్న గుంటూరుకు ఎందుకు వెళ్లలేదూ. ఆంధ్రాపారిస్ తెనాలికి ఎందుకు వెళ్లలేదు? విశాఖపట్టణం ఎందుకు పోలేదు? ఈ చొప్పుదంటు ప్రశ్నలుఅడక్కు. అందరికీ కలిగినట్లే రామ్మూర్తికీ మోజుకలిగింది. మోజుకలగటంలో తప్పేముంది గనుక?'

నేను ఆదోరకంగా చూశాను.

'అదుగో అలా చూడకు. మోజు మనుషుల మీదే కలగక్కర్లేదు. వస్తువులమీదే కలగక్కర్లేదు. అలాగని మోజుని తీసి పారెయ్యడానికి వీల్లేదు. రామ్మూర్తికి హైదరాబాదుమీద మోజుకలగటం నిజానికి మంచిదైంది. నాబోటివాళ్ళు బాగుపడ్డారు. బతుకు బాటలు వేసుకున్నారు? అని ఊరుకున్నాడు.'

'మరి అసలు కథ చెప్పటం మానేశారు!'

'అవును సగం తింటూతింటూ ఊరుకోలేం గదా! ఎక్కుతూ ఎక్కుతూన్నకొండ సగం ఎక్కి చతికిలబడిపోలేం గదా? హోటల్లో తిని బిల్లు చెల్లించకుండా బయటకు వచ్చెయ్యలేం కదా?'

'చివరి ఉదాహరణ నాకు బాగానచ్చింది.'

'మళ్ళీ రేపు సాయంత్రం అయిదుగంటలకి పబ్లిక్ గార్డెన్స్ గేట్ దగ్గర కలుద్దాం.'

'వద్దు గురూజీ. ఈ ప్రయివేటు విషయాలు పబ్లిక్‌గా మీరు చెప్పటమూ బాగాలేదు. నేను వినడమూ బాగాలేదు. మీ యింటికి రేపు రాత్రి వస్తాను. మీపని అయినతర్వాత, భోజనం చేసిన తర్వాత. తీరుబడిగా కూచుని చెబుదురుగాని. మీ ఋణం తీర్చుకుంటాను. కష్టం ఉంచుకోను.

'అది నాకు తెలియదు గనకనా? నువ్వు బుద్ధిమంతుడవనే ఉత్తరోత్రా పనికొస్తావనేగదా నీకు దాన్ని ఉపదేశిస్తూంట?'

'అయితే సరే రేపు రాత్రి తొమ్మిదిగంటలకి - హిమాయత్ నగర్ పెట్రోలుబంకు దగ్గిరేగా? మీ యింటికి వస్తున్నాను, సరేనా?'

*   *   *   *

## 3. రామ్మూర్తి ఎడ్వెంచర్స్
## (ప్రేమలో పడటం)

వచ్చాను తొమ్మిది కొట్టకముందే హాజరయ్యాను సామి దేవిడీ ముందర. ఏమో ఏమో అనుకున్నానుగాని మహదొడ్డ 'స్టేట'స్ సామిది. మీదపడి తినేసే అల్సేషన్‌కుక్కా, వెన్నెల్లో మెరిసే పువ్వుల్ని తొడుకున్న గ్రీన్‌లాన్, అటూ యిటూ ఆర్టిస్టిక్‌గా కత్తిరించబడ్డ పోకచెట్లూ వీట్లన్నిటినీ చూసేసరికి అక్కడే చతికిలబడి పోదామనిపించింది. చెప్పొదూ?

అయినా వాకిట్లో నిలబడటం ఏం పెద్దమనిషిదనం గనక? 'కాలింగ్ బెల్' నొక్కాను. హాల్లోకివచ్చాడు సామి. ఆయన ముఖంలో ప్రసన్నతకి ఏమాత్రం కొదవలేదు.

నన్ను చూడగానే నవ్వుగా నవ్వాడు. ఆ నవ్వుల్లో ఏముందో తెలియాలంటే నేను గూడా సామి అంతవాడిని కావాలి. లేదా రామ్మూర్తి శిష్యుణ్ణికావాలి. లేదా కనీసం సామి శిష్యుణ్ణైనా కావాలి. ఇవేవీ కాకుండా కేవలం డొక్కు ముఖం వేసుకున్న నాకు యీ నవ్వే కాదు, నవ్వుకొసలు గూడా అందవు.

'ఈరోజు వ్యవహారాలు యిప్పుడే పూర్తి అయ్యాయి.'

'పూర్తి అవటం అంటూ ఎక్కడికి లెండి.'

'మనవ్వా పెద్దవ్యవహర్తవేనోయ్?' సరిగ్గా టైముకువచ్చావు.'

'అవును మరి. ఎక్కడ ఆలస్యం అయి పోతుందోనని గబ గబా వచ్చేశాను.'

'బాగుంది. 'టైమ్'కి యింత 'ఇంపార్టెన్స్' యివ్వటం నాకు బాగా నచ్చింది. 'బిజినెస్ చేస్తే రాణిస్తావోయ్.' కబుర్లు చెప్పి పంపించేస్తా దేమోననే అనుమానం వచ్చింది. మాట మార్చటం ఎంతపని? తలకాయలు మార్చటం చేతనైన వాళ్ళకి మాటమార్చటం మామూలు విషయం.

'మనం యిక్కడే మాట్లాడుకుందామా?

'వద్దు. గదిలోకి వెడదాం. చెవులున్న గోడలు లేవక్కడ.'

గదిలోకి వెళ్ళి చెరోకుర్చీమీద చతికిల బడ్డాం.

'మనిద్దరం కులాసాగానే ఉన్నాం కదూ?' అన్నాడు సామి నవ్వుతూ.

'అవును గురూజీ?'

అటూ యిటూ చూశాను. గాబరా పడకపోయినా. డిటెక్టివ్ సినిమాలో హీరో విలన్ అయిపోయినప్పుడు, హీరోయిన్ ఏమవ్వాలో తెలియక తంటాలు పడుతూంటే విలన్ హీరోగామారి పోయి హీరోయిన్‌ని రక్షించినప్పుడు 'బ్యాక్‌గ్రౌండ్‌లో' మోగే వయొలిన్ రాగాల దజన్లు ప్రతిధ్వనించాయి.

సామి మరో నవ్వు విసిరి అన్నాడు.

'అసలు లోకంలో ఎవరి కులాసా ఎవరికీ అక్కర్లేదు. అయినా రోడ్డుమీద కనిపించిన ప్రతివాడూ పళ్ళికిలిస్తూ 'కులాసాయేనా?'

'మరి ?'

'ఇవన్నీ ఒక్కసారిగా ఓ అమ్మాయిమీద ప్రయోగించాడు. సాంకేతికంగా చెప్పాలంటే పిట్టవల్లో పడిందన్నమాట. కాని, పిట్టవల్లో పడి వలను కొరికెయ్యటానికి ప్రయత్నించింది. ఇది - రామ్మూర్తి లవ్ ఎడ్వెంచర్, వింటావా ?'

'ఓ .... అందులో లవ్ ఎడ్వెంచర్ ఎవరు వినరు ? ప్రతి వాడూ జీవితంలో కాస్తోకూస్తో లవ్ అంటూ ఏడుస్తాడుగదా ? ఇంక 'ఎడ్వెంచర్' అంటావా, కొందరికి పెళ్ళాంతో మాట్లాడటమే పెద్ద 'ఎడ్వెంచర్'.

'నీ' ఇమాజినేషన్ మరీ 'డల్'గా ఉందోయ్, చల్లారిపోయిన కాఫీలాగ. రామ్మూర్తి ఉద్దేశ్యంలో యిటువంటి ఛోటామోటా విషయాలు లెక్కలోకిరావు. ఆ మాటకొస్తే అందరిలాగ 'సింపుల్'గా ఓ కాలేజీలో చదివే కన్నెపిల్లతో ఉడాయించటం ఎడ్వెంచర్ కాదు రామ్మూర్తిదృష్టిలో, అది 'ఛీప్‌రేట్ లవ్‌మేకింగ్.' కావలసిన అమ్మాయిని పట్టటంలో ఏమీ అనుమానంలేదు. కేవలం 'ప్రొసీజర్'లో తేడా, అంతే.' రామ్మూర్తికి కావలసిన వస్తువు రామ్మూర్తి దగ్గరకే నడచివస్తుంది, రామ్మూర్తి కోసం, ఏ విధంగా నంటావా ?'

'ఆ .... అంటాను. చెప్పక తప్పదంటాను.'

'నీ బాధ నాకు అర్థం అయింది. రామ్మూర్తి, మొదటిసారి ఆ అమ్మాయిని అంటే సావిత్రిని చూసినప్పుడు నిజంగా 'థ్రిల్' అయిపోయాడు. ఆ "సింప్లిసిటీ,' కొట్టొచ్చేకళ్ళు, దారిపోతూన్న వాళ్ళని నిలేసే 'ఫ్లేచరూ' అదీను....'

సావిత్రి నాకళ్ళల్లో మెరిసింది.

'మద్రాసు నుంచి కొత్తగా ట్రెయినింగ్ అయి వచ్చినవాడు గదా మరి రామ్మూర్తి. ఎవరిని చూసినా, ఆమనిషి తాలూకు 'బయాగ్రఫీ'ని బట్టీ పట్టినట్టు అప్పజెప్పెయ్యగలగటం ఆ విద్యకు పునాది, అందుకే ఆ అమ్మాయి కోటీ బస్‌స్టాప్ దగ్గర కనపడగానే అందరిలాగా విజిల్ వేసి 'ఎటెన్షన్' 'డ్రా' చెయ్యలేదు. ?

'మరేం చేశాడేమిటి ?'

'తొందరపడకు మరి అదే మనం తెలుసుకోవలసిందీ; చాలా జాగ్రత్తగా నన్ను దగ్గరుంచుకుని అర్థం చేసుకోవలసిందీను.?

బస్‌స్టాప్‌దగ్గర బాగా 'రష్'గా ఉంది. ఒకళ్ళ నొకళ్ళు తోసు కుంటున్నారు. సావిత్రి చేతుల్లోనిపుస్తకాలు క్రిందపడ్డాయి. లోకోప కారానికి ఉపయోగపడేలాగ.

పడిపోయిన పుస్తకాలూ, జడలోంచి రోడ్డుమీద దుమ్ములో పడ్డ మల్లెపువ్వులూ, గాలికి ఎగిరిపోయి దూరంగా లేని డస్టుబిన్‌లో పడబోతూన్న చేతిరుమాలూ, చరిత్రని సృష్టించాయి. 'లౌక్యప్రేమ' అనే శాస్త్రంలో.

'కొత్తశాస్త్రం గురూజీ. 'లౌక్యప్రేమ.'

'అది 'రిసెర్చి'కి సబ్జక్టోయ్. అయినా యిందాక నేనే చెప్పి నట్లు. నీకు రామూర్తి కథలో నా కథకూడా మినాయించవలసి వచ్చి నట్లుగానే, యీ పురాణం పూర్తి అయ్యేలోపుగా కొన్ని కొన్ని ముఖ్య విషయాల మీద మనకు తెలియకుండానే సమగ్రమైన విమర్శ చేసి ఊరుకుంటాం. సరే సమయం వచ్చింది గనక చెబు తున్నాను. 'లౌక్య ప్రేమ' అంటే విను. లౌక్యప్రేమ అంటే— లౌక్యం అంటే తెలుసునుగదా ?'

'తెలియదు.'

'మరీ మంచిది. కాని, నేనొక్కమాట అడుగుతాను అవధానీ....'

'నా పేరు అవధాని కాదుగా ?'

'సరే నీ పేరేమిటి పానకాలరావా ?'

'కాదు.'

'మరేమిటి నీ 'కేరక్టరు' పేరు ?'

'నా పేరు అవధానీ కాదు. నేను కేరక్టర్‌ని అంతకన్నాకాదు.'

'నీకు బోలెడంత దురభిమానం ఉన్నట్లుంది చూస్తే. సామి నన్ను గుచ్చి గుచ్చి అడిగినట్లు చూశాడు. ఒక్కచూపులో ఎంత అయినా చెప్పెయ్యగలగడం 'ఏ' క్లాస్ యాక్టర్లకే తగింది. మరి సామి నాటకాల్లో వేషాలు వెయ్యకపోయినా సిల్వర్‌జూబిలీ చేసుకున్న యాక్టర్‌లాగా నటించగలడు.

'నీకు మొదటే చెప్పాను. ప్రశ్నలువేసే లక్షణాన్ని కలుపు లాగ పీకిపారెయ్యాలి నీలోంచి. ఆలోచించుకో మరోసారి. ప్రతిసారీ అడ్డుప్రశ్న వేశావో చెప్పేకథ ఆడ్డిపోతుంది. నాకేం పర్వాలేదు. మరో క్లయింటు దొరుకుతాడు. నీకు మరోగురువు దొరుకుతాడా?'

'దొరకడు' అన్నాడు. ఆ సమయంలో నాలుగు నాలుగులో నాలుగేకదా అంటే. 'అవును హుజూర్' అనిఉందును.

'మళ్ళీ ప్రశ్న అడగను. మీరు అడగమంటేనే తప్ప.'

'ఎంతసేపు యీ బుద్ధి? నిన్నుచూస్తే నిజంగా జాలివేస్తోందోయ్ రామారావ్!'

'నా పేరు రామారావ్ కాద'ని అనబోయి గొంతులో మాట లోపలికి తోసేశాను నాలికతో.

సంతోషించాడు నా బుద్ధిమంతతనానికి స్వామి. ఒక్కసారి సిగరెట్ పఫ్‌చేసి, చూడు లోహితాస్యా. లౌక్యం అంటే లోకానికి సంబంధించిన వ్యాపారమన్నమాట.

'బాబోయ్ మీకు స్కూల్లో తెలుగుపండితుడికన్నా ఎక్కువ తెలుసులా ఉంది చూస్తే!'

'అదుగో మళ్ళీ ఒలికపోస్తున్నావ్ నీ యెక్సిపియేషన్ ఆఖరు దాకా ఉంచుకో? స్కూల్లో తెలుగుపండితుడూ, కాలేజీలో తెలుగు లెక్చరర్ - పిక్కోద్దయూ తెలుగూ తెలివికీ లిమిట్' లాగా ఉంది నీ ఉద్దేశ్యంలో' అని యిటూ అటూ చూసి 'ప్రేమ అంటే ...చిక్కుల్లో పడ్డానోయ్ శాస్త్రి. నా లవ్ స్టోరీ జ్ఞాపకం వస్తోంది కానీ, దాన్ని పక్కనబెట్టి, ప్రేమ అంటే ఏమిటో చాలా సింపుల్‌గా చెప్పెయ్యమంటావా?'

'వద్దు. మరీ అంత సింపుల్‌గా చెప్పకండి. అసలే అర్థం కాదు. మీరు చెప్పదలచుకున్నట్టుగానే చెప్పెయ్యండి. ఎక్కడ అర్థంకాకపోతే అక్కడ వికారముఖం వేస్తాను. దాన్ని బట్టి మీరే వివరిద్దురుగాని.'

'ఊ........'

'సామి తెలివితేటలు నాకు అబ్బుతాయేమోననే అనుమానం రాగానే నా వెన్ను నేనే తట్టుకున్నాను.

'చూడు పక్షిగూడు చూసే ఉంటావుగా?'

'మనిషి ఉదాహరణ యియ్యండి గురూజీ?'

'సరే ఇదీ ఒకందుకు బాగానే ఉంది. అది నెలలో ముప్ఫయ్యో తారీకనుకో. వాడో ఆఫీసులో ఓమూమూలు గుమాస్తా అనుకో. వాడికో యిద్దరు పిల్లలనుకో. ఆ పిల్లల్లో ఒకడికి జ్వరం అనుకో. మందు యిప్పించటానికి వాడి దగ్గర డబ్బులు లేవనుకో. వాడి పెళ్ళానికి చిరిగిపోయిన చివరి చీరమాత్రమే ఉందనుకో. వాడికి ఎక్కడా అప్పుపుట్టలేదనుకో. కన్నం వెయ్యటానికి అభిమానం అడ్డొచ్చిం దనుకో. అప్పుడు రోడ్డుమీద ఏదో లీలగా కనిపిస్తే, అది అటూ యిటూ చూడకుండా జేబులో పెట్టుకుని, సందులోకి వెళ్ళి చూసు కుంటే, అది పదిరూపాయల నోటు అయి ఊరుకుందనుకో. అప్పుడు ఆ సంసారి ఏం చేస్తాడంటావు?'

'ఏమాత్రం ఆలోచించకుండా అవాళో, ఆ వారంలోనో రిలీ జైన కొత్త తెలుగు జానపద చిత్రాన్ని చూసొస్తాడు—' అన్నాను.

'చంపేశావు. చంపకుండా ప్రాణంతీశావు. అదికాదు. ఆ విధంగా తొందరపడి ఆ గుమాస్తా బతుకు తేల్చెయ్యకూడదు. నువ్వన్నది మరో పరిస్థితుల్లో నిజంకావచ్చును. కాని, యీ అన్యాయ మైన పరిస్థితుల్లో ఏం చేస్తాడు? ఆ పదిరూపాయలనోటుని అనుమా నిస్తాడు. అనుమానించినవాడు ఊరుకోక, దగ్గరలో ఉన్న దుకాణాని కెళ్ళి సిగరెట్‌పెట్టె ఒకటి యిమ్మంటాడు, కాస్తఖరీదైన బ్రాండుంది. మారిందా. సిగరెట్‌పెట్టె, మిగతా రూపాయలూ చిల్లర దక్కుతుంది. లేకపోయిందా, దుకాణంవాడు నోటుతోబాటు యిచ్చిన ఆశీర్వాదాల్ని ఆప్యాయంగా పుచ్చుకుని, ఆ నోటును ఎక్కడ దొరికిందో అక్కడే జాగ్రత్తగా డిపాజిటుచేసి వస్తాడు. మారిందా? మరి నువ్వుచెప్పినట్లు ఓ తెలుగు జానపద చిత్రానికి వెళ్ళి చేతులు కాల్చుకోడు. ఆ డబ్బులో మొట్టమొదట భార్యకి ఒక ముతకచీరకొని, మిగతా దాంతో కొడుక్కి మందుకొని, యింక మిగిలింది ఏమి ఉండదుగనుక, తన సొంత

కోర్కెలకి సన్యాసం ఇస్తాడు. అందుకే తమ్ముడూ, వేదాంతం మన దేశంలో అంత తేరగా తయారౌతోంది. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే— ఆ సంసారికి పదిరూపాయల నోటుదొరికినప్పుడు తనకోసం ఏమాత్రం చూసుకోకుండా, తన భార్యకోసం, తద్వారా కలిగిన కొడుకుకోసం దాన్ని ఖర్చుపెట్టేశాడుకదా? ఆ లక్షణం ఉందే, అదే, భార్యకోసం తనకు ఉన్నదీ లేనిదీ అంతా యిచ్చెయ్యాలనుకోవటం, మరి పర్యవసానంతో నిమిత్తంలేకుండా అవిధంగా ఇచ్చెయ్యాలనుకునే ఒకానొక చైతన్య లక్షణం ప్రేమ! ఇది యిద్దరి మధ్యన ఉండే, తిరుగాడే గాలి. హృదయాన్ని అంటిపెట్టుకుని ఉండే ధూళి. ఒక్కొక్కప్పుడు, యింకొంచెం లోపలికివెళ్ళి గలాటాచేసి బతుకుని లైలామజ్నూ లాంటి కథల్లామారటానికి వీలుగా తయారు చేస్తుంది.

'ఈ ప్రేమ అనే ఆవిరి పదార్థంకోసం మహామహావాళ్ళు మసై పోయారు. కనక, యీ ప్రేమ అనే 'ట్రాప్'లో పడకుండా ఉండటం మంచిది. అథవా పడ్డా, ఉట్టి వెధవై పోకుండా, ఆట్రాప్‌లో కూడా బిజినెస్ చెయ్యగలగటం రామ్మూర్తి చేసిన 'ట్రిక్'.

'క్లాప్' కొట్టాడు సామి,

'ఈ విధంగా ప్రేమ అనే చేతికందని చాలా పెద్ద పదార్థాన్ని, బిజినెస్ కోసం, శుద్ధమామూలుగా చెప్పాలీ అంటే బతుకు తెరువు కోసం ఉపయోగించుకోవట మనే ప్రక్రియే 'లౌక్య ప్రేమ' అన్నమాట.

'ఇంతచెప్పి నేను మాత్రం ఎలా ఆగగలను గనక? తరవాత ఏం జరిగిందో చెప్పకపోతే నీకూ నిద్రపట్టదు, నాకూ తోచదు, ఆపడి పోయిన పుస్తకాన్ని అతి అప్యాయంగా తీసి యిచ్చి ఒక్కచూపు విసిరాడు. ఆ చూపులో తన ప్రతిభనీ, తను చెయ్యగలిగినవీ చేయ దల్చుకున్నవీ—అన్ని ఘనకార్యాల్నీ హుటా హుటిగా అందజేశాడు.

సావిత్రికూడా మరోచూపువిసిరింది ఆ చూపులో రామ్మూర్తికి ఏమీ అంతు బట్టలేదు. తనను అంత తేలికగా తీసి—పారెయ్యలేదని సంతోషించాడు రామ్మూర్తి. అప్పటికి అదే పెద్ద యిన్‌వెస్ట్‌మెంట్.

'మీరు యింకో బస్సులో ఎందుకు వెళ్ళకూడదు?'

'ఎందుకో?'

'మీ పుస్తకాలు పడిపోయాయి....' ఇంకేమనాలో తోచలేదు. రామ్మూర్తికి కారణం వెంటనే సూదంటురాయిలాంటి బుద్ధికి కూడా తట్టలేదు. అమ్మాయిని చూడంగానే ఆయిపై పోయే రకం కాదు రామ్మూర్తి. అయినా సావిత్రి మొత్తంమీద ఒక చిన్న అస్త్రంలాంటి దేదో విసిరిఉండాలి అనిపించింది.

'పోనీలెండి. మీరో నేనో పడిపోలేదుగా!,

'పడిపోతే మాత్రం ఏంచేస్తాం అంటారు?'

'అయినా ఒక్కొక్కప్పుడు పడిపోవటం కూడా మంచిదేనేమో?'

'ఎందుకో!'

'మనం కూడా పడిపోగలమని మర్చిపోకుండాను?'

తర్వాత మళ్ళీ డైలాగుకి తడబడ్డాడు రామ్మూర్తి.

'మీరు మరేం అనుకోకపోతే, మనం కాఫీ తాగుతేనో?'

ఒకసారి స్టయిల్‌గా గడియారం చూసుకుని 'పదండి ఫస్ట్ పీరియడ్ ఎలాగూపోయింది. మీవల్లా .... బస్సువల్లా.'

ఎదురుగా టాజ్ హోటల్లోకి వెళ్ళి కాఫీ 'సిప్' చేస్తూ—

'నన్ను రామ్మూర్తి అంటారు' అని ఒక్క క్షణం ఆగి, 'చాలా పాతపేరు కదూ!' అన్నాడు.

చిన్న చిరునవ్వు పారేసింది సావిత్రి.

'అంటే, వెంటనే నా పేరు చెప్పెయ్యాలనుకుంట. అంతేనా!'

'అదేం కాదనుకోండి. ఏదో అనుకోకుండా మీరు బస్సు దగ్గర కలవటం, మీ బస్సు వెళ్ళిపోవటం.'

'అవును మనం కాఫీ తాగటం....మనలో బిల్లు ఎవ్వరివ్వాలా అని ఘర్షణ పడటం....'

ఇద్దరూ నవ్వేశారు, చుట్టుపక్కలకూడని తియ్యతియ్యగా గుసగుసలాడుతూన్న జంటలు తలలు పక్కకు తిప్పేలాగ.

'చూశారా, మనం ఎంతమందిని యిటుతిప్పగలిగామో ? ఇదే కావలసింది. రాజకీయాల్లోనూ, జీవితంలోనూకూడా....' అన్న రామ్మూర్తిమాటను పూర్తి చెయ్యకుండానే అన్నది సావిత్రి....

'మీపేరుకేం నిక్షేపంలాగ ఉంది. నాకు నచ్చింది. నాపేరు మీద మీ అభిప్రాయం చెప్పకండేం ? మా అమ్మా నాన్నా పెట్టిన పేరు సావిత్రి. దాన్ని మార్చదలుచుకోలేదు. ఎవరికి నచ్చినా నచ్చకపోయినా, నేను ఎక్కడ ఉంటానూ అని అడగకండేం ?'

'మీరు కొంచెం స్నేహంగా మాట్లాడినంత మాత్రాన, మీ ఎడ్రసు పుచ్చుకుని వచ్చేస్తాననుకున్నారా ? మీకు నా మీద ఆవిధమైన అభిప్రాయం ఎందుకు కలిగింది ?'

'మీరు వాదంలోకి దిగేలా ఉన్నారు. మీరే గెలిచారులెండి యివాల్టికి ! అని మళ్ళీ యింకోసారి మరికాస్త 'స్టయిల్'గా గడియారం చూసుకుని, 'చాలా థాంక్స్. మీరిచ్చిన కాఫీకి, కంపెనీకీను.' అని లేచి రామ్మూర్తి చేత బిల్లు యిప్పించి రిక్షాఎక్కి వెళ్ళిపోయింది రామ్మూర్తిని ఆలోచనల ముళ్ళపొదలోకి తోసేసి.

మొట్టమొదటసారిగా రామ్మూర్తి ఓ అమ్మాయిని గూర్చి అంతగా పట్టించుకున్నాడు.

'ఆకర్షణ అట్లాంటిది. మహామహావాళ్లు చిత్తయిపోయారు. మనమోలెక్కా ?' అనుకున్నాడు. మరోక్షణానికి మామూలు మనిషి అయిపోయి.

ఒక గుక్క చార్మినార్ సిగరెట్ పొగలాగి, ఒక్కచిటికెలో సిగరెట్ 'ఆష్' దులపగానే 'బ్రెయిన్‌వేవ్' వచ్చింది.

'ఇంతకన్నా అందమైన కాలేజీ అమ్మాయిల్ని చూశాను. మరీ చురుకైనవాళ్లని మద్రాసునుంచి హైద్రాబాదుదాక చూస్తూనే ఉన్నాను. ఎందువల్ల సావిత్రి నన్ను యింతగా ఆకర్షించింది ? అన్నీ ఒక్కసారి కలిసికట్టుగా వచ్చినట్టున్నాయి .... అందానికి అందం .... కలుపుగోలుదనం .... ఏదో చెప్పలేని ఆకర్షణ .....'

సావిత్రి ఎప్పుడైతే రామ్మూర్తిని ఆకర్షించిందో, రామ్మూర్తికి

నిద్రాహారాలకి ఓ రకంగా కొంచెం యిబ్బంది కలిగింది. ఒక్కసారి లేనిపోని చిక్కు వచ్చిపడింది.

బస్‌స్టాప్ దగ్గర కనిపిస్తుందేమోనని ఓ వారంరోజుల పాటు తెగకాపలా కాశాడు. యూనివర్సిటీకి వెళ్ళే అన్ని బస్సులూ యించు మించు గాలించేశాడు. సావిత్రికన్న ఎన్నో రెట్లు అందమైనవాళ్లు కనిపించారు గాని, సావిత్రి మాత్రం కనిపించకుండా పోయింది.

రామ్మూర్తికి యించుమించు 'ప్రిస్టేజ్ యిస్యూ' అయికూచుంది. సావిత్రిని వెతికి పట్టుకోవటం.

'వెతికితే దొరకటానికి మార్కెట్‌లో వస్తువా ఏమన్నానా?' అందుకే, సావిత్రి అనే సుతారమైన అమ్మాయి రామ్మూర్తిని అనే వాడి కళ్లకి కనపడకుండా పోయింది.

ఈ లోపుగా రామ్మూర్తి 'హార్ట్‌బీట్' పెరిగింది. ఒకానొక శుభసాయంత్రం టాంక్‌బండ్ మీద విలాసంగా 'చిప్స్' తింటూ కనిపించింది సావిత్రి.

మరో లోకంలో తిరిగివచ్చి, ఆ లోకంలో నానా అగచాట్లూ పడి, మళ్ళా కావలసిన వాళ్లను కలుసుకున్నప్పుడు కలిగినంత సంతోషం కలిగింది రామ్మూర్తికి.

తనూ ఓచిప్స్ పొట్లం కొనుక్కుని, కోర్కెల్ని బలవంతంగా అణగదొక్కి, అయినా చాలా దగ్గరగా వచ్చి 'హలో' అన్నాడు రామ్మూర్తి.

'ఎవరు నువ్వు' అన్నట్లు చూసింది సావిత్రి. పక్కన వున్న యిద్దరు చెలికత్తెల్లాంటి వాళ్ళు ఉన్నారు. వీళ్ళెవరు, హీరోయిన్ పక్కన అటో డజనూ, యిటో డజనూ పళ్ళికిలించె 'ఎక్‌స్ట్రా'ల్లా కనిపించారు వాళ్ళు రామ్మూర్తి కళ్ళకి. రామ్మూర్తి కళ్ళు చెదిరేయి. కంటికి ఏమన్నా అయిందా? చత్వారం యింత చిన్నప్పుడు రాదే? అని బాధపడుతూ 'చిప్స్' ఒక్కొక్కటే తింటూంటే మళ్ళీ అటు వచ్చి ఒక్క చిరునవ్వు విసిరింది తొలకరి వానజల్లులాగ.

ఆ నవ్వులో రామ్మూర్తికి యించు మించు తన జీవితాన్ని అంతటినీ దిద్దుకున్నట్లనిపించింది ఆక్షణంలో!

రూమ్‌కి వచ్చేశాడు—చిక్కడి పల్లిలో, చీకటి గల్లీలోకి. అయినా మొదటిసారిగా అనిపించింది రామ్మూర్తికి, తనకు జీవితంలో ఏదో దొరికినట్టు దొరికనిపించినట్టు తన 'ట్రెయినింగ్' పనికి వస్తున్నట్లు.

'ఈ మొదలెట్టిన కథ పొడిగించాలి.' అనుకున్నాడు. మరో సిగరెట్ మజాగా వెలిగిస్తూ. కిటికీలోంచి బయటకు చూద్దామని పించింది. కాని, అటూ యిటూ తిరిగే పందులూ, మురికి కాలవా తప్ప మరేం కనిపించదని తెలుసుకోగానే, ఊరుకున్నాడు కదల కుండా. ఆ మధురక్షణాల్ని అదే విధంగా దాచుకున్నాడు ఎంతో ఆశగా. ఆప్యాయంగా నెమరు వేసుకుంటూ.

* * * *

# 4. రామ్మూర్తి ఎడ్వెంచర్స్-మరోరసవత్తరఘట్టం

## (ప్రేమనుంచి బయట పడటం)

సెల్‌లాంటి రూమ్‌లో, కాన్‌సెన్‌ట్రేషన్‌క్యాంప్ లాంటి గల్లీలో, చిక్కడిపల్లి చీకట్లో, హైదరాబాదు నగరంలో, తలమీద చేతులు పెట్టుకుని ఆలోచనలో పడ్డాడు రామ్మూర్తి.

'ఏం చెయ్యటం ?' గది గోడలకి మాటలు తగిలి తిరిగి తనకే మళ్ళా వినిపించాయి. 'ఏం చెయ్యటం ? ఏం చెయ్యటం ?'

మరెవ్వరైనా అయితే, మామూలుగా ప్రేమలోపడ్డవాడికిమల్లే ఒక ఊహా ప్రపంచాన్ని నిర్మించుకుని, మరో ఊహాసమాజాన్ని కల్పించుకుని, అది పీడిమీద విరుచుకు పడటం, అంతిమ విజయం తనదే నన్నట్లుగా ఉత్సాహపు కాఫీతాగుతూ ఆ ఆలోచనల మేలి ముసుగులో పడి సొమ్మసిల్లిపోటం చేసేవాడు.

రామ్మూర్తి ఓనమాలు అమ్మాయికోసం బుట్టలో పడిపోయే రకంకాదు. సావిత్రికూడా రామ్మూర్తిని చూడగానే 'పీడిని ఉపయో

గించుకోవచ్చు' అనుకుంది. ఎందుకైనా పనికి వస్తాదనుకుంది గనకనే నిర్భయంగా కాఫీ తాగటానికి వెళ్ళింది.

రామ్మూర్తికి ఓ ఆలోచన వచ్చింది. సావిత్రి యూనివర్సిటీలో చదువుతూవున్న అమ్మాయిగదా, ఏవిధంగానైనా కాపలాకాసి పట్టుకోవా లనుకున్నాడు.

'ఇక్కడ ఓ చిన్న అనుమానం వచ్చింది ?'

'ఎందుకు వచ్చింది ? నేను రమ్మనకుండా ఎందుకు వచ్చింది?'

'మరీ మీరు, మరీ అవిధంగా అంటే నేను మరీ యిద్దై పోతాను. ఇంతపెద్ద రామ్మూర్తి యింత మామూలు అమ్మాయికోసం అవస్థపడ్డాడంటే నేను ఎలానమ్మటం ?' అని కొంచెం ఆగి, 'మీరే చెప్పండి....ఎలా నమ్మటం....?' అన్నాను.

'నువ్వెందుకు అసలు నమ్మటం ? నువ్వు నమ్మటానికీ ఒక పని జరగటానికీ ఏమిటోయ్ పంతులూ సంబంధం ?'

'ఏమీలేదు'

'మరి యింక యిటువంటి అడ్డదిడ్డం ప్రశ్నలు వెయ్యకు'

'నేను మళ్ళీ వూరుకున్నాను. నిజమే ! నాకు ఏమీ అను మానాలు రాకూడదు. వచ్చినా వచ్చినట్టు చెప్పకూడదు.'

'రామ్మూర్తి సరీగట్టిగా తలుచుకుని సావిత్రికోసం యూని వర్సిటీకి వెళ్ళాడు. కళ్ళు అలుచిప్పలు చేసుకుని వెదికాడు. అసం ఖ్యాకంగా అమ్మాయిలు కవిపింవారుగాని సావిత్రిమాత్రం కనిపించ లేదు. డిటెక్టివ్ నవలని మించిపోయింది సస్పెన్సు. భరించలేక మరొడెవడైనా అయితే మరేమైనా చేసేవాడే. అంటే మరో అమ్మాయిని లవ్ చేసేవాడు. కాని రామ్మూర్తి అలాచెయ్యకుండా మరోపని చేశాడు. అదేమిటని అడుగు ?

అడిగాను.

'అంటే అడగమనికాదు. అది ఓ ఊతపదం. రామ్మూర్తికి కనిపించకపోయేసరికి సీరియస్‌గా యింటికి వచ్చేశాడు. రామ్మూర్తి బుర్ర పనిచెయ్యలేదు.

'అసలు ఎందుకీ క్రీచర్ యీ విధంగా నన్ను మభ్యపెట్టి మాయమైపోయింది' అని మరీ మరీ అనుకున్నాడు. సావిత్రి కవి పించకపోవటంకన్నా తను మోసపోయానేమోనన్న బాధ మరో బాధా కరంగా మారింది.

'నిజంగా సావిత్రిగనక తనని ఫూల్ చేసి వెళ్ళిపోయి వుంటే రెండోసారి కలిసినప్పుడు తనకోసం ప్రత్యేకంగా దాచిన చిరునవ్వుని దేనికి పంచిపెడుతుంది? కాదు. తనని ఫూల్ చెయ్యలేదు.' ఆవిధంగా అనుకోటం కేవలం ఓ మామూలు ప్రేమికుడి బలహీనత అనుకున్నాడు.

తను లోకంమీదపడి బతకబోతున్నాడు. ఈలూటీలో సావిత్రి కలిసివస్తే ఎంత బాగుండును? సావిత్రి తనతో కలిసిరాదని ఎందుకు అనుకోవాలి? ఈ అనుమానం రావటమే పెద్ద పొరబాటు. తనకు అసాధ్యం అన్నది ఉండకూడదు.

అందుకే సాయంత్రం దాకా కావలసినన్ని కలలుకని, బయటకు బయలుదేరేటప్పుడు, వాటిని శుభ్రంగా కడిగేసుకుని, క్లియర్ హెడ్‌తో బయటకు వచ్చాడు.

'సరాసరి బస్సులోంచి టాంక్‌బండ్‌మీద దిగాడు. కాసిని బటానీలు కొనుక్కుని ఒక్కొక్కటీ తింటూ, అందరిమీదా చూపులు విసురుతున్నాడు.

ఇంతలోకే పక పక మని నవ్వు వినిపించేసరికి వెనక్కుతిరిగి చూశాడు రామ్మూర్తి. ఎవరో యిద్దరు కులాసాగా, చలాకీగా నీళ్లల్లోకి రాళ్లు విసురుతున్నారు.

ఓరగా చూశాడు రామ్మూర్తి. కొంచెం క్యూరియస్‌గా చూశాడు. వాళ్ళకు తెలియకుండా వాళ్ళను చూశాడు. మరీ మరీ చూశాడు. తన సొంతకళ్ళను తను నిరభ్యంతరంగా నమ్మగలడు. అనుమానంలేదు. కళ్ళకు చత్వారంలేదు. కొంచెంసేపు ఆగాడు. ఐస్‌క్రీమ్ వాడు మరీ పేచీపెడుతున్నాడు తీసుకోమని. వాళ్ళు కొత్త పక్షులని తెలుసుకున్నాడు వాడు.

పక్కనున్న మీసాలబ్బాయి మరీ బలవంతం చేస్తున్నాడు 'ప్లీజ్ మిస్ వనజా....' అంటూ.

'ఆ అమ్మాయి మరీ 'మోడెస్టీ' ఒలకబోస్తూ తీసుకుంది. వనజ! వనజ ఎవరు?

రామ్మూర్తి కొంచెం దగ్గరగా వెళ్ళి, "ఎక్స్‌క్యూజ్ మీ" అన్నాడు.

ఇద్దరూ ఓమాదిరిగా గాబరాపడ్డారు. అది కనిపించకుండా కొంచెంగా చికాకుపడ్డారు వాళ్ళిద్దరూ. ఒంటరితనం.... ఏకాంతం.... రోడ్డు పక్కన....ఏదో పెద్దపని ముంచుకు వచ్చినట్టు పలకరించటం?

'క్షమించండి మిమ్మల్ని 'డిస్టర్బ్' చేసినందుకు! మీ పోలిక గల ఓ అమ్మాయి గుంటూరులో నాకు కాలేజిమేట్. ఆ అమ్మాయి పేరు.... ....ఆ అమ్మాయిపేరు సావిత్రి....'

ఆ మీసాలబ్బాయి కొంచెం గొంతు సవరించుకుని....

'ఈ అమ్మాయి మీరనుకున్న సావిత్రి మాత్రం కాదు.' అని సావిత్రివైపు తిరిగి 'మిస్ వనజ.' ఉస్మానియా యూనివర్సిటీ ఆర్ట్స్ కాలేజీలో ఫైనల్ ఇయర్ చదువుతున్నారు. మరి నన్ను ఆనంద్ అంటారు, ఫిలాసఫీలో రిసెర్చిచేస్తున్నా. ఆంధ్రాయూనివర్సిటీలో....' అని పరిచయం చేసుకున్నాడు.

రామ్మూర్తి కొంచెం గొంతు సవరించుకుని, "నన్ను దుర్గా ప్రసాద్ అంటారు. మీరూ అదేవిధంగా అనండి. 'అని నవ్వి.' నేను ఓ అమెరికన్ పేపర్‌కి రిపోర్టర్‌గా ఉంటున్నాను.

వాళ్ళిద్దరూ రామ్మూర్తివైపు ఆదోరకంగా చూశారు.

'లాడ్జికి వెళ్ళాలి. మీరు రాకూడదూ?'

'నేనా?'

'ఏం? రండి' అన్నాడు ఆనంద్, సావిత్రి తనకు ఏమీ పట్టనట్టు మరో వైపుకు చూపింది.

టాక్సీ నాంపల్లి రాయల్ హోటల్ దగ్గర ఆగింది. గదిలో ముగ్గురూ కాఫీ తీసుకున్నారు. గదిలో చిందర వందరగా పుస్తకాలు పడేసి ఉన్నాయి. రాత్రీ పగలూ అంతా చదువుతూ రాస్తూ గడపటం వల్ల రూమ్ అంతా చిందర వందరగా ఉంది. 'బోయ్' క్లీన్ చెయ్య లేదులా ఉంది.

ఆనంద్ అన్నాడు. 'అసలు నేను హైద్రాబాద్ రావలసిన పనేలేదు. ఎంతో కాలంబట్టీ ఉత్తరాలు రాస్తున్నాడు మామయ్య వరంగల్‌నుంచి. వరంగల్ ఎలాగూ వచ్చాను గదా హైద్రాబాదు వచ్చాను. ఉస్మానియా యూనివర్సిటీలో కొన్ని 'రేర్' మేన్‌స్క్రిప్ట్‌లు ఉన్నాయంటేనూ ప్రొఫెసర్‌ని కలుసుకుందామని వచ్చాను. యూనివర్సిటీ లైబ్రరీలో మిస్ వనజ పరిచయమైంది. ఇప్పుడు మీరు కలిసారు.'

ఏమీ మాట్లాడకుండా కూచుంది వనజ.

'మీరు, ఏదో ఆలోచిస్తున్నారు?' అన్న ఆనంద్‌ని మాటని పూర్తి చెయ్యనియ్యకుండానే అన్నది. 'మీ పోలికగల మా బ్రదర్ క్లాస్‌మేట్ రామ్మూర్తి అని ఒక అతను ఉండాలి. ఆయనకూడా మీలాగే చాలా గమ్మత్తుగా మాట్లాడతారు....'

'చాలా గమ్మత్తుగా ఉందే. సినిమాలాగ.'

అందరూ నవ్వేశారు.

'మనిషిని పోలిన మనిషి ఉండొచ్చు. సినిమాల్లో లాగ 'డబుల్ రోల్' మనక జీవితంలోగూడా వేస్తే యింకాగమ్మత్తుగా ఉంటుంది.'

మళ్ళా అందరూ నవ్వేశారు.

'మీరింకా ఎన్నిరోజు లుంటారు ఊళ్ళో?'

'రేపు వెళ్ళిపోవాలనుకుంటున్నాను. దొరికితే మంచికండిషన్‌లో ఉన్న మంచి పోర్టబుల్ టైప్‌రైటర్ కావాలండి....'

'నాది తీసికోండి.'

'మీదా?'

'ఏం? నేను ఇయ్యకూడదా?'

'ఎందుకులెండి మీకా శ్రమ?' అన్నది వనజ ఓరగాచూస్తూ నవ్వుతూ.

'ఈ మాత్రానికి శ్రమేమిటి? రేపు పొద్దున్న తొమ్మిది గంటలకి మీ హోటల్ రూమ్‌లో 'బేబీ హెర్మిస్' టైప్‌రైటర్ వుంటే సరా!'

'మరి డబ్బో?'

గట్టిగా నవ్వాడు రామ్మూర్తి.

'డబ్బుకేమిటండీ? మీరెక్కడికి పోతారుగనక!....' అని కొంచెం ఆగి, 'నేను వస్తా. మళ్ళీ రేప్పొద్దున్న కలుద్దాం. మీతో ఉన్న కాస్సేపూ హాయిగా గడిచింది' అని గడియారం చూసుకుని రామ్మూర్తి లేవబోతూంటే—

'మీరు ఎటువెడుతున్నారు?' అంది వనజ.

'టాక్సీలో నేనా? ఎటైనా వెళ్ళొచ్చు. మిమ్మల్ని 'డ్రాప్' చెయ్యమంటే ఏ మాత్రం అభ్యంతరంలేదు.

వనజ ఆనంద్ దగ్గర సెలవుతీసుకుని రెండు బుగ్గల పేకట్లతో చిరునవ్వు ఒకటి విసిరింది.

'రేపు కలుస్తారుకదూ' అన్నాడు ఆనంద్.

'లేదండీ క్లాస్‌లు ఉన్నాయి. రాత్రి రైలుకేగా మీరు వెడుతున్నది? స్టేషన్‌కు తప్పకుండా వచ్చికలుస్తాలెండి'

వనజ ఆనంద్ ఒకళ్ళవైపు ఒకళ్ళు మరోసారి చూసుకున్నారు.

వనజా రామ్మూర్తీ టాక్సీలో కూచున్నారు.

'మిమ్మల్ని ఎక్కడ డ్రాప్ చెయ్యమన్నారు?'

'రోడ్డుమీద మాత్రం కాదు'

'చాలా చమత్కారంగా అన్నారు'

టాక్సీలో ఒకళ్ళపక్కన ఒకళ్ళు కూచున్నారుగాని, ఎవరూ మాట్లాడడంలేదు ఎవరికి వాళ్లు ఎదటివాళ్లు మాట్లాడుతా రనుకుని ఊరుకున్నట్టుగా ఉంది. దిగి వెళ్ళిపోయేలోగా కొన్ని విషయాలు ఎలాగైనా అడిగి తెలుసుకోవాలనుకున్నాడు రామ్మూర్తి.

'బస్‌స్టాండ్ దగ్గర మీ పుస్తకాలు పడిపోయాయి. అవాళ మీకు జ్ఞాపకం ఉందా?'

'ఉ........'

'అవ్‌కోర్స్, అది అంత జ్ఞాపకం ఉంచుకో తగ్గదేమీ కాదనుకోండి?'

'ఉహూ.'

'మాట్లాడకూడదనుకున్నారా?'

'ఉహూ....'

'మీ నేర్పుకి నిజంగా మెచ్చుకు తీరాలి?'

'ఊ?'

'అందుకే ఆడవాళ్ళు అబద్ధం ఆడితే నిజంకన్న అనేక రెట్లు నిజంగా ఉంటుందంటారు....'

'మగవాళ్ళు అబద్ధం ఆడితే గోడ కట్టినట్లు ఉంటుందంటారు కూడాను....'

'పోనీ లెండి. యిప్పుడైనా మాట్లాడారు.'

'రామ్మూర్తి ముఖంలో గెలిచిన వాడిలో కనిపించే చిరునవ్వు ఛాయలు కనిపించాయి.

'అయినా మనిద్దరికీ తెలుసు.'

'మనమేమిటి దుర్గాప్రసాద్ జీ'

'మీరు ఆ పేరుపెట్టి పిలవకండి?'

'ఏమో?'

'మిమ్మల్ని నేను వనజ అని పిలవనుగనక!'

'దొంగను దొరికానంటారు, యింతకీ!'

'ఒకళ్ళ కొకళ్ళు దొరికినట్టే!'

హిమాయత్ నగర్ జంక్షన్ వచ్చిందని చెప్పాడు డ్రయివర్. మా మాటలధోరణి చూసి మేం ఎక్కడికి వెళ్ళవలసిందీ మర్చిపోయామేమోనని వాడికి అనుమానం కలిగి ఉండాలి. నిజానికి ఎంత ఎక్కువ దూరం పోతే అంత ఎక్కువ డబ్బు వస్తుంది వాడికి.

టాక్సీ ఆపమన్నాడు.

సావిత్రి టాక్సీదిగింది. తనతో ఏదో తీసుకుపోతూన్నట్టని పించింది రామ్మూర్తికి.

'ఈ సందులో నలుగురు ఫ్రండ్స్ కలిసి రూమ్‌లో ఉంటున్నాం. ఎప్పుడైనా రండి రామ్మూర్తిగారూ?

'ఈ ఆదివారం రానా?' అని కొంచెం ఆగి.' ఏమాత్రం తీరిక ఉన్నా తప్పకుండా.' అని మాట పూర్తి చేశాడు.

'అయితే మీరు రేపొద్దున్న....'

'అవును రాయల్ హోటల్‌లో ఆనంద్‌ను కలిసి టైప్‌రైటర్ యిచ్చి....'

'నిజంగానే.... ?'

'కావలసినంత నిజంగా !'

'టాక్సీ డ్రయివర్ వైపు తిరిగి 'చిక్కడపల్లి' అన్నాడు. జంక్షన్‌లో దిగుతూనే 'చిల్లర ఉందా' అన్నాడు రామ్మూర్తి. అప్పుడే హీరోవేషానికి బుక్ అయినవాడి పోజ్‌లో.

'ఎంతది ?' అన్నాడు టాక్సీడ్రయివర్ బ్యాంకు ఏజంటులాగ.

జేబులో చెయ్యిపెట్టాడు. అది చల్లగా పంటిని తాకింది. ఇంతలోకే ఎదురుగా సూట్ వేసుకున్న ఓ పెద్దమనిషి పలకరించాడు "హలో ?' అని.

'మీదగ్గర ఛేంజి ఉందా ?'

'టాక్సీకి యివ్వటానికా ?'

'అఫ్‌కోర్స్ !'

'మీ దగ్గరున్న పెద్దనోటుకు ఛేంజిలేదుకాని. విడి రూపాయలు కావలిస్తే ఉన్నాయి.'

టాక్సీకి మీటరు 'ఆన్' చెయ్యలేదని అప్పుడే చూశాడు రామ్మూర్తి. అయిదురూపాయలనోటు తీసి యిచ్చాడు చదివేసిన న్యూస్‌పేపర్ యిచ్చేసినట్టు ఆ పెద్దమనిషి.

టాక్సీ డ్రైవరు జేబులో చెయ్యిపెట్టి మిగతా చిల్లర యిద్దామని ప్రయత్నిస్తూంటే—

'కీప్ ది ఛేంజ్' అన్నాడు రామ్మూర్తి అప్పుడే వెలిగించిన సిగరెట్ పొగ ఆ పెద్దమనిషిమీదనే వదులుతూ.

టాక్సీ డ్రయివరు సలాంకొట్టి ఉషారుగా వెళ్ళిపోయాడు. ఆ నోటు యిచ్చిన పెద్దమనిషి విపరీతమైన శాంతంగా చూశాడు

రామ్మూర్తి వైపు. రామ్మూర్తి ప్రాణానికి ఆ పెద్దమనిషి నిర్వికల్ప సమాధిలోకి పోతూన్నట్లనిపించింది.

రామ్మూర్తికి అంతుచిక్కలేదు. ఎవరు ఈ అయిదురూపా యలనోటును దానంచేసినవాడు? రోడ్డుమీద సరిగ్గా తను టాక్సీ దిగినచోటే ఏలా సిద్ధంగా నిల్చున్నాడు! తన సంగతి కనుక్కుని తనతో అన్నిచోట్లకీ తిరుగుతూ ఆచోకీ తీస్తూవుండాలి. పట్టుకుని అడిగేస్తే!

'సరైన సమాధానం వస్తుందని గ్యారంటీ ఏముందిగనక? సన్నగా నవ్వేసి తనని ఫూల్ చెయ్యవచ్చు. మరో అయిదురూపాయలు యిస్తానంటే మరో రెండుసార్లు ఫూల్ కావటానికి మాత్రం ఎందుకు ఉండాలి అభ్యంతరం!'

అటూ యిటూ చూస్తే చెప్పులుకుట్టేవాడు కనిపించాడు. వాడిపక్కనే తిరుగుతున్న బూట్‌పాలిష్ కుర్రాడు 'పాలిష్ చెయ్య మంటారా' అన్నాడు. మరోపక్కనుంచి 'మాలీష్ తేల్‌మాలిష్' అన్నాడు మరొక్కడు. ఇటు చెరోవైపు ఎగపడి దులిపేస్తూంటే మళ్ళీ ఆ పెద్దమనిషే కలగచేసుకుని యిద్దరికీ చెరికాస్త చిల్లర వెద జల్లి పంపించేశాడు బిర్రాలాగ.

"మీరు ఉండటం ఎక్కడ?" అన్నాడు ఆ పెద్దమనిషి తూలి తూలి.

'క్షమించాలి' అంటూ వెళ్ళిపోబోయాడు. రామ్మూర్తి ఒక్క సారి హీరోనుంచి విలన్‌గా మారిపోయినవాడిలాగ.

'అప్పుడే గనక ఆ పెద్దమనిషి ఊరుకుని ఉంటే ఏమయ్యేదో తెలుసా?' అన్నాడు సడెన్‌గా సామి

'తెలియదు సార్.' 'అది గదీ సంగతి. నీకు తెలుసు పోనీ తెలియదు. తెలిపినా తెలియదన్నావు. అంటే నన్ను చెప్పమిస్తున్నా వన్నమాట. అంటే, నీకు రామ్మూర్తి ఫిలాసఫీలో 'ఇంట్రెస్టు' కలిగిం దన్నమాట....!'

ఒక చిన్న నవ్వులాంటిది విసరి ఊరుకున్నాను. కథకు ఏ మాత్రం అడ్డురాదలచుకోలేదు. ఏ చిన్న ప్రశ్న వేసినా సామి

చెట్టెక్కి కూర్చుంటాడు. కథ చెప్పనంటాడు. చివరికి బ్రహ్మరాక్షసుడి కథలాగ తయారౌతుంది.

'వెళ్ళిపోతూ పోతూన్న రామ్మూర్తి ఆగాడు మంచి తెంపోలో.'

'నా ప్రశ్నకి సమాధానం చెప్పలేదు మీరు?' అన్నాడు ఆ పెద్దమనిషి కుడిచేతిలో సిగరెట్ ని ఎడమచేతి వెనక భాగంపైన స్టయిల్ గా కొడుతూ.

'ఓ.... మీకు అయిదురూపాయలు యివ్వాలికదూ? మార్చి....' అని మళ్ళా జేబులో చెయ్యిపెట్టాడు పోజులో రామ్మూర్తి.

'మీ దగ్గర నుంచి వడ్డీతో సహా నేను తీసుకుంటానుగా మీ యింటికివచ్చి మరోసారి?' అని కొంచెంఆగి. 'ఇంతకీమీరు....?' అన్నాడు.

రామ్మూర్తి ఎంతకీ చెప్పక పోయేసరికి సిగరెట్ పెదవుల మధ్యన బిగించి గిరుక్కున తిరిగి వెళ్ళిపోబోయాడు.

'నన్ను క్షమించాలి మీరు సహజంగా. మీకు ఫ్రీ అయిస్తే మిమ్మల్ని వచ్చి కలుసు కుంటాను రేపు. సాయంత్రం అయిదు గంటలకి.....'

'ఓ తప్పకుండా' అంటూ విజిటింగ్ కార్డ్ తీసి యిచ్చాడు తన లెదర్ బాగ్ లోంచి.

'దానిమీద 'రామ్ రామ్....బ్రోకర్స్ ఫైనాన్సర్స్.' చార్ మీనార్, హైద్రాబాద్' అని ఉంది.

'నా పేరు........'

'రేపు సాయంత్రం అయిదున్నరకి యిదే జంక్షన్ లో మోరిస్ మైనర్ నల్లరంగుకారు నిలబడి ఉంటుంది. అక్కడకువచ్చి డ్రయివర్ కి యీ విజిటింగ్ కార్డ్ గనక చూపించారంటే వాడు మిమ్మల్ని నాదగ్గరకి తీసుకు వస్తాడు. తప్పకుండా వస్తారు కదూ? మీపేరు అప్పుడే చెప్పచ్చు లెండి....' అని యింక ఆగకుండా గబగబా వెళ్ళిపోయాడు.

రామ్మూర్తి చూస్తూ ఉండిపోయాడు. మరోసిగరెట్ అంటించి గట్టిగా నాలుగు దమ్ములు లాగి. నిషా ఎక్కినవాడికిమల్లే చూశాడు..

ఈమనిషి లాంటి వాళ్ళు రోజుకొకడైనా తగిలి, ఓపది రూపాయలు పారేస్తూంటే బాగుండు ననిపించింది.

ఈ ఆలోచన మెదడులో మెరిసి మాయమై పోయేలోపల ఆ వ్యక్తి మళ్ళావచ్చి, 'ఉంచుకోండి, ఎందుకన్నా పనికివస్తుంది. చిల్లర మీరు బ్యాంకుకువెళ్ళి మార్చేదాకా,' అని ఓ పది రూపాయల నోటు యిచ్చాడు.

'ఆ ఎందుకు?' అని అందామని నోటిదాకా వచ్చి ఎందుకులే అని అనలేదు.

మళ్ళీ మళ్ళీ అనుకున్నాడు రామ్మూర్తి. చాలా గమ్మత్తుగా ఉందే?' అని. అనుకుంటూనే రూమ్‌కు దూసుకుపోయాడు. రూమ్ దగ్గర తను అంతకు ముందు మూడు రోజుల క్రితం మూడు రూపాయలు అప్పు పెట్టిన ముకుందరావు నిల్చుని ఉన్నాడు తలుపు గొళ్ళెం లాగ.

'మూడు రోజులైంది. అప్పుడే యిస్తానని తీసుకున్నావు. ఇప్పుడు నాదగ్గర బస్సుకు డబ్బుల్లేవు. ఇస్తావా మరి?' అని యింకా ఏదో అనబోతూంటే రామ్మూర్తి పక్కాగా ఓచూపు చూశాడు.

రామ్మూర్తి జేబులోనుంచి 'స్టయిల్'గా పదిరూపాయల నోటు తీసాడు. పడుచుపిల్లలాగా పెళపెళ లాడుతోంది ఆనోటు రామ్మూర్తి చేతుల్లో.

'చిల్లరఉందా?'

పొడిపొడిగా నవ్వాడు ముకుందరావు.

'దానిదేముంది; చిల్లర లేకపోతే తెద్దాం. మరోరెండు కలిపి అయిదిద్దూ? తర్వాత సర్దుతాను నీకు?' అన్నాడు గోముగా ముకుందం.

'ఊ....' అని ముకుందంవైపు నిర్లక్ష్యంగా చూసి, నీకెందుకా శ్రమ, ముకుందం? నేనే మార్చియిస్తాగా? ఓ సిగరెట్ ప్యాకెట్ కొని....'

'కొను కొను.... నేనూ ఓ సిగరెట్లు తీసుకుంటాను. కాల్చి అప్పుడే అరగంట అయింది.'

'శనివారం నాడు సిగరెట్టు దానం చేయకూడదే....గురువాజ్ఞ' అని మళ్ళీ ముకుందానికి మాట్లాడటానికి అవకాశం యివ్వకుండా సిగరెట్ల దుకాణంలో మార్చి మూడురూపాయలు యిచ్చేశాడు.

మూడురూపాయలే యిచ్చినందుకు ముకుందరావు ముఖం ముడుచుకుని, మూర్ఛవచ్చినంత పనై, వెళ్ళిపోయాడు. మిగతా రూపాయలూ చిల్లరా పుచ్చుకుని, ఊరికే వచ్చిన పదిరూపాయలకు గాను సంతోషించినా, అప్పుడే అందులోనుంచి మూడు రూపాయలూ చిల్లరా కన్నంపడిపోవటం కొంచెంగా కించపడ్డాడు. ఈ 'మిక్స్‌డ్ ఫీలింగ్స్'తో రూమ్‌లో చతికిల పడ్డాడు, వంకీన చొక్కా తగిలించివచ్చి.

రామ్మూర్తి బుర్రలో ఆలోచనలు 'టెరిఫిక్'గా పరుగెత్తాయి. ఎందుకు యీ మనిషి తనమీద పెట్టుబడి పెడుతున్నాడు? ఎవడైనా ఓరూపాయి ఖర్చుపెడుతున్నాడంటే, పరోపది కలిపి పదకొండు ఎలా లాగుదామా అని తాపత్రయ పడతారుకదా?

అయినా తను మద్రాసునుంచి వచ్చి ఊళ్ళో తిరుగుతున్నట్టు ఎలాగో తెలిసివుండాలి యీ వ్యక్తికి. ఊరికే సిగరెట్ కూడా ఎవ్వరూ యియ్యరుకదా లోకంలో. ఈ విధంగా తనమీద డబ్బు యెందుకు విసురుతున్నాడు?

రామ్మూర్తికి సావిత్రి జ్ఞాపకం వచ్చింది. ఎలా ఉపయోగించుకోవాలి సావిత్రిని! ఎందుకో ఏమో. సావిత్రిని మొదటిసారి చూసినప్పటికి తర్వాతసారి చూసినప్పటికీ చాలా తేడా కనిపించింది. చాలా 'చార్మింగ్'గా ఉంది అనుకున్నాడు మొదటిసారి. కొంతకాలం లవ్ వెలగబెట్టొచ్చు అనుకున్నాడు. కాని టాంక్‌బండ్ దగ్గర జరిగిన సంఘటన ఒక్కసారిగా సావిత్రిమీద తనకి యేర్పడబోతూన్న అభిప్రాయాల్ని మార్చేసింది. సెక్స్‌మీద నుంచి బిజినెస్ మీదికి మరలింది రామ్మూర్తి దృష్టి.

'నావంటివాడు ప్రేమలోపడి కొట్టుకుపోగూడదు? నేను ఎంత చెయ్యాలి! ఎంత కపిగా బతకాలి? ఇంత హడావిడీచేసి ఈ కాలేజీ అమ్మాయి చేతిలోనా పడటం' అనుకున్నాడు.

ఈ ఆలోచనలతో రామ్మూర్తికి నిద్రపట్టింది. తియ్యటి కలలొచ్చాయి. అందులో తనూ సావిత్రీ నోట్లకట్టలు లెక్కపెట్టు కుంటూంటే రామ్ రామ్ సేట్ అసూయగా చూస్తున్నట్లనిపించింది.

నిద్రలేచి చూసేటప్పటికి గడియారం ఏడుకొట్టినట్లు కనిపించింది. రామ్మూర్తి గబగబా కాలకృత్యాలు పూర్తిచేసుకుని డ్రెసప్ చేసుకుని బయలుదేరాడు మరో రోజును గెలుచుకోంటానికి___ రామ్మూర్తికి అంతా ఉషారుగా కనిపించింది. వేసే ప్రతి అడుగులోనూ ఏదో స్ప్రింగ్ యాక్షన్ వుంది.

రామ్మూర్తి సరాసరి రాయల్ హోటల్ దగ్గర రిక్షాదిగాడు. గబ గబా లోపలికి వెళ్ళి ఏదో మరిచిపోయినట్టు నటించి మళ్ళా తనకు తానే సర్దుకున్నాడు. ఈ అంకంలో యించు మించు మొదటి ఘట్టంలో చివరిభాగం కొద్దిక్షణాల్లో ప్రారంభం కాబోతున్నదని గుర్తుకు వచ్చింది రామ్మూర్తికి లీలగా,

కాలింగ్ బెల్ మ్రోగించాడు రామ్మూర్తి.

'కమిన్' అని రామ్మూర్తిని లోపలికి పిలవటం రామ్మూర్తి లోపలికి వెళ్ళి ఓ కుర్చీ లాక్కుని కూచోటం చక చకా జరిగాయి. ఇద్దరూ కాఫీ తాగిన తర్వాత అన్నాడు ఆనంద్.

'సరిగ్గా అన్న టైమ్‌కీ వచ్చారే?'

'బాగుంది. బిజినెస్ చేసే వాళ్ళు, ప్రెస్ రిపోర్టర్లూకూడా టైమ్‌కి రాకపోతే....'

ఇద్దరూ నవ్వేశారు, ఏదో గొప్ప విషయం 'డిస్కవర్' చేసినట్టు.

'చూడండి దుర్గాప్రసాద్ జీ....' అని ఆనంద్ చెప్పబోతూన్న మాటను పూర్తిచెయ్యనియ్యకుండానే.

'మొదటిసారి నామాటని నిలబెట్టుకోలేక పోయాను. మీ టైప్ రైటర్........'

'అవును టైప్‌రైటర్ ఏది?....' అని యిటూ అటూ చూశాడు ఏమూలనైనా ఉందేమో నన్నట్టుగా.

'అలా అటూ యిటూ చూడవలసింది మీరుకాదు, నేను. అందుకే పెన్నుసీ. టైప్ రైటర్ను ఎవ్వరికీ అరువివ్వ కూడ దన్నారు.... ఇంకా కొన్ని ఉన్నాయనుకోండి అరువివ్వకూడనివి! కేవలం 'డీసెన్సీ' కోసం నేనే 'సెన్సార్' క త్తెర వేసేశాను.

'మళ్ళా నవ్వేశారిద్దరూ. ఈ సారి వాళ్ల నవ్వు విస్కీతాగుతూ ఒలక బోసినట్టుగా ఉంది.

'నాకో పూలిష్ ఫ్రెండ్ ఉన్నాడు. నేను రాత్రి యింటికివెళ్ళే సరికి 'వెయిట్' చేస్తున్నాడు. 'ఏమోయ్' అంటే 'నీ టైప్ రైటరోయ్' అన్నాడు. 'వీల్లేదోయ్' రేపొద్దున్న ఆనంద్ గారికి యిస్తానని 'ప్రామిస్' చేశానోయ్ అన్నాను.

'అమ్మ బాబోయ్ రేపొద్దున్న.... రేపొద్దున్నలోగా ఎవ రెష్టును కాంకర్ చెయ్యొచ్చు. రాత్రి అర్జంటుగా పంపవలసిన రిపోర్టులు ఉన్నాయి. పంపకపోతే నా పీక పోతుంది. అంటే నా ఉద్యోగం పోతుంది. నీ కిష్టమేనా?' అన్నాడు.

'అరెరె ....' మరి ప్రొద్దున్నే పట్టుకొచ్చి యిచ్చెయ్యాలా ఆ పెద్ద మనిషి?.... ఇయ్యక పోగా యింట్లో గూడా లేడు. అఫ్ కోర్స్, అతను పెద్దమనిషే ననుకోండి. ఏ సాయంత్రమోవచ్చి సాయంత్రపు సూర్యుడి ముఖంపెట్టి పువ్వుల్లోపెట్టి పట్టుకొచ్చి యిచ్చేస్తాడనుకోండి!.... కాని మాటపోయిందా లేదా?'

'వీలుకాకపోతే మీరు మాత్రం ఏం చేస్తారులెండి!'

'వీలుకాక పోవటం, పరిస్థితులు కలిసిరాకపోవటం, యిటు వంటి వంటే నాకు మహా చెడ్డమంట.... చెప్పొద్దూ?'

'పోనీలెండి, నేను సాయంత్రం రైల్లోగా వెడుతూన్నాది? సాయంత్రం వీలైతే చూడండి?'

రామ్మూర్తి చురుకుగా చూశాడు ఆనంద్ కళ్లల్లోకి. సూటిగా గుచ్చుకునేలాగ.

'చంపేశారు. ఇంకా సాయంత్రం కూడా యివ్వకపోవాలి? కాని, నేను ఎయిర్ మెయిల్లో పంపవలసిన డిస్పాచెస్ఆగిపోయాయి. దానికేం చెయ్యను?'

'నా సంగతికేంగాని. మీ పనికి ఎంత యిబ్బంది కలిగిందో చూడండి ?'

'నా యిబ్బందికేం లెండి ? నేను ఎక్కడో టైప్ చేసి పంపిం చేస్తాను. వాడి పీక పోతుందని టైప్‌రైటర్ పట్టుకువెళ్ళాడు. నా పీకపోతే వాడికేం ? వాడికి పిల్లని యివ్వనన్న మామకేం ?'

ఆనంద్ రామ్మూర్తివైపు చాలా ఉత్సాహంగా చూశాడు. ఒక వ్యక్తిమీద నమ్మకం కలిగినప్పుడు, ఏమి చెప్పినా నమ్మటమేగాని, యింక అపనమ్మకం అంటూ ఉండదు.

'ఎంత యివ్వవలసి ఉంటుంది.... టైప్‌రైటర్‌కి....'

'క్షమించాలి. మీరు కొంచెం మొగమాటస్థుల్లాగ ఉన్నారు చూస్తే. తర్వాత చూసుకోవచ్చును మనం.' అని ఆనంద్‌ని మరి మాట్లాడనియ్యకుండా, 'మీకు ఊళ్ళో షాపింగ్' అదీ ఉందేమో కూడాను' అని వెళ్ళిపోబోయాడు రామ్మూర్తి.

'అంతగా ఏమీలేదులెండి ! ఒక్కసారి యూనివర్సిటీకి వెళ్ళి ఫిలాసఫీ ప్రొఫెసర్‌ని కలుసుకోవాలి. అంతే ! వనజకూడా స్టేషన్‌కే వచ్చి కలుస్తానన్నది....' అని కొంచెం ఆగి, నాకూ వనజకీ చాలా గమ్మత్తుగా యూనివర్సిటీ లైబ్రరీలో పరిచయం అయింది....'

'అవును చెప్పారు....'

'మీరు మీకు తెలిసిన సావిత్రి అని పొరబడ్డారు కూడాను. కలిసిన కాస్సేపట్లోనే మేము ఎన్నో మాట్లాడుకున్నాము. చాలా సరదా అయిన స్టూడెంట్ వనజ....'

'మీరు లాండ్‌స్కేప్ గార్డెన్‌లోకి వెళ్ళారా ?'

'వెళ్ళక పోవటమేం ? మేం లైబ్రరీలోంచి అక్కడికే వెళ్ళి కాస్సేపుకూచున్నాము. చాలా ఐడియల్‌గా ఉంది ఉస్మానియా యూనివర్సిటీ వాతావరణం....'

'మొత్తానికి మీకు నచ్చిందన్నమాట !' అక్కడనుంచి వదిలి వెళ్ళిపోబోయాడు - సాయంత్రం స్టేషన్లో కలుస్తానండి అంటూ.

రామ్మూర్తిని పిలిచి, 'టైపురైటర్ తర్వాత తీసుకుంటాలెండి' అన్నాడు ఆనంద్.

'ఏం?'

డబ్బు ఖర్చయిపోయింది. ఒక్క వందరూపాయలు మాత్రం వున్నాయి ప్రయాణం ఖర్చులకు పోను. మిగతావి ఎలా సర్దుబాటు -

ఆనంద్‌ని మాట పూర్తి చెయ్యనియ్యలేదు రామ్మూర్తి.

'లాభంలేదండీ ఆనంద్‌గారూ! మీకు వ్యవహారాలు చెయ్యటంలో అనుభవం తక్కువ అని నేనంటే మీరు 'అఫెండ్' అవుతారు.'

'ఏమాత్రం 'అఫెండ్' కాను. నేనూ నా రిశెర్చి నా లోకం'

'వందరూపాయలు ఎడ్వాన్సు యిచ్చి తాజ్‌మహల్ లాంటి హోటల్ కొనెయ్యవచ్చు. ఉద్దేశ్యం ఉండాలిగాని వ్యాపారానికి డబ్బే ప్రధానం కాదండీ?'

'బలే చమత్కరించారే!' అని బలవంతంగా వందరూపాయల నోటు తీసి రామ్మూర్తి చేతిలో పెట్టాడు ఆనంద్.

'తప్పదా?'

'తప్పదు'

'తప్పకపోతే తప్పుతుందా? అని నిర్లక్ష్యంగా ఆ వందరూపాయల నోటు జేబులో పెట్టుకున్నాడు రామ్మూర్తి.

'సాయంత్రం రమ్మన్నారుకదూ?'

'తప్పకుండా టైపురైటర్‌తో' అంటూ గడియారం చూచుకుని నాకో ముఖ్యమైన 'ఎపాయింట్‌మెంట్' ఉంది వస్తా' అని వెళ్ళిపోయాడు రామ్మూర్తి.

రాయల్ హోటల్ బయటకువచ్చాడు. ఎదురుగా రోడ్డు కనిపించింది. ట్రాఫిక్ మహారద్దీగా ఉంది! ప్రతివాళ్ళూ హడావిడిగా తిరుగుతున్నారు.

మహారాజుల్నే తప్ప మామూలువాళ్ళని లెక్కచెయ్యని రోడ్డు. ఎవరు ఏమైపోతున్నా భరిస్తూన్న రోడ్డు. రామూర్తి రిక్షా ఎక్కి చార్‌మినార్ దగ్గర దిగాడు. రామ్ రామ్ సేట్ బోర్డు ఎక్కడైనా తగులుతుందేమోనని. మళ్ళా రూమ్‌కి వచ్చేశాడు.

సాయంత్రందాకా ఓపిక పడితే వంద రూపాయలు దక్కొచ్చు. వంద రూపాయలు దగ్గర ఉన్నా తనవికానట్టే నటించాలి సాయంత్రం దాకా. ఎంత బాగా నటించగలిగితే అంత మంచిది. ఈ వంద రూపాయలు ఒక రకంగా తను కష్టపడి సంపాదించినది. తనమాట ల్లోని చాతుర్యాన్ని చూసి యిచ్చినవి. తను గెలుచుకున్నవి. తన మాటలు తనవి. ఈ రూపాయలూ తనవే. అయితే, మరికొంచెం ఓపిక పట్టాలి. అంతే!

'సాయంత్రం సావిత్రిని కలుసుకోవచ్చును'. అన్న విషయం బుర్రలో మెదిలేసరికి రామ్మూర్తికి ఉషారొచ్చింది.

'సావిత్రి గోల్డ్‌మెన్' కదూ? ఉపయోగించుకోవటం చేత కావాలి గాని!' అనుకున్నాడు.

టాక్సీకోసం యిచ్చిన అయిదు రూపాయలూ తర్వాత ఊరికే పుచ్చుకున్న పదిరూపాయలూ, ఆనంద్ బలవంతంగా యిచ్చిన వంద రూపాయలూ అన్నీ కళ్ళల్లో తిరిగాయి. ఒక్కసారిగా ఉక్కిరి బిక్కిరి చేసేశాయి.

రెండు గంటల కల్లా ముకుందరావు వచ్చాడు. 'హలో' అంటూ. చాలా సీరియస్‌గా ఆలోచనలో పడ్డవాడికిమల్లే కూచున్నాడు రామ్మూర్తి.

'హలో' అన్నాడు రామ్మూర్తి. పరధ్యానంగా 'నీకే హలో' అన్నాడు ముకుందం యీసారి బుజంపట్టి ఊపుతూ.

'ఓ....నువ్వా ముకుందం. ఎవరో ననుకున్నాను?'

'మరే....'

'డబ్బు జోరుగా ఆడుతున్నట్టుందే? చెట్లకు కాస్తున్నట్టుగా ఉంది చూస్తే....' 'లేదు. మొక్కలకు పూస్తున్నాయి. కోసుకో....'

'చాలా 'బిజీ'గా ఉంటే మళ్ళీ కలుస్తాలే. ఏదో కాస్త మరీ అవసరం ఉండివచ్చాను. లేకపోతే రాకపోదును.....'

రామ్మూర్తికిఅర్థమై ఓ రూపాయి తీసియిచ్చాడు మెహర్బానీగా.

ముకుందం మహా ప్రసాదమన్నట్టుగా దాన్ని అంది పుచ్చు కున్నాడు. రామ్మూర్తి ప్రాణానికి పీడ విరగడై నట్టయింది.

'ఎలాగో అయిదు గంటలదాకా కాలం గడిపి, జంక్షన్‌లోకి వచ్చాడు. కారు రెడీగా ఉంది చెప్పిన ప్రకారం.

రామ్మూర్తి విజిటింగ్ కార్డ్ చూపించాడు. డ్రయివరు కారు తలుపు తెరిచాడు. లోపల కూచున్నాడు రామ్మూర్తి. కొద్దిసేపట్లో. కారు చార్‌మినార్‌దాటి వెళ్ళిపోయింది.

'తరవాత ఏం జరిగి ఉంటుందంటావ్?' అన్నాడు 'సడెన్'గా సామి.

ఒక్కసారి కనిపించేలాగ గాబరాపడి, అటూ యిటూ చూశాను. నిజంగా గాబరా పడ్డవాడికీ, గాబరా పడ్డట్టు నటించే వాడికీ కనీసం ఓ ఫర్లాంగు దూరం.

ఒకడు అనాయికుడైతే, మరొకడు టోపీ వేసేవాడు. ఒకడు వోటర్ అయితే, మరొకడు నెత్తిమీదమొట్టి వోటు వేయించుకునే వాడు. ఒకడు నీళ్లపాలని తెలిసీకూడా, ఉక్కిన పేమగాగ కొను క్కునితాగే వాడయితే, మరొకడు తను పోసేవి స్వచ్ఛమైన నీళ్లు ప్లస్ స్వచ్ఛమైనపాలు ఉన్న కల్తీలేని నిజం తెలుసుకున్న పెద్దమనిషి.

అందుకే కిక్కురుమనకుండా కూచున్నాను.

* * * *

# 5. రామ్మూర్తి ఎడ్వెంచర్స్ - ఓమజిలీనుంచి మరోమజిలీకి ప్రయాణము - బిజినెస్‌లోకి దిగటం

'అప్పుడేం జరిగిందో తెలుసా??' అన్నాడు 'సీరియస్‌గా' సామి. మాలో, ఒకళ్ళు అడగటం, మరొకళ్ళు చెప్పటం — దీనికి చరిత్రలో వేరే "పేర్లలో" ఎక్కడా దొరకలేదు — కేవలం సూతుడూ శౌనకాది మహామునులూ తప్ప.

'అడుసు తొక్కనేల? కాలు కడుగనేల?' అన్నాడు పాత సామెతను కసిగా నెమరువేస్తూ సామి.

'అవును నేల....?' అన్నాను.

కేవలం 'ఊ' కొట్టటం లేకపోతే ఎప్పుడైనా అడగమంటే ప్రశ్న అడగటం తప్ప మరేంచెయ్యగలను?

లోకంలో లోకువైన తర్వాత లోకులు కాకుల్లా తినేస్తారు. తలుపులు తీసుకుని కూచుంటే పట్టపగలైనాసరే, యింట్లో ఉన్నవి చిళ్ళపెంకులూ, చిత్తుకాగితాలే అయినాసరే, చడీ చప్పుడూ లేకుండా పట్టుకుపోతాడు. చివరికి సీనారేకు డబ్బా, తిరగమోత డబ్బా, జంతికల చట్రం, తోమని అంట్లూ మిగలచ్చు! అదైనా వదిలిపెడితే, అవకాశం దొరకక్కర్లేదు. ఏమాత్రం వీలున్నా అవకాశం దొరికించుకుని ప్రతివాడినీ, మరోప్రక్కవాడు జంతికలాగ కరకరానమిలి పారేద్దామని చూస్తూంటాడు.

నాకు బాగుపడదామనే దుర్బుద్ధి పుట్టింది, పుట్టక పుట్టక యిన్నాళ్ళకు యీ బుద్ధి పుట్టిందిగదా అని తరుణోపాయం వెతుక్కుందామని రామ్మూర్తి శిష్యుడు సామిని పట్టాను.

సామి నన్ను పట్టి తోమేస్తున్నాడని నాకు వళ్ళుమండి నేను అంటే ఆమాట నమ్మకండి, నాకు ఏమాత్రం సిగ్గు ఉన్నా అలా అనను. ఒకవేళ ఎందుకైనా మంచిదని సిగ్గు 'సూయజ్ కెనాల్'లో వదిలేసి మీతో అవాకులూ చవాకులూ కూస్తాననుకోండి. మీరు అరిగీ అరగని చెప్పు పుచ్చుకునో, విరిగీ విరగని వేపమండ పుచ్చుకునో చితక బాదండి. బుద్ధివచ్చి, నిజం ఒప్పుకుని సరైన దారిలో పడతాను.

సామి నావైపు తిరిగాడు. సామి కళ్ళల్లో కావలసినంత కపి ఉంది. వంట్లో బలం ఉంది. బ్యాంకుల్లో డబ్బుంది. బ్యాంకుల బయట మరో అక్కర్లేనంత డబ్బు ఉంది, సరుకు చేతులు మారుతూంది, ప్రతిరోజూ ఎన్నో తలలు మారుతున్నాయి, కావలపిందేమిటి యింక?

సామి అన్నాడు,

'రామ్మూర్తికీ ఓచిన్న అనుమానం వచ్చింది. ఏదైనా పొరబాటు చేస్తున్నానేమో ననే సందేహం వచ్చింది. రామ్మూర్తి కేవలం 'కేటు బాబు' కాదు. అన్నీకలిసివచ్చి ఉంటే ఓమేధావి అయి ఉండే

వాడు. కాని. రామ్మూర్తి బతుకు వేరేమార్గం పట్టింది. నిజానికి రామ్మూర్తికి వేరేమార్గం కనిపించలేదు. ఈ సమాజపు చక్రంలో ఇమడాలంటే సాధన సంపత్తి కావలసినంత కావాలి. రామ్మూర్తి దగ్గర బతుకుదామన్న దురాశ తప్ప మరేమీ లేదు.

'కేవలం బతుకుదామనే కోరిక చాలదు బతకటానికి, సమాజపు కోరల్లో చిక్కుకోవటమా, చిక్కుకోక పోవటమా ? అనే ప్రశ్నే లేదు. ఆ కోరల్లోంచి బయట పడటం ఎట్లాగా అన్నదే చిక్కు.

'రామ్మూర్తికి ఏదో అనిపించింది. కారు ఆపేసి, దిగిపోదాం. కొత్తజీవితం ప్రారంభిస్తేనో ? కావలసినట్లుగా బతకలేనేమోననే అనుమానం వచ్చింది. అందుకే కారు ఆపు చెయ్యనూలేదు. దిగిపోనూ లేదు. కాస్సేపటిలో ఓమేడ ముందు ఆగింది కారు.

హాల్లోకి వెళ్ళాడు రామ్మూర్తి. సోఫాలో కూర్చున్నాడు. డ్రయివర్ లోపలికి వెళ్ళి ఓ నిమిషం తర్వాత బయటికి వచ్చాడు. మరో అయిదునిమిషాలకల్లా రామ్‌రామ్ సేట్ బయటికివచ్చాడు.

చెప్పక్కర్లేకుండానే తెలుస్తోంది. రాంరాం సేట్ చాలా పెద్ద వ్యాపారస్తుడని. అయిదువేళ్ళల్లో నాలుగువేళ్ళకి ఉంగరాలూ, మనిషిని చూడగానే ఇట్టే పసికట్టగల కళ్ళూ, వెనకాలే ఓ అల్సేషన్ కుక్కా. దాని వెనకాల ఆ కుక్కకి తీసిపోని విశ్వాసాన్ని నటించే మరో నలుగురూ.—యివన్నీ చూస్తున్న రామ్మూర్తికి ఏదో తమాషాగా అనిపించింది.

కాని తాను చాలా పెద్ద వ్యాపారస్థుడి సమక్షంలో ఉన్నట్టు తెలుసుకుని కొంచెం గాబరాపడ్డా, తనని తాను సంబాళించుకున్నాడు రామ్మూర్తి.

'మీరు టీ తీసుకుంటారా, కాఫీ తాగుతారా ?'

'నేను :....'

ఈలోగా 'టీ' ట్రే వచ్చింది.

'మీకు కాఫీ అలవాటు ఉన్నా ఇవ్వాళికి 'టీ' పుచ్చుకోండి. అన్నాడు ఎంతో హుందాగా. ఆ విధంగా ఎదుటివాడిమీద ఎంతో చనువూ, అధికారం ఉన్నవాడుగాని అనలేడు.

మార్కెట్‌లో వస్తువులు కొనబడటానికి సిద్ధంగావున్నపుడు ఎవరు ఏది కావలిస్తే అది వాళ్ళు కొనుక్కుంటారు. తనని తాను అమ్ముకోటానికి నడిబజార్లోకి వచ్చాడు రామ్మూర్తి. ఈనాడు రాం రాం సేట్ తనని కొంటున్నాడు. రేపు మరోడు. ఎల్లుండి ఇంకోడు.

ఈ విషయాన్ని రామ్మూర్తి ఇంత 'క్లియర్'గా తెలుసుకున్నా తెలుసుకోకపోయినా భావనచేసుకోగల స్థితి ఎప్పుడో ఏర్పడింది.

'మీరు మద్రాసునుంచి వచ్చి ఎంతకాలం అయింది?'

'రామ్ రామ్ సేట్‌కి ఎలా తెలుసో?' అని నేను అడిగిన చొప్పదంటు ప్రశ్నకి జవాబు చేసింది సామికి

'నువ్వు ఒట్టి మారని దూసాయిలా ఉన్నావు చూస్తే! ఆ మాత్రపు 'ఇన్‌ఫర్మేషన్' లేకుండా డబ్బు విసురుతాడనుకున్నావా?' అని కొంచెం సర్దుకుని. 'ఇటువంటి అడ్డదిడ్డం ప్రశ్నలు వెయ్యకు?' నేను తప్పు తెలుసుకుని, కన్నులలో తేలుకుట్టిన దొంగాడిలాగ ఊరుకున్నను.

రామ్మూర్తి జవాబు చెప్పలేదు.

'ఈ వూళ్ళో ఎంతకాలం బట్టి ఉంటున్నారు?'

రామ్ రామ్ సేట్ ఏగుజరాత్‌వాడో అయివుండాలి. అయినా తెలుగు దేశంలో పాతుకపోయి ఉండటంవల్ల లాగాఉంది. తెలుగు చాలా బాగా మాట్లాడుతున్నాడు.

రామ్మూర్తి దీనికీ జవాబు చెప్పలేదు కాని, ఏదో చెబుదామని తనలో తను అనుకుంటున్నట్లుగా తెలిసేటట్లు కూచున్నాడు.

'నన్ను ఎందుకు రమ్మన్నారో చెప్పండి?' అని కొంచెం ఆగి. రామ్ రామ్ ఏమీ అనకపోయేసరికి, మీరు నాకోసం దేనికి కబురుపెట్టారో నాకు తెలిస్తే....'

'మీకు తెలియదని నేను అనుకోవడంలేదు.'

'మీరుకూడా మద్రాసులో ఉన్నారా?'

రామ్ రామ్ నవ్వాడు. కాస్త కోపంలాంటిది వచ్చింది రామ్మూర్తికి, మళ్ళానవ్వాడు సేట్ మరికొంచెం గట్టిగా. రామ్మూర్తికి మరికాస్త కోపంవచ్చింది.

'మీకు కోపం వచ్చినట్లుందే?'

ఈసారి రామ్మూర్తికి సమాధానం చెప్పకుండానే మళ్ళా నవ్వాడు రామ్ రామ్ అచ్చు తెలుగు సినీమాలో విలన్‌లాగ.

రామ్మూర్తి లేవబోయాడు. రామ్ రామ్ బుజం పట్టుకుని కూచో బెట్టాడు. మరి కొంత ఆశ్చర్యంగా చూశాడు రామ్మూర్తి.

'ఇప్పటికి మీకు తెలిసే ఉండాలి నేను 'బిజినెస్' చేస్తున్నట్లు' రామ్మూర్తి అభిప్రాయం కోసం ఆగకుండా చెప్పుకుపోతున్నాడు రామ్ రామ్. వినకతప్పని భాగవతంలాగ వినవలసి వచ్చింది రామ్మూర్తికి.

'మీరు ఏం చెయ్యవలసి ఉంటుందో మీకే తెలుస్తుంది. మీరు రేపట్నుంచి యిక్కడికి వచ్చెయ్యండి పని చెయ్యటానికి. మీకు కావలసిన డబ్బు తీసుకోండి. ఏ విషయానికీ మీరు యింక యిబ్బంది పడకూడదు. నా దగ్గర పనిచేస్తున్నప్పుడు, మీరు ఏ రకంగానూ కష్టపడకూడదు. చూశారూ.... అదీ సంగతి. మీకు యిష్టంఉన్నా లేకపోయినా మీరు హుందాగా కనిపించేలాగ బట్టలు వేసుకోవాలి. ఎప్పుడూ ఉషారుగా కనిపించాలి. ట్రిమ్‌గా.... ఇవాల్టికి యిది చాల్లెండి. ఈ మూడు వందలూ పట్టుకెళ్లండి. ఓ సూట్ కుట్టించుకోండి. మీకు వేరే యిల్లుచూసే ఏర్పాటు చేస్తాలెండి. మీకేమైనా పనులుంటే చూసుకోండి యివాల్టికి.....'

ఆ మాట అనే దాకా రామ్మూర్తికి తెలివి రాలేదు.

'అవు నవును. ఒకాయనకి నాంపల్లి స్టేషన్‌లో 'సెండాఫ్' యిస్తానని చెప్పాను.... అదొక వ్యవహారం లెండి....'

'అవును లెండి,' అని నవ్వాడు రామ్ రామ్ సేట్ రామ్మూర్తి మాట పూర్తి చెయ్యకుండానే. ఆ ఒక్క నవ్వులోనూ మువ్వా. ఏ సంగతీ అంతా నాకు తెలుసును లేవోయ్! అనే మాటలు స్పష్టంగా చెబుతూన్నట్టున్నాయి.

'మీకెలా తెలుసు?'

'ఎందుకు తెలియకూడదు?'

రామ్మూర్తికి ఏం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు. జేబులో పెట్టుకున్న మూడు వందలూ తొందర చేయటంతో లేవాడు. రామ్ రామ్ సేట్ నవ్వుగా నవ్వాడు.

మరో శాస్త్రైము కష్టంగా ఖర్చుపెట్టి, మరో పావు గంటకు రైలు కదులుతుందనగా నాంపల్లి స్టేషన్‌కు వచ్చాడు రామ్మూర్తి.

ప్లాట్‌ఫారమ్‌మీద యిద్దరూ కనిపించారు. వనజా, ఆనంద్,

వనజ రామ్మూర్తిని దూరంనుంచే చూసి ఆనంద్‌ని చూపించింది.

ఆనంద్ 'హలో!' అని పిలిచాడు. హడావిడిగా రామ్మూర్తి వచ్చాడు.

'అబ్బ. కనీసం మిమ్మల్ని కలుసుకోగలిగాను. చెప్పానుగదూ, 'ఎపాయింట్‌మెంట్' 'కీపప్' చెయ్యటంకోసం ఎన్ని పాట్లయినా పడతానని.'

'పాపం చాలా తొందరలో వచ్చేసినట్టున్నారు?' అంది వనజ తనలో తానే నవ్వును దాచుకుంటూ. ఆమాటల్లోని వ్యంగ్యం కేవలం రామ్మూర్తికే తెలిసేలాగ.

'మీరు చాలా ఖచ్చితమైన మనుషులండీ, నిజంగా' అన్నాడు ఆనంద్.

'ఖచ్చితం అంటే జ్ఞాపకం వచ్చింది. యిదుగో మీ వంద రూపాయల నోటు, అదే నోటు కాదనుకోండి. మరో నోటు',

ఆనంద్ ఆశ్చర్యంగా రామ్మూర్తి ముఖంలోకి చూశాడు. ఒక్కసారిగా రామ్మూర్తి పైన ఎక్కడలేని అభిమానం పుట్టుకు వచ్చింది.

'ఎంత నిజాయతీ....ఎంత నిజాయతీ!' అనుకున్నాడు.

'ఆనంద్‌గారూ!' అంది వనజ.

రామ్మూర్తి వెంటనే 'మీరు ఆనంద్‌గారి తరపున ఏమీ అన కండి.' అన్నాడు.

'ఏమో?'

'అది అంతే లెండి.'

'పోనీ నేను నా తరపున అనొచ్చునా?'

'మీరు మీ తరపునే కాదు. నా తరపునకూడా మాట్లాడవచ్చు. కావలిస్తే కాగితం రాసి యిమ్మంటారా ?'

'నాకు కాగితాలమీద నమ్మకం లేదు....'

'మీతో చాలా కబుర్లు చెబుతూ ఉండిపోవాలని ఉంది, నాకు యీ రిసెర్చీ అదీ లేకపోతే.....'

'అంత కంటేనా ?'

'కావి....' అని యింకా ఏదో అనబోయేసరికి రైలు కదిలే వేళ అయింది. వందరూపాయలనోటు పుచ్చుకోలేదు ఆనంద్. తర్వాత చూచుకోవచ్చన్నాడు.

రైలు కదిలి వెళ్ళిపోయింది. రామ్మూర్తి రైలు వెళ్ళె వైపు చూస్తూ ఉండిపోయాడు.

రామ్మూర్తి 'కెరియర్'లో యిది నిజంగా ఓ ముఖ్యమైన ఘట్టం. మొదటిసారిగా రామ్మూర్తి వందరూపాయల నోటుని పకోడీ పుచ్చుకున్నంత తేలికగా పుచ్చుకున్నాడు. డబ్బును తనకు యియ్యటంలో ప్రజలు యింత ఆనందం పొందుతున్నారనే విషయం రామ్మూర్తికి నిజంగా ఎన్నో రహస్యాలు చెప్పింది. అంటే 'సక్సెస్' తనని వరించి వస్తూందన్నమాట.

'అర్థం అవుతోందా అవధానీ కథ ?' అన్నాడు సామి నన్ను చూసి.

'ఊఁ'

'ఊఁ' ఏమిటి నీ ముఖం ? ఇన్ని అధ్యాయాలు చెప్పానుగదా రామ్మూర్తి కథలో ? ఇంకా నీకు మందకొడితనం ఏమిటి నాకు తెలియకడుగుతాను ?'

'అవును ?'

'ఏమిటి, అవునూ, కాదూను. కొంచెం మాట్లాడటం నేర్చుకో. మనుషుల్ని అర్థంచేసుకుని మెలుగు. నాలుగుకాళ్ళు సంపాదించి, నలుగురికీ యిచ్చినట్లు నటించి నువ్వే జాగ్రత్త పెట్టుకోవటం నేర్చుకో....'

'ఆదేకదా జీవిత పరమార్థం?

'అట్లారా, దారికి ....'

'వాళ్ళిద్దరూ ప్లాట్‌ఫారమ్ మీదనుంచి బయటకు వచ్చారు.

'మనం కాఫీ తాగుదామా టాజ్‌లో?'

'అక్కడే కదా మనం మొదటిసారి కాఫీ తాగింది?'

'మీకు జ్ఞాపకం ఉందన్నమాట?'

'అంత తేలికగా మర్చిపోగలనంటారా. మిమ్మల్ని. మీ పరిచయాన్నీ?

'అంత జ్ఞాపకం పెట్టుకోవలసింది మాత్రం ఏముందిలెండి?'

'హిమాయత్ నగర్‌లో నారూమ్ చూపించాను మీకు. మీ యిల్లు చూపించారూ, నాకు?'

'ఎంత చమత్కారంగా మాట్లాడతారండి మీరు? ఓ ఫర్లాంగు దూరంలో ఆ పడుకున్న గేదె పక్కని యిల్లు అని చూపిస్తే. అది చూపించటంలోకే వస్తుందా ఏమిటి?'

'మీరు అదీ చూపించలేదుగా?'

'ఒక్క వారం రోజులు ఆగండి. వేరే యిల్లు తీసుకుంటు న్నాను. అప్పుడు యిల్లు చూపించటమేమిటి. తీసుకువెడతాను మిమ్మల్ని. అయినా మిమ్మల్నే తీసుకువెళ్ళకపోతే మరెవ్వరిని తీసుకు వెడతాననుకున్నారు?'

'ఏమో నాకేం తెలుసు?'

మాట్లాడుతూ మాట్లాడుతూ వాళ్ళిద్దరూ నాంపల్లి స్టేషన్ నుంచి బయటకు రావటం, వాళ్ళకోసమే ఆగినట్టు ఓ టాక్సీ ఎదురుగా కనిపించటం, అందులో కూచుని 'కోటీ టాజ్' కు తీసుకువెళ్ళ మనటం చకచకా జరిగాయి. టాక్సీలో కూచున్నంతసేపూ లోకం లోని అన్నివిషయాల్ని గురించి మాట్లాడారుగాని వాళ్ళను కలతపెడు తున్న విషయాన్ని గురించి మాట్లాడలేదు. ఇద్దరూ మనస్సులోని మాటని బయటపెట్టడానికి మొగమాటపడుతున్నారు.

రామ్మూర్తి తను చెప్పదలచుకున్నది చెప్పితీరతాడు. సావిత్రి మీద తనకి ఉన్న ఉద్దేశం ఎలా బయటపెట్టాలీ అన్నది ఒక ప్రశ్న.

ఇంక సావిత్రిని తనకు కావలసినట్టు ఏ విధంగా ఉపయోగించుకో వాలీ అన్నదే ఆలోచిస్తున్నాడు. తను ఏమి మాట్లాడినా, ఏ విధం గానూ బయటపడిపోకూడదు. కాని. తనతో సహకరిస్తుందో లేదో ఖచ్చితంగా తేల్చేసుకోవాలి.

కాని రామ్మూర్తి అందరిలాంటివాడుకాడు. సావిత్రి అందరి లాగా కాలేజీలో చదువుకునే మామూలు అమ్మాయికాదు. అందుకే రామ్మూర్తికీ సావిత్రికీ మధ్యనున్న యీ చమత్కారమైన సంబంధం కేవలం చీప్‌రేట్ లవ్ మేకింగ్‌గా మారలేదు. రాబోయే ఎమెచ్యూర్ రైటర్సు ఆ విధంగా కథలు రాసుకోడానికి వీల్లేకుండా చేశాడు రామ్మూర్తి. రామ్మూర్తికి ఓ సంగతి గట్టిగా తెలుసు. సావిత్రికీ తనకీ మధ్య ప్రేమ అనే 'థిన్‌పేపర్' లేదు. మొదట గ్లామర్ ఉందేమో గాని యిప్పుడు అదీలేదు.

సావిత్రి యూనివర్సిటీలో చదువుకుంటూన్న ఓ చలాకీయైన తెలివిగల అమ్మాయి. సావిత్రికి సీత అనసూయలమీదగాని అందరూ గుండెలు బాదుకునే శీలంమీదగాని అందరికీ ఉన్నంత ప్రమాదించే నమ్మకంలేదు. గౌరవం ఉంది. సావిత్రికి తన అందంమీద, తన చూపు విసురుళ్ళపైనా, మాటవిరుపులమీద, బోలెడంత నమ్మకం తను ఎవరిచేతనైనా, ఏమైనా చేయించగలననే ధీమా.

సావిత్రి యూనివర్సిటీలో చదువుతూందన్న మాటేగాని, పుస్తకాలమీద మమకారం తక్కువ. అసలు పుస్తకాల మీద మోజు ఉన్నా అది కాలేజీ పుస్తకాలమీద మాత్రం కాదు.

సావిత్రికి తనలో వయసుకు ఉండవలసిన ఆకర్షణ ఉందని తెలుసు. జీవితాన్ని కసిగా సుఖమయం చేసుకోవాలనే వాళ్ళనుచూస్తే మహా 'క్రేజ్'. దానికి కారణం తనకళ్ళముందే తనకన్న రెండేళ్ళ పెద్దదైన సుగుణ B. A. చదువుతూ ఓ మిల్ ఓనర్ కొడుకుతో రోమాన్స్ వెలిగించింది. పరీక్షలకి వెళ్ళలేదు. తర్వాత అతనితో లేచిపోయిందన్నారు, పళ్ళికిలించారు. దరిమిలా ఆ సుగుణ వీళ్ళందర్నీ కొనే స్థితికి వచ్చిందని తెలియగానే, ఆ అమ్మాయి సౌశీల్యంమీదా గొప్పదనంమీదా పంచరత్నాలు రాసారు ఓ అరడజనుమంది కవులు.

ఇవన్నీ చూస్తున్న సావిత్రికి దేన్ని నమ్మాలో, దేన్ని నమ్మకూడదో తెలుస్తూవచ్చింది. ఏవో విలువలు, ఎందుకో ఉన్నాయని, చెప్పేవాళ్ళకే అర్థంకాని స్థితిలో చెబుతూ ఉంటే, వాట్లను నమ్ముకుని జీవితాన్ని కాల్చేసుకోవడం ఏమాత్రం యిష్టంలేదు.

కాని, సావిత్రితను ఎవరినైనా సొంతంగా బుట్టలోవెయ్యగలదా అంటే, యింకా అది తేలని విషయం. కేవలం అవకాశంకోసం కాసుకుని కూర్చుంది. ఈలోగా పాతనమ్మకాల స్థానేవచ్చిన కొత్త నమ్మకాల పలవరింతలో తనని తాను అర్థంచేసుకుంటూంది ఓ రకంగా.

రామ్మూర్తి టాక్సీలోంచి దిగి తలుపుతీసి సావిత్రిని దిగమన్నాడు. నువ్వా, నేనా అన్నట్టు ఒకళ్ళకళ్ళల్లోకి ఒకళ్లు చూసుకున్నారు. రామ్మూర్తి షోకుగా జేబులోంచి డబ్బుతీసి మార్చి యిచ్చేస్తూంటే, హాండ్‌బ్యాగ్ తిప్పుతూ 'టాజ్' లోపలికి వెళ్ళింది సావిత్రి. కాఫీ 'సిప్' చేస్తూ అన్నాడు రామ్మూర్తి, 'మీకు తెలిసే ఉండాలి నాసంగతి కొంతవరకైనా ?'

'డైలాగ్‌బ్యూటీకోసం కాదుగాని, నిజంగా మిమ్మల్నిగూర్చి నాకు ఏమీ తెలియదు.'

మీరు 'బ్యూటీఆఫ్ డైలాగ్' కోసమే అన్నారు, నన్నడిగితే మీరు యూనివర్సిటీలో టైమ్‌వేస్ట్ చేస్తున్నారంటాను. ఓ M. A. డిగ్రీ పుచ్చుకుని ఏలెక్చరర్‌గానో ఓ కాలేజీలో 'రాట్' అయ్యేకన్నా ఏ 'ఫీల్డ్' లోకి వెళ్ళినా 'టాప్' లో ఉంటారు.

ఈ మాటలు విని సావిత్రి నవ్వటంచూసి రామ్మూర్తి మళ్ళా అన్నాడు. 'మిమ్మల్ని పొగడటంవల్ల నాకు ఏమిటివస్తుంది చెప్పండి ? ఏ క్యాపిటలిష్టునన్నా పొగిడితే, కాసిని రూపాయలన్నా రాలతాయి. కాదండోయ్, ఓచిన్న పొరబాటు. అందమైన అమ్మాయిని పొగిడితే, మంచిముత్యంలాంటి చిరునవ్వు ఒలకుతుందని యిప్పుడిప్పుడేతెలుస్తూంది....' సావిత్రి మరింత నవ్వింది. 'ఇంత మరి పొగడటందేం !'

'అయితే మీరు పెద్దవాళ్లు చెప్పినట్లు బుద్ధిమంతనంగా చదువు పూర్తిచేసుకుని, లోకోద్ధరణచేసే ఓ ఉద్యోగమో, దేవతలు మెచ్చే వివాహమో చేసుకుంటారన్నమాట....అంతేనా ?....'

రామ్మూర్తి సావిత్రి కళ్ళల్లోకి చూశాడు. దానికి సమాధానం సావిత్రి సూటిగా చెబుతుందో, లేకపోతే ఓ చలోక్తి విసిరి తప్పించు కుంటుందో సరిగ్గా ఊహించలేక పోయాడు రామ్మూర్తి.

ఓ రకంగా సావిత్రి యిచ్చే సమాధానంమీద రామ్మూర్తి 'ప్లాన్స్' ఎన్నో ఆధారపడి ఉన్నాయి.

'ఏం చేస్తే బాగుంటుందంటారు ?'

'ఇది పరీక్షలో ప్రశ్న అయితే సమాధానం చెప్పటంతేలిక....'

'నాకూ తెలియడం లేదు ఏమి చెప్పాలో.... !'

తర్వాత ఏమి మాట్లాడటానికీ సావిత్రికి తోచలేదు. ఒకవేళ తెలిసినా అప్పటికప్పుడు సమాధానాలు చెప్పేస్తే, రామ్మూర్తి దృష్టిలో ఓ మెట్టుపడిపోతానేమో ననే అనుమానం కలిగింది సావిత్రికి.

ఎందుకో ఏమో, రామ్మూర్తిని తనకి కావలసినట్లుగా ఉప యోగించుకోలేనేమో ననే అనుమానం వచ్చింది. తను చాలా తెలివితేటలుగా ప్రవర్తించా ననుకుంటూ తనకు తెలియకుండానే ఎదుటివాళ్లకు ఎక్కువ ఉపయోగపడుతున్నానేమో ననిపించింది సావిత్రికి.

అయినా రామ్మూర్తిని గూర్చి ఒక నిశ్చితమైన అభిప్రాయానికి రాలేక పోతూంది. నిజానికి ఓ అభిప్రాయానికి రాదల్చుకోలేదు కూడాను.

'మరి మీరు శుద్ధ మామూలుగా పుస్తకాలు బట్టీ పట్టేసి ప్రజల్ని హడల గొడతానంటే, నా బోటివాళ్లు పకోడీలు తింటూ బతకడం కన్నా ఏం చెయ్యగలం చెప్పండి ?'

'బలే చమక్కులు విసురుతారండి మీరు ?'

'ఆడవాళ్లతో మాట్లాడ్డం బలే 'ఎడ్యుకేషన్' అనుకోండి. కాని, యీ 'ఎడ్యుకేషన్'ని సరిగ్గా వాడుకున్నవాళ్లు ఎంత మంది అంటారు ? కట్టెయ్యని వీధికుళాయిలాగ 'వేష్ట్' అయిపోతోంది యీ 'టాలెంట్' అంటాను ?....'

మళ్ళీ ఓ సారి నవ్వింది సావిత్రి. ఆ నవ్వు ఎంతో నమ్మ కాన్ని వెదజల్లింది రామ్మూర్తిమీద. రామ్మూర్తికి 'క్లూ' దొరికింది.

ఫర్వాలేదు. పిట్ట వలలోంచి జారిపోవకపోవడమే గాకుండా ఆవల తనుకట్టుకున్న గూడు అనుకుంటూంది కూడాను.

ఇంతసేపట్నించీ ఎంతో జాగ్రత్తగా మాట్లాడుతూ ఏమాత్రం మాట జారనియ్యకుండా తన అభిప్రాయాలను తన దగ్గర దాచుకున్న సావిత్రి తనకు తెలియకుండానే ఒక మామూలు అమ్మాయి అయి పోయింది. కళ్లల్లో ఒక మెరుపు కనిపించింది.

'నేను ఏంచేసినా మీకు తప్పకుండా చెబుతానుగా ?' అంది సావిత్రి. 'చేసిన తరువాతా ? చేసేముందా ?'

'రెంటికీ పెద్దతేడా ఏముందంటారు ?'

ఫక్కున నవ్వేడు రామ్మూర్తి. మాంచి డైరెక్టరు చేతిక్రింద నవ్వమన్నప్పుడు నవ్వే హీరోలాగ.

'అయితే ఏంచేసినా మిమ్మల్ని అడిగి చెయ్యమంటారు— అంతేనా ?' 'అని నేను అన్నానా ?'

'ఈ టెంపో డిటెక్టివ్ నవల రాసుకోడానికి బాగుంటుందేమో గాని మీరు అడగదలచుకున్నది సూటిగా అడుగుదురూ ?'

'అంటే మీరు సూటిగా కూడా సమాధానం చెబుతారన్నమాట!'

'అడిగిచూడండి'

రామ్మూర్తి మరో రెండు కప్పుల కాఫీకి ఆర్డరిచ్చాడు. కాఫీ రాగానే 'సిప్' చేస్తూ అన్నాడు.

'నాది కేవలం స్వార్థం అనుకోండి'

'పోనీలెండి అప్పుడప్పుడు నిజం ఒప్పుకోవడం అందంగా ఉంటుంది కూడాను.

'మీరు కేవలం ఓ మామూలు కాలేజీ అమ్మాయి అయి పోవటం నాకు ఏమీ బాగాలేదు....' అని కొంచెం ఆగి సావిత్రిలో అభ్యంతరం తెలిపే ఏరకమైన భావం కనపడక పోయేసరికి అన్నాడు. 'నేను చెప్పేదానిపైన మీకు నమ్మకం ఉంటే ?....'

'చెప్పండి.' అంది సావిత్రి ఏమాత్రం బయట పడకుండా.

'మీరు మొదట చెప్పాలి. మీకు నమ్మకం ఉందో లేదో....

'కాగితం రాసియిమ్మన్నారు కాదు యింకాను....'

'కాగితం ఎందుకండి నాలిక గీసుకోటానికి? మీరు 'ఊ' అనండి నాకు వెయ్యేనుగుల బలం వచ్చినట్లుగా ఉంటుంది....'

'ఊఁ....' అంది సావిత్రి గమ్మత్తుగా.

'మీరు మాట యిచ్చినంత మాత్రాన మిమ్మల్ని యింటింటికీ తిరిగి అప్పడాలు అమ్మన మనను లెండి?'

'మరి ఏమి అమ్మిస్తారేమిటి?'

'మీరు తేలరు మొత్తంమీద?'

'మీరు తేల్చరు కూడాను.'

'ఏం తేల్చమంటారు చెప్పండి? ఏమన్నా ఉంటేగా?'

'ఉన్నప్పటి సంగతే.'

'ఉన్నప్పటి సంగతికదా?'

'ఊ....'

'తప్పకుండాను....నావల్ల ఏమన్నా అయితే. కాని, మీకువచ్చే దాంట్లో నాకు 'షేర్' యివ్వాలండోయ్?'

'చంపేశారు.మీకు నేను 'షేర్' యిచ్చేదేమిటి? అంతామీదే....'

'ఎంత గడుసుదనం మీది?'

'ఇవ్వటానికి పుచ్చుకోవడానికి ముందర ఏమన్నా ఉండాలి గదా మరి?'

'అందుకే మిమ్మల్ని యింతగా....'

'ఏమిటి యింతగా....చెప్పలేకపోతున్నారు?....'

ఫక్కున నవ్వేసింది సావిత్రి.

'మీరు అన్నీ నాచేత చెప్పిస్తానంటారు. అవునా?'

'మీరు చెప్పకపోతే, నాకు ఎలా తెలుస్తుంది చెప్పండి? మీలో దూరి చూడలేనుగదా?'

'చూడలేరా? ఆడవాళ్ళకి ఎక్స్‌రే కళ్ళు ఉంటాయికదా?'

'ఎక్స్‌రే కళ్ళేమిటండోయ్, కవిత్వం చెప్పటంలేదుకదా?'

'నాకు బతికాలవి వుంది - చెప్పద్దూ?'

'అంటే

'మరేంలేదు. కవిత్వం చెప్పేవాడికి మరేపనీ చెయ్యటంరాదు గనక కవిత్వానికి డబ్బు ఎవ్వడూ ఇవ్వడుగనక....'

'ఒక చిన్న ఎమెండ్‌మెంట్! ఛటాగ్రిజాలకి ఇంకా దేశంలో కండవాలు కప్పడం, తోచినంత ముట్టజెప్పటం జరుగుతోందిగదూ.'

'ఓహో? మీకు దేశంలో జరుగుతూన్న అత్యాచారాలు బాగా తెలుసన్నమాటే?....'

'మొన్న మా ఊరు వెళ్ళినపుడు మా ప్రైమరీ స్కూలుటీచరు ఒకాయన ఒక షాహుకారు కూతురు పెళ్ళికి పంచరత్నాలు రాస్తే, ఓ పంచలచాపూ, పదకొండురూపాయలూ యిచ్చారు. అవి పుచ్చుకొని మరి ఉక్కిరిబిక్కిరి అయిపోయి మరో సోకురు పద్యాలు ఆశువుగా ఆ షాహుకారుమీద విసిరాడు.

మరో పదకొండు రూపాయలు....

'ఈ భట్రాజులు రాసిన అవాకుకీ, చవాకుకీ డబ్బులు బటానీల్లాగ పంచిబెడితే, వాడుకూడా మరో షాహుకారు బావమరిది మీద పంచరత్నాలు రాసుకు బతకాలి. శంకరగిరిమాన్యాలు పట్టిపోడూ....'

'బాగా అన్నారు....మరి కవిత్వం రాసినవాడు బతకాలి గనక ....అంటే పుట్టిన ప్రతివాడు కవిత్వం రాసేవాడికోసహా అన్నం తినాలనుకోవటం తప్పుకాదు గనక, మరి అన్నం తినటానికి కేవలం సరస్వతీ స్తవం చాలదు గనక;....వెరపి కవిత్వం రాసేవాడు మట్టిగొట్టుకు పోతాడని భావం....దేర్‌ఫోర్....కవిత్వంలాంటి మందుగుండు సామానుజోలికి పోకుండా, బుద్ధిమంతుడిగా, బాగుపడే ప్రతివాడూ ఏంచేస్తాడో, అదేవిధంగా వ్యాపారం చెయ్యక తప్పదు....'

'ఎంత పురాణం చెప్పారండీ? మీరు నాటకాలూ అవీవేసేవారా ఏమిటి?'

'నాటకాల్లో వేషాలువేసి ఏంలాభమండీ? పేపర్‌బోట్స్ 'లాగ....'

'చాలా బాగుందండీ యీ కంపేరిజన్?'

'దీనికేముందిలెండి! అందులో నాగొప్ప ఏముంది? నాకంటే చాలాబాగా యింతకుముందే ఎవడో, ఏపుస్తకంలోనో ఏ భాషలోనో, ఏ దేశంలోనో, ఇంతకంటే ఎన్నోరెట్లు బాగా చెప్పిఉండాలి. నాది

మహాఅయితే ఓ మేలురకపు యిమిటేషన్ అయి ఉంటుంది. అంతే....!'

'ఆవిధంగా చూస్తే, అసలు ప్రతిదీ, ఎవరో ఎక్కడో చెప్ప కుండా ఎందుకు ఉంటాడు గనక ? అయినా, మీరు చెప్పింది మీదేనవి నేను మాత్రం అన్నాను గనకనా ?....'

'మీరు ఏమి అన్నా దానికి' అపీలు 'లేదు.'

'మళ్ళీ మనం ఎప్పుడు కలుద్దాం ?'

'అంటే మనం యిప్పుడు విడిపోతున్నాం. అంతేనా ?'

'మీరు చెప్పేది ఎలా ఉండంటే, మనం చిన్నప్పటివించీ కలిసి చదువుకుని, ఒకేచోట ఉండి, విడిపోతున్నట్లుగా ఉంది. ఇంతకీ మనం ఎన్నిసార్లు కలుసుకున్నామని ?'

'అంత తేలికగా ఖర్చురాసి పారెయ్యడానికి వీల్లేదండోయ్, మన స్నేహాన్ని.....'

సావిత్రి ఖాళీగ్లాసువైపే చూస్తోంది. చుట్టుపక్కల ఎవరున్నారా అన్నది వాళ్లు అంతగా పట్టించుకోలేదు. మాట్లాడుతూ, మాట్లాడుతూ, ఎంత సమయం గడిచి పోయిందో చూసుకోలేదు.

రామ్మూర్తి సావిత్రి వైపు సూటిగా చూస్తూ అన్నాడు.

'సంవత్సరాలతరబడి యిరుగు పొరుగున ఉంటూ ఒకళ్ళనొకళ్లు పట్టించుకోని వాళ్లు ఎంతమందిలేరని ! అసలువాళ్లే ఎక్కువమంది.'

'మాట కలిపేశారు మొత్తానికి. మళ్ళీవచ్చే ఆదివారం సాయంత్రం అయిదు గంటలకి యిదే హోటలు దగ్గర కలుసుకుందాం ? సరేనా ?'

'ఇంతకీ మీరే నెగ్గారు.'

'కాదు మీరే !'

ఇంతదాకా వచ్చిన తర్వాత రామ్మూర్తి సావిత్రిని వదులు కుంటాడంటావా చెప్పుకో చూద్దాం, నీ తెలివితేటలన్నీ ఉపయోగించి, అన్నాడు టపాకాయలాగ సామి.

'బ్యాలన్సులేవి ఎకౌంట్' మీద చెక్కురాసి యిచ్చినట్టు నాకు తెలివి తేటలు ఏమి ఏడిశాయి గనక ఉపయోగించటానికి....'అన్నాను.

'అప్పుడే ప్యాకెట్‌లోంచి తీసిన విల్‌కిన్‌సన్ యింపోర్టెడ్ బ్లేడ్‌లా ఉందోయ్ నీ బుద్ధి వెంకటసామీ, యిక నీకు తిరుగులేదు ఏరోడ్డు మీదకు వెళ్ళినా.'

'అందుకేగా మిమ్మల్ని ఆశ్రయించింది.'

సామి మరో సిగరెట్ వెలిగించాడు. ఒకటి నాకూయిచ్చాడు. నేను తీసుకోలేదు. నాఆషాడభూతి వినయం సామికి తెలుసునుగనక, మరోసారి తీసుకోమనగానే తీసుకున్నాను.

సిగరెట్‌పొగ గుప్ గుప్ మని చుట్టపొగ లాగ పైకివదిలాను. గిరీశం జ్ఞాపకంవచ్చాడు. గురజాడ అప్పారావుగారి పద్యం. 'ఖగపతి అమృతము తేగా....' గిర్రున తిరిగింది. నవ్వొచ్చింది.

'ఏమిటి పిల్లో నువ్వే నవ్వుకుంటున్నావు....'

'గిరీశం జ్ఞాపకం వస్తేనూ....'

'గిరీశం కదూ. మహాగొప్పవాడు.' అని మరో దమ్ములాగాడు సామి.

నాకు ఒక్కసారి పట్టలేనంత సంతోషంవచ్చి, దాన్ని యీసారి నాలోనే దాచుకున్నాను.

* * * *

# 6. భవిష్యత్తుకు అడ్డదారులు - వంచ్చకు ఒకటి

బుద్ధిమంతుడికి ఉండవలసిన అన్నిలక్షణాలూ నాకు ఉన్నాయి. కట్టుకున్న చేతులతో, నిక్కబొడుచుకున్న చెవులతో, ఏకాగ్రతతో, 'పొటాసియమ్ సయనైడ్' యిచ్చినా తినేసే 'సిన్సియారిటీ'తో కిక్కురుమనకుండా కుక్కినపేనులా కూచున్న నన్నుచూస్తే సామిగారేమిటి దూర్వాస మహామునికూడా ప్రసన్నుడై తీరతాడు.

దాని వ్యవహారమే అంత. ఎవడిదగ్గరైనా, ఏదైనా కొట్టెయ్యాలనుకున్నప్పుడు, బాగుపడటానికి కిటుకులు తెలుసుకోవాలనుకు

ఉన్నప్పుడు. యిటువంటి టక్కుటమార విద్యలు నేర్చుకోక తప్పదు. ఆషాడభూతికి నేను ఏకలవ్య శిష్యుణ్ణి.

నన్ను చూస్తూనే, 'నువ్వుచాలా యోగ్యుడవోయ్; అన్నాడు సామి. ఆ అర్హత సంపాదించుకోటానికి యింతకాలం పట్టిందన్న మాట....' అసలు కిటుకు ఏమిటంటే, మన సమాజంలో కాలుమీద కాలు వేసుకు బతకాలంటే ఏ అర్హతా అక్కర్లేదు. ఏ యోగ్యతా అవసరంలేదు. కాస్త కళ్ళుతెరచి, వళ్లు దగ్గరపెట్టుకుని, ఎప్పటి కప్పుడు ఏ పాచికవేస్తే పారుతుందో చూసుకోవాలి. నిజానికిచూస్తే రోగాలికి మందులున్నాయిగాని, మన అవసరాలు తీర్చటానికి ఏ పేటెంటు ఉపాయాలూలేవు. అందుకే మన బతుకులు అనుక్షణం అపాయంలో పడిపోతున్నాయి. ఈ అవసరం అనే అపాయం లోంచి ఉపాయంగా తప్పించుకోవాలంటే కేవలం నేర్పు, ఓర్పు, అవసరం....'

'ప్రాసకూడా బాగా కుదిరింది....'

'ప్రాసకోసం తంటాలు పడటానికి నేను తెలుగు పాఠాలు చెప్పటంలేదు.చమత్కారంగా మాటఅయితే వినిదావుగాని. పచ్చిమంచి నీళ్ళయినా ప్రాసతో పోస్తే నేగాని తాగనంటావు. ఎంతప్రయాస ?'

'ఓర్పుకీ నేర్పుకీ రామ్మూర్తి కథకీ ఏమిటి సంబంధం ?'

'ఏమిటి వెంకటప్పయ్యా, నీ తర్కం నాకు అర్థం కాదు? ఎందుకు ఉండాలేమిటి సంబంధం ?....అని కొంచెం ఆగి, 'అట్లా మిటకరించి చూస్తావేం ?'

'అయినా వీటన్నింటికీ రామ్మూర్తి జీవితంతో కావలసినంత లంకెవుంది. ఈ లక్షణాలు రామ్మూర్తిలో కావలసిన పాళ్ళలో ఉన్నాయిగనకనే ఆయన యింతటివాడు కాగలిగాడు. ఎన్ని తెలివి తేటలు ఉన్నా నేర్పుగనక లేకపోతే కాలదోషంపట్టిన ప్రామిసరీనోటు లాగ ఎందుకూ పనికిరావు. ఎంత సమర్థత ఉన్నా ఓర్పుగనక లేక పోతే ఆత్మహత్య తప్ప వేరేమార్గంలేదు.

అందుకే రామ్మూర్తి మామూలు పరిస్థితుల్లో మసికావలసిన రామ్మూర్తి మనకందరికీ ఐడియల్‌గా తయారై కూచున్నాడు.

'సావిత్రిని వదలివచ్చిన తర్వాత రామ్మూర్తి గుండెనిబ్బరం మరింత పెరిగింది. 'అమ్మయ్య ఫర్వాలేదు' అనిపించింది. ఒకప్పుడు భవిష్యత్తుమాట అలావుంచి. ప్రస్తుతమే ప్రశ్న అయికూర్చుంది రామ్మూర్తికి. అటువంటిది ప్రస్తుతం తీయగా తయారవటమూ యింకా తియ్యని భవిష్యత్తును కలకనగలగటమూను. ఇవి ఊహలో గూడా ఎంత తియ్యగా ఉంటవి.

నిజానికి కలగనటంలో ఉన్న మాధుర్యం మరెందులో వుంది గనక ? పరిస్థితులు ముళ్ళలాగ గుచ్చుకుంటూన్నప్పుడు దూరంగా కనిపిస్తూన్న ఏదో ఒక సుఖంకోసం ఊహిస్తూ ముళ్ళమీద ఉరకలు వేస్తూ కారుతూన్న రక్తాన్ని సైతం లెక్కచెయ్యకుండా పిచ్చిగా పరు గెత్తడం ఎంత ఉన్మాదస్థితిలో భాగమైనా ఎంత నిజం ?

'వాస్తవాన్ని మర్చిపోవటానికి కప్పదాట్లు కావలసినన్ని ఉన్నవి సృష్టించుకున్న వీను.

'నిజానికి మనం ప్రస్తుతంలో ఎదుర్కొనే ఎదుర్కొనవలసిన సమస్యలనుంచి విముక్తిని కోరతాం ఎక్కువగా. వాట్లకు ఓపరిష్కార మార్గం ఉన్నాదని, ఉండవచ్చుని మన ఊహకు తట్టదు మరి. తప్పించుకోటంలో ఉన్న —అదే కలగనటంలో—వీలు. ఎదుర్కోవటంలో లేదు గనక.

'రామ్మూర్తికి ఆశయాల చింతకాయల్ని అందరూ వల్లించే మంత్రాలనే మామూలు పద్ధతులతో రాలగొట్టవలసిన అవసరం అంతగా లేదు. ఆ మాటకొస్తే. రామ్మూర్తికీ ఆశయాలకీ ఆదర్శాలకీ అసలు సంబంధమే లేదు.

'రామ్మూర్తి సమాజం, తోటివాళ్ళు ఏమి యిచ్చారు గనక ? గాలికి పుట్టి, ధూళికి పెరిగే చిల్లరసరుకు అప్పట్లో రామ్మూర్తి. అతనికి సమాజం యిచ్చినది ఏమీలేదు. అందుకే తను సమాజానికి ఏవిధం గానూ ఋణపడి లేడని గట్టిగా తెలుసు రామ్మూర్తికి.

'తనకు బుద్ధివచ్చినప్పటినుంచీ. తను చూపిందీ, అనుభవిం చిందీ ఎవ్వరూ నిరూపించకుండానే నిరూపించబడుతూన్న సత్యం—

ఈసమాజంలో ప్రతివాడూ మరొకడిని తినెయ్యడంవల్లనే హాయిగా బతకగలుగు తున్నా డన్న విషయం.

'ఎవరెన్ని కల్లబొల్లి కబుర్లు చెప్పినా, ఎంత మంది రాజకీయ నాయకులు గొంతులు చించుకుని, బల్లలుబాది, మైకులు విరగ్గొట్టి ఉపన్యాసాలు దంచినా, ఒకే విషయం. చివరికి తనూ, తనవాళ్ళూ ఓ పది తరాలబాటు సుఖంగా, అన్నిహంగులతో హాయిగా బతకటానికి విచ్చేనలు వేసుకోటానికి, దగ్గర చేరినవాళ్ళనీ, వాళ్ళ సాధన సంపత్తినీ వినియోగించు కుంటున్నాడన్నది అందరికీ అంత తేలికగా అర్థంకాని భయంకరమైన సత్యం.

'రామ్మూర్తికి బ్రతుకు తెరువు తెలుసును గనక బ్రతుకు తున్నాడు. లేకపోతే మంచినీళ్ళు అడగకుండా చచ్చేవాడు. నిజానికి ఆతడికి మంచినీళ్ళు ఎవ్వడూ యివ్వడు కూడాను. దానిగతీ, సంగతీ అంత మరి!

'ఎవడైనా మునుగుతాడని అనుమానం వేస్తే, వాణ్ణి, మరి కాస్త ముంచి, మళ్ళీ లేవకుండా చెయ్యడం, ప్రతివాడూ తన కర్తవ్యంగా భావిస్తాడు. వాడు చచ్చీచెడీ బతికి బయట పడితే తెగ బాధపడిపోతారు. బయటికి మాత్రం మొసలికన్నీరు చిలుకుతారు.

'ఇదంతా ఓ నాటకం. ఇది తెలియనివాడు బూటకంలోపడి పోతున్నాడు. ఇది తెలుసుకున్నా, బయటపడటం అంత తేలిక గనకనా?

'అందుకే రామ్మూర్తి మరి సావిత్రిని వదలనూలేదు. పట్టుకుని పాకులాడి మజ్నూ ఆయిపోనూలేదు.

సావిత్రి మళ్ళీ కలిసినప్పుడు 'కిందటిసారి మనంకలిసినప్పుడు' అనే ధోరణిలో కథ మొదలుపెట్టలేదతను.

'తాజ్'హోటలో దగ్గర కలుసుకున్నారు. రిక్షా ఎక్కి పబ్లిక్ గార్డెన్ దగ్గర దిగారు. అక్కడ లాన్స్‌లో కూచుని చెనా-బటానా రెండు పొట్లాలుకొని, ఒకటి సావిత్రికి యిచ్చి, ఒకటి తనుపుచ్చుకుని మాట కదిపాడు రామ్మూర్తి.

'మీరు చదువు స్వస్తిచెప్పి నాతో బిజినెస్‌లోకి దిగాలని....'

'ఓ....'

'నిజంగానే చెబుతున్నానండోయ్ ?'

'అంటే మీరు నిజం కూడా చెబుతారన్నమాట.'

'అప్పుడప్పుడు తప్పకపోయినప్పుడు.'

'పోనీలెండి. ఎప్పుడూ అబద్ధం చెప్పనన్న అబద్ధం చెప్పలేదు కనీసం.'

'మీరూ, నేనూ, యికనుంచీ అన్నింట్లో 'పార్ట్‌నర్స్' మరి పార్ట్‌నర్స్ ఒకళ్ల కొకళ్లు అబద్ధంచెబితే, ధోకాయిస్తే, యింక బిజినెస్ ఏలా సాగుతుంది చెప్పండి ?'

'ఉహూ.... నన్ను రచ్చబండమీదకు లాగేశారే ?'

'పోనీలెండి రొచ్చులోకి అన్నారు గారు యింకాను ?'

'అనను లెండి !'

'పద్దా, లేదినా యిద్దరం పార్ట్‌నర్స్ మనం యికనుంచీ.... ఏదీ మీ చెయ్యి యివ్వండి ?'అనుకోకుండా చెయ్యిజాపింది సావిత్రి.

దానికోసమే ఎంతకాలంబట్టో కాసుకుని కూర్చున్నట్టుగా చెయ్యికలిపాడు రామ్మూర్తి.

ఒక్కసారిగా జరగకూడనిది ఏదో జరిగిపోయినట్లు షాక్ తింది సావిత్రి. కాని ఆ తిన్నషాక్ యొక్క పరిణామం తెలుసుకోవ డానికి జీవితం చాలదు.

నిజానికి మనం ప్రతిసారీ, ప్రతిరోజూ, ప్రతి సంఘటనకీ ఒక్కొక్క షాక్ తింటూనే ఉంటాం. ప్రతి సంఘటనా, మనం అనుకోని విధంగా మనల్నివచ్చి ఢీకొంటుంది. సంఘటనకి పూర్వా పరాలుగూడా ఉంటాయి. కాని, అవి మన ఊహకు అతీతంగా ఉంటయి.

ఒక సంఘటన గతించిన తర్వాత, మరోసంఘటన జరిగేదాకా మన మనస్సు ఓ ప్రత్యేకమైన సంఘటన మీదే లగ్నంకాదు. అందువల్లే, ప్రతి సంఘటనా ఓషాక్ అయినప్పటికీ, మనకు ఆ విధంగా అనిపించదు. అసలు కొంతకాలం అయ్యేసరికి మనకి పొరబాటున గూడా మనం షాక్ తింటూన్న సంగతి తెలియదు. దానికి కారణం మనం ఆ షాక్స్‌కి అలవాటు పడిపోటమే !

షాక్ తగిలినప్పుడు ఆశ్చర్యపడతాం, పరిష్కారం తట్టని సమస్యలాగ మనల్ని ఆందోళన పరుస్తుంది. అది ఆక్షణంలో. అది కనీస చైతన్యలక్షణం. కాని షాక్ తినడం అలవాటుపడి పోయిన తర్వాత, కొంతకాలం అయ్యేసరికి దేనికీ చలించని మట్టిబొమ్మలాగ, చైతన్యం నశించి యంత్రంలాగ బతికెయ్యడం మొదలెడతాం.

సావిత్రికి తగిలిన షాక్ సావిత్రి తెలుసుకోలేకపోటం రామ్మూర్తికి చాలా మంచిదైంది.

సావిత్రికే గనక దీని పరిణామం ఏమాత్రం అర్థమైనా, రామ్మూర్తి కథ మరోవిధంగా నడిచేది. అంటే రామ్మూర్తికి సావిత్రికీ మధ్య కేవలం పరిచయం తప్ప మరేమీ ఉండేదికాదు.

అంటే సావిత్రి అమాంతంగా ఆదర్శగృహిణి అయిపోయి భారత నారీరత్నాలలో ఒక ఫర్లాంగురాయి అయేదనికాదు. మరి రామ్మూర్తి ఉత్త వెర్రివెధవ అయిపోయి స్టీరింగు ఊడిపోయిన కారు లాగ, సినీమాలో చీప్ త్రిల్లర్‌కి పనికివచ్చేలాగ ఏ బ్రిడ్జి మీదనుంచో దూకేసేవాడూకాదు.

'మరి ఏమైవుండేదో?' అన్నాను.

నీకు అనుమానం రావటం మంచిదే. ఎందుకంటావ్, నీకు అనుమానం వచ్చినా రాకపోయినా నువ్వు ఏదో అడగటం, నాకు తెలిసినట్టు నేను ఏదో చెప్పటమూను.

మనం మాట్లాడుతున్నది బుద్ధివున్నవాడు ఎప్పుడూ వినటం లేదు గనక మరేం పర్వాలేదు.

'మనకి తెలియకుండా ఎవడో వినడంలేదని ఏమిటోనమ్మకం?

'చూడు చపలాయ్, నీకు నేను మొదట్లోనే చెప్పాను: నీకు అనుమానం రమ్మంటేనే రావాలి. ఒకవేళ నీకు సందేహం వచ్చినా, దాన్ని నేను గుర్తించాలి. అథవా వెధవది గుర్తించినా, నాకు సమాధానం తట్టాలి. ప్రతివెధవకీ ఓపేరు ఉన్నట్టే, ప్రతిప్రశ్నకీ ఓసమాధానం ఉంది? కాని వచ్చినచిక్కల్లా ఏమిటంటే, అది మనకు తెలియాలని ఎక్కడుంది?'

'ఒప్పుకోవచ్చునుగదా గురూజీ, మనకు తెలియదని !'

'తెలివితేటలకి సంతోషించాంగాని, యిటువంటి తినేసిన మొక్కజొన్న కండెల్లాంటి ప్రశ్నలు వెయ్యకు ?'

'అవి తినేసిన మొక్కజొన్నకండెలు కాదుసార్ !'

'ఇంక లాభంలేదు. నిన్ను నూరుపుటాలువేసినా జ్ఞానంవచ్చే సూచనలులేవు. నీ తెలివితేటలు కేవలం ఏ కలెక్టరు ఆఫీసులోనో గుమాస్తాగిరీ చేసుకోవడానికి పనికిరావచ్చు. మహాపనికివస్తే యే ప్రాక్టీసులేని ప్లీడరో నిన్ను పెట్టుకుంటే, వాడికి కేసులు తీసుకురావటానికో, కనీసం అందుకోసం తంటాలు పడటానికో పనికిరావచ్చు. అయినా నువ్వు యింత దండుగనాయుడివి అనుకోలేదు. ప్రశ్నమీద ప్రశ్న వరసగా వేసినంత మాత్రాన నీతెలివితేటలకి మార్కెట్ పెరుగుతుందనుకున్నావా? నీలాంటి చచ్చు తెలివితేటలు లేవు గనకనే రామ్మూర్తి బాగుపడ్డాడు. రామ్మూర్తి చొక్కాపుచ్చుకొని తిరిగి నేనూ బాగుపడ్డాను కాస్తోకూస్తో. నువ్వు ఏదో ప్రాధేయపడితేను, నేను ఏదో విధంగా తీరికచేసుకుని నీకు నాలుగు మంచిమాటలు చెబుతున్నానా మరి? నిన్నూ ఓ మనిషిగా చేద్దామని ఎంతో ముచ్చట పడ్డాను....

నాకు నిజంగా ఏడుపొచ్చింది. దాచుకోలేక గుడ్లమ్మట నీళ్లుపెట్టాను. అంత దబ్బున నాకళ్ళల్లోకవి వస్తాయని నాకే తెలియదూ-అప్పటిదాకా ఆకాశంలోకి చూస్తున్న సామి ఒక్కసారి నావైపుచూసి, నా కనుకొలకుల్లోంచి క్రింద పడకుండా దాక్కున్న కన్నీటిని పసికట్టాడా అన్నట్టు బుగ్గమీద చుర్రుమనేటట్టు చురుకుగా ఓచిటికవేసి 'నువ్వు ఏక్లాస్ ఏక్టరువోయ్ నాగేశ్వరరావ్ ?'

నాకు ఒక్కసారి తారాగణం చంద్రగణం కళ్ళల్లో తిరిగి కన్నీటితో బాటు కరిగి క్రిందికి జారిపోయాయి.

సామి నావైపు గమ్మత్తుగా చూశాడు. ఏదో 'ఒరిజనల్' ఐడియా తట్టినవాడికిమల్లే సామికళ్లు మెరిశాయి. మత్తుగా చూపి అన్నాడు.

'చూడు వెంకటప్పయ్యా నేను చెబుతున్నదంతా హరికథలాగ విని, దుమ్ముదులుపుకు పోవుగదా ?'

'ఒకవేళ దులిపినా ఆ దుమ్ము మీమీద దులపనులెండి!'

'అదుగో మళ్ళీ ఉపయోగిస్తున్నావు అక్కర్లేని తెలివితేటల్ని. వాటిని కట్టకట్టి బుట్టదాఖలాచేసి మరీ కవిపించు. బుర్ర ఉండగానే సరిపోదు. దాన్ని పొదుపుగా వాడుకోవటం తెలియాలి. అంటే. తీస్తే తరిగిపోయే బ్యాంక్‌బ్యాలెన్స్ లాగ వాడుకోవాలి. అప్పుడుగాని అది ఉన్నసంగతి మనకి తెలియదు. దానికి ధరకట్టొచ్చన్న సంగతీ తెలియదు. అందరికీ.

ఇందులో ఓ చిన్న కిటుకు ఉందోయ్ అబ్దుల్ రహీమ్. నీకు బుర్ర ఉండటం ఉండకపోవటంకన్నా ఎదుటివాళ్ళు ఉందని అనుకోవటం. దానికి ఓ ధరకట్టి, యథావిధిగా నీదగ్గర నుంచి దాన్ని కొనెయ్యటమూను. ఇది కేవలం భ్రమ అనుకో. కాని. ఆ భ్రమే నిజం!

దానికి సమాజంలో ఓస్థానం ఉంది. మార్కెట్‌లో ఓధర ఉంది. మనిషి ముందరకి వెళ్ళడానికి దాని అవసరం మరీ మరీ ఉంది. అందుకే రామ్మూర్తి మాటల్లో పడకూడదని ఎంత అనుకున్నా సావిత్రి పడక తప్పలేదు.

మనకి కావలసిన వాట్లని యింకోళ్ళ ద్వారా చమత్కారంగా చేయించుకోటం దానికి సమిధలుగా ఉపయోగపడ్డ వాళ్ళు తాము ఏదో బావుకున్నామని కొట్టు మిట్టాడటం, రామ్మూర్తి జీవితంలో మనకి కొట్టొచ్చినట్టు కవిపిస్తుంది.

సావిత్రి ఆక్షణంలో ఏమనుకుందీ. ఏ ప్రభావంలోపడి. తనని తాను తనకితెలియకుండానే రామ్మూర్తికి అనుగుణంగా మారిపోయిందీ అన్నది ఎవ్వరికీ జవాబు తెలియని చిక్కుప్రశ్న.

ఇంతకీ సావిత్రి తనకి తెలియకుండానే రామ్మూర్తి బిజినెస్ పార్ట్‌నర్ అయి ఊరుకుంది.

*　　*　　*　　*

# 7. భవిష్యత్తుకి అడ్డదారులు - ధోకా ప్రకరణం

మనిషికి మనిషి తోడైతే, మరిదేనికీ ధోకాలేదు. ఏ పనైనా యిట్టే సాధించెయ్యొచ్చు. కాని ఎవడికి ఎవడూ తోడుకాడు. ఎవడి తోడు వాడిదే. ఎవడినీడ వాడిదే. ఒకవేళ ఎవళ్లయినా నీ నీడలోకి రాబోతే, తలదాచుకోబోతే, వాళ్లని జాలితలచి చేరనిస్తే, కొంతకాలానికి వాడినీడలో నువ్వుచేరవలసి వస్తుంది. సత్రంలో గుమాస్తాకి ముట్టవలసినది ముట్టజెప్పకపోతే, తన్నీ తగిలేసినట్టు, నిన్ను తట్టాబుట్టాతోసహా బయటికి విసిరేస్తాడు. ఇంతకీ ప్రయోజకుడు ఎవడయ్యా అంటే, మరొకడినీడలో చేరినా, అంటే ప్రతివాడికీ నీడ కావాలిగనక వాడికే ఎసరు పెట్టియ్యగల ప్రజ్ఞకలవాడూ, సత్తా ఉన్నవాడూను.

'రామ్మూర్తి రామ్ రామ్ సేట్ దగ్గర మూడువందలు పుచ్చుకున్నాడని చెప్పాను జ్ఞాపకం ఉందా ?' అన్నాడు టార్పెడో లాగ.

చేతిలోనే చీదేసిన తారాజువ్వలాగ ముఖంపెట్టిన నన్నుచూసి 'నిన్నుచూస్తే నిజంగా రామ్మూర్తి మనవణ్ణి చూసినట్టుందనుకో....'

'రామ్మూర్తి అంత ముసలివాడా సార్ ?'

'అది కాదు. నీవు ఒక రకంగా చెబితే తెలియదు. ఏ రకంగా చెప్పినా తెలియకపోవచ్చు. రామ్మూర్తికి మనవడి వంటే, ఏ మనుకుంటున్నావు ? రామ్మూర్తికి కాపీని నేను. నాకు కాబోతూన్న కాపీని నువ్వూను.'

'ఏం బుర్రసార్‌మీది ? మీ బుర్రమీదే సార్ ?'

'పోనీలే, నీ దన్నావు కాదు యింతకీ.'

'ఎట్లా అంటానుసార్ ? ఎలా అనగలనుసార్ ?'

'అ.... అ.... చాలు. అందులో సగంచాలు. ఏదైనామోతాదు మించితే గుణం కనిపించదు. బెడిసికొడుతుంది కూడాను.'

నేను యింక ఏమి అనలేదు.

'రామూర్తికి మూడువందల రూపాయలు అలా చేతికి అందించిన సేట్ పరమచాదస్తుడు తెలుసా ?'

'నేను నమ్మనుసార్....' నీళ్లు నములుతూ అన్నాను.

అట్లా నీళ్ళు నమలక. కావలిస్తే. మరమరాలు నములు. చాదస్తుడంటే యింగ్లీషులో కన్‌సర్‌వేటివ్ అన్నమాట. అంటే. చెయ్యవలసిన వ్యవహారాలన్నీ చాలా జాగ్రత్తగా పకడ్బందీగా చేస్తాడు. పైకి. చిత్తుకాగితాల్లాగ వందరూపాయల నోట్లు విసిరాడంటే పీ ఉద్దేశ్యంలో దానికర్థం ఏమిటో చెప్పు చూద్దాం, పానకాలరావూ ?'

'సేట్ కదా ! రూపాయలు ఎక్కువైనా అయిఉండవచ్చు.' అని మాటపూర్తి చేయకుండానే నా తెలివితక్కువ తనానికి నాకే నవ్వొచ్చింది. నిజానికి నేను ఎవ్వరూ చూడకుండా పక్కకు తిరిగి ఏడిస్తే బాగుండేది. ఎందువల్లనంటే నేను అన్నది ఏడిసినట్టుగా ఉంది గనక.

'విసిరేశాడంటావు ? అదికాదు. రూపాయలూ. పొగరూ. యీ రెంటికీ ఎక్కువ అవటం అంటూ ఉండదు. చాలా పొదుపుగా వాడుకోటం. పైకిమాత్రం విసిరిపారేస్తున్నట్టు కనిపించటం. ఆ వేసిన ఉచ్చులో పడ్డవాళ్ళద్వారా అక్షయంగా రాబడికూర్చుకోటమూను. ఇదే కిటుకుని సేట్ రామ్మూర్తిపైన ప్రయోగించాడు. అది తెలుసుకున్న రామ్మూర్తి తెలియనట్లు నటించి. తను చెయ్యవలసింది చేశాడు. అదేమిటని అడుగు ?'

నేను అడగకపోవటంచూసి. 'నాకు తెలుసు— నువ్వు అడగవు' అన్నాడు సామి ఓరగా నవ్వుతూ.

'నేనెంతవాడినిసార్ ? నీకు ఎలా తెలుస్తుందిసార్, ఏమిటి అడగాలో ?'

'మరీ అలా తీసిపారెయ్యబోకు. నీ అంతవాడివినువ్వు. నీకు అప్పుడే తారాజువ్వలాగ పైకి లేచిపోయే లక్షణాలు అబ్బుతున్నాయి.'

'నాకాసార్ !'

'మరీ అంత ఎక్కువగా నటించకు ; బెడిసికొడుతుంది. రూపాయలకీ, పొగరుకీ. రాం రాంసేట్‌కీ ఏమిటో సంబంధం తెలుసా ?'

'ఊహుఁ?'

'డబ్బుకీ పొగరుకీ ఓ చిన్నలంకె ఉంది. అదేమిటంటే, డబ్బొస్తే పొగరు దానంతటది అదే వస్తుంది. ఏడుముఉంటే గోక్కోవటం వచ్చినట్టు....'

'జ్ఞాపకం వచ్చింది సార్ ఓ పాత, సామెత మా అమ్మమ్మ చెబుతూవుండేది.

'మీ అమ్మమ్మేకాదు, మా నాయనమ్మ కూడా చెప్పేది. అది సరే నేను చెప్పనావద్దా? నువ్వో సామెతా, నేనో సామెతా, నువ్వో పొడుపుకథా, నేనో కందపద్యం చదువుతూ కూచోటమేనా?'

'నేను సామెత చెప్పన్లెండి, మా అమ్మమ్మవుంది చూశారూ! పోనీలెండి. మళ్ళీ చెబుతాలెండి.

సామి మరో సిగరెట్ వెలిగించాడు.

డబ్బు పెరిగినకొద్దీ మార్కెట్లో, దీపావళిముందు టపా కాయల్లాగ గిరాకీ పెరుగుతుంది. తరువాత వాడు ఆరని మతాబాలాగ, చిమ్మేచిచ్చుబుడ్డిలాగ చీదెయ్యని తారాజువ్వలాగ కత్తిలేని కాకరపువ్వొత్తిలాగ వెలుగుతాడు.

అదిగాకుండా డబ్బుపొగరూ - యీ రెండూ రావటం మొద లెడితే మనిషిని పైకి పైపైకి నెట్టెయ్యటం తప్ప వేరే మార్గము ఉండదు. ప్రజలకి మతిపోయినా, తలబాదుకున్నా సులోచనలాలు విరగొట్టుకున్నా మరి గత్యంతరంలేదు.

'ఎవరైనా అడ్డురాకూడదూ?'

'అదిగావ్వూ అడ్డుప్రశ్న?- నువ్వురాలేవూ అడ్డు? నేను అగాను గనకనా? ఇంకోతమాషా ఉంది యిందులో. పైకి వెడుతూన్న వాడికి ఎవడైనా అడ్డువస్తే, వాణ్ణి కాళ్ళుచ్చుకుని లాగినవాళ్లు పుట్టగతులులేకుండా పోతారు. తెలుసా?'

'మరి వాడి కాళ్ళుచ్చుకున్నవాడు? వాడి కాళ్లనీళ్లు నెత్తినజల్లుకున్నవాళ్లు?

'ఏం పదునుగా ఉందోయ్ నీబుద్ధి పరశురామయ్యా? వాడికాళ్లు

పుచ్చుకున్న వాడూ 'వైకుంఠపాళీలో పెద్ద నిచ్చెన ఎక్కినట్లు పైకి. పై పైకి లేచిపోతాడు. కాని యిక్కడొక కిటుకు ఉంది....'

'ఏమిటో అది?'

'నువ్వు అడగాలి కాబోలు సుబ్బిసెట్టిలాగ? పైకివస్తూన్నవాడు కొంచెం సొంత తెలివితేటలు ఉపయోగించటం మొదలెడితే, పెద్ద నిచ్చెన పక్కనే పెద్దపాము ఉంది చూశావుగా? అయినా, అసలు నీకు వైకుంఠపాళీ అంటే ఏమిటో తెలుసుగా?

'చంపేశారు. పెద్దబాలశిక్ష చదివావా అన్నారు కాదు యింకా?'

'ఏమి నేటివ్ హ్యూమర్-నీది సాంబశివరావ్? ఇంతకీ డబ్బూ, పేరూ, పెరిగి పెరిగి, మరీపెరిగి, యింకా తెగపెరిగి, చెడపెరగడమే గాని వేరే గత్యంతరంలేదు. ఇది తెలుసుకో. కావలిస్తే రాసుకో....'

నేను తెల్లముఖం వేశాను.

'అలా తెల్లబోయి చూడకు. అర్థంకానట్టు నటించకు.?'

ఇంతకీ రామ్ రామ్ సేట్‌కి తెలుసు, తను విసరే ప్రతి వంద రూపాయలనోటుకీ కొన్ని వందలరెట్లు విలువచేసే పని రామ్మూర్తి చేత చేయించుకోవచ్చని.

అందుకే మర్నాడు రామ్మూర్తి రామ్ రామ్ దగ్గిరికి రాగానే కూచో బెట్టి మాట్లాడటం మొదలెట్టాడు. రామ్ రామ్‌కి తెలుగు బాగా వచ్చు. మాటనిబట్టి తెలుగు వాడు కాదని పోల్చుకోవటం కష్టం.

రామ్ రామ్ చిన్నప్పుడే రోడ్డుమీద పడ్డాడు. కలకత్తాలో పదేళ్ళున్నాడు. అక్కడ రోడ్డు పక్కన పడుకుని, అదే రోడ్లపైన కారెక్కి తిరిగాడు యీ పదేళ్ళల్లోనూ. ఒక పనిమీద హైదరాబాదు వచ్చాడు. హైదరాబాద్‌లో కిషన్‌చంద్, అబ్దుల్ రహీమ్‌కలిసొచ్చారు.

కలకత్తాలో అంత వ్యాపారం వెలగ బెడుతూన్నవాడు ఒక్కసారి ఎలా వదిలిపెట్టి రాగలడు గనక? అయినా హైదరాబాదులో వ్యాపారం చెయ్యటంకోసం. కలకత్తాలో మరి ఊడల్లా వేళ్లు తన్నుకున్న వ్యాపారం వదిలిపెట్టి రావలసిన అవసరం ఏముంది గనక?

రామ్ రామ్‌కి హైదరాబాద్ అంటే ఎందుకో కాస్తో, కూస్తో సరదా వేసింది. వ్యాపారాస్పదంలటినీ ఒకేచోట ఉంచే కన్న,

కలకత్తాలో బాటు హైద్రాబాదులో కూడా వ్యాపారాన్ని పెంచుకుంటే ఎందుకైనా మంచిది.

కిషన్ చంద్ కి భారీ ఎత్తున నడిచే వడ్డీ వ్యాపారం ఉంది హైద్రాబాదులో. వయసుమీరుతోంది కిషన్ చంద్ కి. వడ్డీవ్యాపారంతో బ్రహ్మ జెముడులా పెరుగుతూన్న డబ్బు ఉంది.

డబ్బు పెరగాలంటే, దానంతట అది పెరగదు కదా? దాన్ని గనక పెంచకపోతే, అది ఎలాగూ కరిగిపోతుంది గనక, దాన్ని ఏ విధంగానైనా పెంచక తప్పదు.

రామ్ రామ్‌తో మాట్లాడుతూన్నప్పుడు కిషన్‌చంద్ కి గూడా తట్టింది. వ్యాపారంలోకి రామ్ రామ్‌ని గూడా లాగితే బాగుంటుందని. డబ్బు కిటుకు తెలిసిన వాడితో మరింత వ్యాపారాన్ని పెంచుకుంటే తనకే అన్ని విధాలా మంచిదనిపించింది.

రామ్ రామ్‌కి కొత్తగా వచ్చిన నష్టం ఏముంది గనక!

ఏ గనిలో ఏ ఖనిజం ఉందో ఎవడికి తెలుసుగనక! తవ్వి తీసినవాడికి తెలుస్తుంది గాని, దూరాన కూర్చుని కాకుల లెక్క పెట్టే వాడికి ఏం తెలుస్తుంది!

కిషన్‌చంద్ వ్యాపారంలో కిటుకులు తెలిసినవాడు. వ్యాపారం చేసిచేసి తలపండినవాడు. కిషన్ చంద్ కి జీవితం ఒకప్పుడు పెట్టుబడిలేని వ్యాపారంలాంటిది. అందువలన వ్యాపారంలో వస్తే కలిసి రావడమే గాని, పోవటం అంటూ ఉండదు. అదే ఒక రకంగా మంచిదయింది కూడాను.

మనిషికి పోయేది ఏమీలేదని తెలిసినప్పుడు నిబ్బరమైన ధైర్యము, కావలసినంత సాహసమూ వస్తాయి. వ్యాపారం పెరగటానికి యింతకన్న కావలసింది ఏముంది?

కాని కిషన్‌చంద్ జీవితంలో సాధించింది, ఓరకంగా మిగతా జీవితాన్నంతా మబ్బులాగ కప్పేసింది. రానురాను జీవితం అర్థంలేకుండా పోయింది. ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళకు అంతుచిక్కక పోవటం సరేసరి? పరిమితిలేకుండా పెరిగిపోతూన్న డబ్బు, మిగతా జీవితంపైన వెలుగు పడనియ్యకుండా చేసింది.

కిషన్‌చంద్‌కి పెళ్ళిఅయిన అయిదేళ్ళలో, కిషన్‌చంద్ భార్య కిషన్‌చంద్‌నీ, డబ్బునీ వదలిపెట్టి శాశ్వతంగా కన్నుమూసింది. ఈ సంఘటనలు ఎవరినైనా ఏరకంగానైనా మార్చి ఉండేదేమోగాని, కిషన్‌చంద్‌ని మాత్రం ఏరకంగానూ మార్చలేదు. కదల్చలేదు. కాని కిషన్‌చంద్ వయసుముదిరి, చూపు మందగించినప్పుడు అనిపించింది—తను కూడబెట్టినది, తన తర్వాత ఎవరికైనా యిస్తే బాగుంటుందని. కాని ఎవడైనా దగ్గరచేరితే, ఏమన్నా అవాంతరం రావచ్చు. డబ్బుచూసి ఎవడికైనా బుద్ధిచెడొచ్చు. చెడుతుంది కూడాను. డబ్బునీ, ఆడదాన్నీ చూస్తూచూస్తూ ఎవడు వదులుకుంటాడుగనక! కాస్త నమ్మకంగా ఉంటూన్నవాడూ, కేవలం తన డబ్బుకోసం ఆశించనివాడూ ఉంటే బాగుండు ననిపించింది. ఒక్కసారిగా ఎక్కడనుంచి పుట్టుకొస్తాడు అలాంటివాడు? ఒక్కసారి అనిపించింది—తనకో కొడుకు పుట్టిఉంటే ఎంతో బాగుండి పోయేదని.

రామ్‌రామ్‌కీ కిషన్‌చంద్‌కీ అంతకు ముందునుంచే వ్యాపార రీత్యా సంబంధాలున్నాయి. కిషన్‌చంద్ దగ్గర నమ్మకంగా పడి ఉన్నాడు అబ్దుల్ రహీమ్....

'అబ్దుల్ రహీమ్ కిషన్‌చంద్ దగ్గరకి ఎలావచ్చాడు సార్?'

'అంటే, అబ్దుల్‌రహీమ్ సాయిబుకదా, కిషన్‌చంద్ సాయిబు కాదుగదా అని.... అంతేనా?'

'అనికూడాను....'

'ఏమితెలివోయ్ నీది? నీలాటివాడికి చెప్పినా ఓ అర్థంవుంది-అందులో ఓ అందం ఉంది. నువ్వు పైకొచ్చి నాలుగురాళ్ళసంపాదించి, మరో నాలుగురాళ్ళు మరో నలుగురికి తగిలేలాగ విసిరినా ఓ అర్థం ఓ అందంవుంది.

అబ్దుల్‌రహీం అసలుపేరేమిటో అల్లాకి కూడా తెలియదు. అసలు అబ్దుల్‌రహీమ్ సాయిబు అవునోకాదో కూడా ఎవ్వడికీ తెలియదు. కాని, కూడూ గుడ్డా లేకుండా ఫకీర్లతోకలిసి తిరుగుతూ తిరుగుతూ ఒకరోజున కిషన్‌చంద్ దుకాణందగ్గరగా వచ్చి నిల్చున్నాడు.

దుకాణం ముందరికి వచ్చినవాడికి ఏదో యిచ్చి పంపించడం కిషన్‌చంద్‌కి అలవాటు. కాని కిషన్‌చంద్ ఆ ఫకీరుజోలెలో ఏమీ పడెయ్యలేదు. ఎందుకో జాలివేసింది కిషన్‌చంద్‌కి. ఇలా బజార్లు పట్టుకుతిరక్కపోతే ఎక్కడైనా పనిచేసుకోరాదూ! అన్నాడు.

'మీరు యిస్తారా పని?'

అంతే! అబ్దుల్ రహీం కిషన్‌చంద్ దగ్గర కుదిరిపోయాడు. ఓ పదేళ్ళలో వ్యాపారంలో కిటుకులు తెలుసుకోటంతో కిషన్‌చంద్ తర్వాత కిషన్‌చంద్ అంతవాడు కాగలవాడుగా తయారయ్యాడు— ఏమంటావ్?'

'ఏమీ అనను'

'అనకు. అదేమంటివి. అబ్దుల్ రహీం కిషన్‌చంద్ ఇద్దరూ కలిసిపోయారు. ఇలా యిద్దరూ ఒకటైపోయి వ్యాపారమూ ఒళ్ళూ పెంచేసుకుంటూన్న సమయంలో రామ్‌రామ్ కంటికి ఆనాడు కలిసి వస్తుందనిపించింది. చేదా చెప్పు పంతులూ?'

'తీపి'

'బాగుంది నువ్వు అందుకోటం. ఇలా నీకు నేను హరికథ లాగా చెప్పుకుపోటం మరీబాగుంది. అబ్దుల్ రహీం తరవాత విశాఖ పట్టణంలో వ్యాపారం చూస్తున్నాడు. కిషన్‌చంద్ కర్రపెత్తనం చలాయిస్తున్నాడు. హైదరాబాదులోనూ కలకత్తాలోనూ వ్యవహారాలు చూచుకోటం కష్టంగా అనిపించింది. హైద్రాబాదులో వ్యవహారాలు చూసుకోవడానికి మరో మనిషి.—అంటే. నమ్మకమైన మనిషి కావలిసివచ్చాడు. కథ యీ పట్టులో ఉండగా రామ్మూర్తి తగిలాడు.

రామ్మూర్తికి మూడు వందలూ పరమరాలుగా యియ్యటం ఎలా ఉందంటే. ఎదటివాళ్ళకి ముసుగు వేసే ముందు. ముచ్చటగా ముస్తాబుచేసి కూచోపెట్టినట్టుంది.

సామి నావైపు చూశాడు. నేను ఏమన్నా అంటానేమో నని. నేను కిమ్మనలేదు. అనను యిప్పట్లో. కామధేనువుకి గడ్డిపెట్టలేక

అమ్మేసినట్టు, కల్పవృక్షానికి నీళ్ళు పొయ్యాక ఎండగట్టినట్లు ఉంటుంది యిప్పుడు కథ గనక ఆపేస్తే.

నేను ఆషాఢభూతి అన్నయ్యనో, తమ్ముడినో, కనీసం జావమరిదినో అయి ఉండాలని నమ్మకంగా తెలుసులా ఉంది చూస్తే. అయినా ఫర్వాలేదు. నేను శిష్యరికం చెయ్యడానికి వచ్చానన్న నమ్మకం స్వామికి గట్టిగా కుదిరింది. అందుకే నాకు యీ ఉపదేశం చేస్తున్నాడు లేకపోతే, ఏ పెద్దబాలశిక్షో, ఎక్కాల పుస్తకమో చదువుకో పో. పలకా, బలపం పట్టుకురా. వచ్చేటప్పుడు, ముఖం నబ్బుపెట్టో, శీకాయి పెట్టో శుభ్రంగా కడుక్కో. అని తన్ని తగిలేసేవాడు.

నా బుద్ధిమంతనం తెలియడానికి ఎక్కువ సేపు పట్టలేదు. నాలుగు చేతులు చూసిన వాడు గనక; జీవితపు లాటరీలో షష్ఠ ప్రయిజు కొట్టేసిన వాడుగనక- ఏశాస్త్రుల్లగారినో పట్టుకు వారఫలాలు జాగ్రత్తగా రాయించుకున్నవాడు గనక।

నన్ను కిక్కురు మనకుండా మొత్తేస్తున్నాడు గురుడు. ఇది నేను కొని తెచ్చి పెట్టుకున్నది. నాకు నెత్తికి చేతులు వస్తాయని తెలుసుకున్న మరుక్షణం మరొకడి కాళ్ళు పట్టుకోటానికి తయారయ్యాను. ఆ చేతులు కొట్టిన తర్వాత, ఆకులు పట్టుకుని మాత్రం ఏమిటిలాభం అని నన్ను నేను నిలవేసి అడిగి రెండు లెంపలూ వేసుకున్నాను. ఒక వాగే వాడికీ మరో వాగేవాడికీ—ముంగిసకీ, పాముకీ ఉన్నంత నేస్తం। అయినా, సామి వాగటంలేదు. సామి నాగుతున్నాడని నేను గనక, అంటే అది నా వాగుడు. బ్లాక్ మెయిల్ నమ్మకండి. నేను కాళ్ళుచ్చుకుని బ్రతిమాలి, బాగుపడ దామని ప్రయత్నించటమూ, మళ్ళా యీవిధంగా కుయ్యటమూ ఏం బాగుంటుంది గనక ?

సామికీ నాకూ కొద్దిరోజుల్లోనే ఎంతోపొత్తు ఏర్పడింది. అవసరం. నా అవసరం. సామి అవసరం ఎంతమాత్రంకాదు. ఇది సామికి ఓ డైవర్షన్. ఓ ఎంటర్టైన్మెంట్ అంతే.

'రామ్మూర్తికి తగిలిన గర్ల్‌ఫ్రెండ్ సావిత్రి సంగతి ఏమైందో చెప్పారుకాదు ఇంతకీ....'

'అవునోయ్ అనందరావూ, సావిత్రిని గూర్చి కదూ నువ్వు అడుగుతున్నది? ఊరికే కాకిగోలలాగ మగగోల చెబుతూవుంటే ఎవడికైనా వినుగొస్తుంది. సావిత్రికి రామ్మూర్తి కనిపించకపోయే సరికి తలక్రిందైపోయింది. కన్నెపిల్లగదా మరి?

రామ్మూర్తి కోసం తెగగాలించింది. పారేసుకున్న నల్లపూస గనకనా రామ్మూర్తి వెతగ్గావెతగ్గా దొరకడానికి? తెగవెదికింది, దొరకలా, విసుగొచ్చి ఊరుకుందా మనుకుంది. ఊరుకోలేకపోయింది.

ఒకరోజు చిక్కడిపల్లి చీకటిగల్లీలో తిరుగుతుండగా నలుసులా కళ్ళలోపడ్డాడు రామ్మూర్తి. సావిత్రి గాబరాపడి, మళ్ళా తనలో తనని సంబాళించుకుని, గబగబా ఎదురువెళ్ళింది. సీరియస్‌గా ఎప్పుడూ చూడనట్టుగా పక్కనుంచి రామ్మూర్తిని "హలో" అని పలకరించింది సావిత్రి.

'ఎవరు' అని చూశాడు రామ్మూర్తి ఓ తెల్లగోడ నడచివచ్చి పలకరించిందేమో అన్నట్టు.

'క్షమించాలి. మీరు....'

'గుర్తుపట్ట లేదనుకుంటా? అనుకున్నాను లెండి, మీరు నన్ను గుర్తుపట్టరని.... నేను సావిత్రిని.... యింకా జ్ఞాపకం వచ్చేలాగా చెప్పమంటారా పోనీ? వనజని కూడాను....'

'ఓ మిస్ వనజ.... అంటే సావిత్రి.... అంటే.... '

'వనజ....'

ఇద్దరు నవ్వేశారు.

'ఎంత దబ్బున గుర్తు పట్టారండీ? పోనీలెండి యిప్పటికైనా గుర్తు పట్టారు గదా? మొదట్లోలాగ గోడను చూసినట్టు చూడకుండా.'

'ఈ మధ్యన చాలా సంఘటనలు జరిగాయి.... 'అని ఆగి,' "మనం యిలా రోడ్డుపక్కన నుంచుని మాట్లాడుకునే కన్న ఏహోటలుకో పోయి....'

'నాకు కొంచెం పని ఉంది మరి. కాలేజీలో ఓ అమ్మాయి నోట్సు తీసుకుని ఓ వారం రోజులైంది. వెంటనే పట్టుకువెళ్ళి యిచ్చెయ్యాలి....'

'ఒక్క అయిదునిమిషాలు....'

ఇద్దరూ దగ్గిరే ఉన్న హోటల్లో దూరారు. కాఫీ తాగుతూ ఒకళ్ల కళ్లల్లోకి ఒకళ్లు, చాల కాలం తర్వాత కలుసుకున్న ప్రేమికుల మాదిరిగా చూసుకున్నారు.

'మీరు ఏదో చెప్పబోతూ ఆగారు.'

రామ్మూర్తి అటూ యిటూ చూశాడు. ఒక సిగరెట్ వెలిగించాడు. 'మీకూ కూడా కవుల్లాగ సిగరెట్ పంగిస్తేనే గాని ఐడియాస్ రావా ఏమిటి?'

'ఐడియాస్ కేం తక్కువ. కొనేవాడే ఉండాలి గాని? ఒక్కొక్క ఐడియాకి ఓ పావలా యిచ్చినా రోజుకో పదిరూపాయలు కళ్ల చూడొచ్చు. అది సరే. ఏరు.... మనం క్రిందటిసారి కలుసుకున్న తర్వాత నాకు ఒక సేట్ తగిలాడు....'

'తగిలాడా? ఇప్పటిదాకా కాళ్ళకి ఎదురు దెబ్బలు తగలటమే గాని మనిషికి మనిషికి తగుల్తాడని తెలియదే నాకు?'

'నాకుమాత్రం తెలుసునా తగిలేదాకా? మరి నేను యిప్పుడు వికార్సయిన బిజినెస్‌లోకి దిగాను.'

'ఏం బిజినెస్సండోయ్? అయినా, మీరు యిదివరకే ఏదో బిజినెస్ చేస్తూ ఉండేవారుకదా?'

'అది సరేననుకోండి. ఇందులో నా పెట్టుబడి ఏమీలేదు. లాభాలువచ్చినా, నష్టాలు వచ్చినా, నాకు వచ్చేరాబడిమాత్రం ఏకరం?'

'ఇదేం వ్యాపారమండోయ్? చాలాలాభసాటిగా ఉన్నట్టుందే చూస్తే? నన్నుకూడా తీసుకోరాదూ పార్టనర్‌గా?'

'సరిపోయింది. మీరు లేకుంటే ఎలా? నేను ఉన్నానంటే, మీరూ ఉన్నట్టేగా?'

'అవుననుకోండి!'

'మీకు యింకా ఎందుకు సందేహం?'

సావిత్రి అదోలా హసించింది. ఆ చూపులో ఏదో చిక్కుప్రశ్న ఉంది. చాలా గజిబిజిగాఉన్నా, ఏమీ కలవరపడకుండా కనిపించే

ప్రయత్నం చేస్తూన్నప్పుడు కనిపించే ఏవో మబ్బుతెరలా కనిపించాయి సావిత్రి ముఖంలో, కళ్ళల్లో.

'మనం ఒకళ్ళ ఎడ్రసు మరొకళ్ళు తెలుసుకోవటం మంచిది.'

'మీకోసం నేను ఎంత వెదికాననుకున్నారు!' అందామనుకుంది సావిత్రి. నోటిదాకా వచ్చిది కూడాను.

'మీ కోసం నేను వెదకని రోజు లేదు. తలుచుకోని క్షణం లేదు' అందామనుకున్నాడు రామ్మూర్తి. ఎందుకైనా మంచిదని ఏమీ అనలేదు. కాని ఇద్దరూ ఒకరికొకరు ఏదో చెప్పబోతూ, చెప్పబోతూ ఆగిపోయారనీ, ఎందుకు ఆగిపోయారో వాళ్ళకే ఆ క్షణంలో స్పష్టంగా తెలియదనీ అనిపించింది యిద్దరికీ.

నోటితో చెప్పలేని మాటలు కళ్ళతో అందిచ్చు కున్నట్టు అయింది.

'మీ చదువు యీ ఏడాదితో అయిపోయేట్టేనా?' ఎంతో చనువుగా అడిగాడు. ఆ ప్రశ్నలో ఎంతో ఆప్యాయత, అభిమానం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. విశ్వాసం ప్రతి మాటలోను తొణుకుతూంది. 'అయిపోవాలి నిజానికి....' అని ఒక్క క్షణం ఆగింది.' నాటకంలో సీరియస్ పోర్షన్ డైలాగ్ చెబుతూ కొంచెం 'పోజ్' యిచ్చినట్టు 'చదువు, వ్యాపారం, రెండూ ఎలా సాగుతాయిగనక?'

'ఇంతకీ నా వ్యాపారం ఏమిటని అడిగారు కాదు?'

'దిగంతర్వాత అదే తెలుస్తుంది గదా? ఇప్పటినుంచే అంత తొందర ఎందుకూ అని?'

'మీ రెంత గడుసు వారండీ?'

'నిజానికి మనిద్దరమూ గడుసు వాళ్ళమని మనిద్దరికీ తెలుసు. అదే అందులో ఉన్న తమాషా.'

'మిమ్మల్ని అప్పుడప్పుడు కలుస్తూ ఉంటాననుకోండి. మీరు కాలేజీనుంచి బయటకు వచ్చేసరికి వ్యాపారంతో ఉంటారనుకోండి.

'అంతకన్నా కావలసిన దేముంది?'

రామ్మూర్తి బిల్లు చెల్లించాడు. ఇద్దరూ చెరో దోవనీ వెళ్ళిపోయారు, ఒకళ్ళని గూర్చి ఒకళ్ళు ఆలోచించు కుంటూ.

రామ్మూర్తి నిటారుగా ఒళ్ళుని ఒక్కసారి పైకి చూపి కాలర్ సవరించుకుని, మళ్ళీ ముందుకు నడిచాడు. కళ్ళకి అంతా స్పష్టంగా కనిపించింది. తను ఏమి చెయ్యవలసినదీ ఫొటోలా కళ్ళముందు ఉంది.

రామ్ రామ్ సేట్‌కి వ్యాపారం చూపిపెట్టటానికి కావలసిన కిటుకులు రామ్మూర్తికి తేలికగా తెలుస్తాయి. అది రామ్మూర్తికి యే మాత్రం కష్టమైన పనికాదు. రామ్మూర్తి ఊళ్ళన్నీ తిరిగి ఆ ఊళ్ళల్లో వీధులన్నీ తిరిగి చివరికి హైద్రాబాదు చేరుకున్నాడాయన. హైద్రాబాదు వచ్చిన తర్వాత కూడా రామ్మూర్తి ఒకచోట స్థిరంగాలేడు. తిరగని గల్లీ లేదు. చెయ్యని పనీలేదు. అవకతవక పనులూ, తప్పుడుపనులూ. ఒకటి ఏమిటి?

ఏ మనిషిమీదా గౌరవంలేదు రామ్మూర్తికి. గౌరవం అనేది చాలా గమ్మత్తయినదని తెలుసు. అది ఏ వ్యక్తిమీద ఎందుకు ఏ విధంగా పుట్టుకొస్తుందో తెలుసుకోవటం కష్టం. ఎందువల్లనంటే దానికి ఎప్పుడూ ఒక కారణం ఉండదు. ఉన్నా అది అందరికళ్ళకీ స్పష్టంగా కనిపించదు. నిజానికి గౌరవానికి మార్కెట్ విలువ ఏమిటీ అంటేనే చిక్కొచ్చేది.

గౌరవం వలన మార్కెట్‌లో విలువ పెరుగుతుందా? లేక పోతే మార్కెట్టులో విలువవలన వ్యక్తికి గౌరవం పెరుగుతుందా? చాలా చిక్కుప్రశ్న. దీనికి ఎవరిదగ్గరా సమాధానంలేదు. రామ్మూర్తి దగ్గరాలేదు. కాని రామ్మూర్తికి ఒక విషయం ఖచ్చితంగా తెలుసు. గౌరవం అనబడేది గాలిపదార్థం అని.

ముఖ్యంగా రాజకీయాల్లోకి దిగకపోయినా, జీవితపురొచ్చులో దిగబడ్డాడుగనక, రామ్మూర్తికి తెలుసు. గాలి ఎప్పుడు ఏ రకంగా తిరుగుతుందో. ఒకరోజున ఒక నాయకుడికి 'జై' మరో కొన్ని రోజులతర్వాత మరోడికి 'నై' అనే వాతావరణంలో తిరుగుతూన్న రామ్మూర్తికే కాదు. రామ్మూర్తి నీడకి కూడా గౌరవం అంటే గౌరవంలేదు. నమ్మకం అసలే ఉండదు. దానికోసం తాపత్రయ పడటం అనే ప్రశ్న లేదు.

ఎవడైనా, ఎప్పుడైనా, ఏరకంగానైనా తిరిగిపోగలడని

తెలుసు రామ్మూర్తికి. మనిషి తన అవసరంకోసం పక్కవాడి పీక నొక్కేస్తాడన్న విషయం నమ్మకంగా తెలుసు.

ప్రతిసారీ బొప్పికట్టేలాగ తగిలిన దెబ్బలు రామ్మూర్తి చర్మాన్ని ఏనుగుతోలులా మార్చిపారేశాయి. అందుకే ఎవరైనా నాలుగుతిట్లు తిట్టినా, మరేమీ పట్టించుకునేవాడు కాదు. గట్టిగా తిడితే గాలికి పోతాయి, మెల్లిగా తిడితే వీకే ఉంటాయి అనే ధోరణి.

ఎవరైనా ముఖంమీద ఉమ్మేస్తేమాత్రం ప్రమాదం ఏమిటి గనక? కార్బాలిక్ సబ్బుపెట్టి ముఖం కడుక్కుంటేసరి? సిగ్గు అనే ఆవిరి పదార్థాన్ని పక్కనపెట్టేస్తే ఎంత సుఖంగా బతకచ్చో. కనీసం బతకడానికి అడ్డదార్లు వేసుకోవచ్చో తెలుసుకున్నాడు రామ్మూర్తి.

రామ్‌రామ్ సేటు ఏమిటి, కిషన్‌చంద్ ఏమిటి, అబుల్‌రహీమ్ ఏమిటి—వీళ్ళెవళ్ళూ చదువుకున్నవాళ్లుకాదు. కాని కాలేజీల్లో చదువుకున్న ఎంతోమంది జనాలు వెధవల్లాగ వీళ్ళ వెంటపడి తిరుగుతారు. వీళ్ళకి పరీక్షలురాసి పట్టాలుపుచ్చుకోవటమేగాని మరేమీ చేతకాదు. మరేమన్నా చేసేదైతే ఎవరైనాయిస్తే ఉద్యోగం పుచ్చుకోవటం. అంతే! అంతకన్న కల నేలకేసి చూడటమూ ఇంకేమీ చేతకాదు.

అందుకే రామ్మూర్తిపోటీ చదివి దగ్గరకు తిరగడు ఎమ్. ఏ. రామ్మూర్తి కాలేజీకి వెళ్ళి చదువుకోలేదు. అయినా కాలేజీ కుర్రాడిలో కనిపించని చలాకీతనం ఉంది. రోడ్డుమీద పుట్టి పెరిగినా, బ్రహ్మాండంగా నటించగల సమర్థత ఉంది. ముఖ్యంగా బతకాలనే కసి ఉంది.

కాలేజీకి వెళ్లటం మత్తు మందు లాంటిది. ఆ పుస్తకాలేమిటో, ఆ లోకమేమిటో, అంతే తప్ప, వేరే లోకం పట్టదు. మరి ఉన్నదంతా మిగతా లోకంలోనే ఉంది గదా.

కాలేజీలోంచి బయటకు రాగానే కనిపించేది ఏమిటి? ఖాళీ, ఎటు చూసినా ఖాళీ. అదీ అంతంలేని ఖాళీ. బతుకుతెరువు తెలియని జీవితం. చేతకాని తనం.

రామ్మూర్తి బతకలేక బడిపంతులు కాలేదు. అందుకే బతికి పోయాడు. అవ్వాలనుకుంటే, మెల్లిగా డింకీలుకొట్టి, స్కూలుఫైనలు పాసై. చిన్న ట్రెయినింగ్ పాసై. ఓ ఎలిమెంటరీ స్కూలు

మేష్టరు కావచ్చు. అయి, తర్వాత అయ్యేది ఏమీ ఉండదు గనక, అలాగే సమాధి అయిపోవచ్చు కూడాను.

'రామ్మూర్తి ఎలిమెంటరీ స్కూలు టీచర్ కాకుండా రక్షించబడి, యింతకీ ఏమయ్యాడని?' మిగతాకథ తెరపై చూడండి' అన్నాడు సడన్‌గా సామి.

'మీకు పట్టూ, విడుపూ మహబాగా తెలుసండీ!' అన్నాను.

'నీకూ తెలుసును. అయితే ఉన్న తేడా అల్లా ఏది పట్టో, ఏది విడుపో తెలియదు. అంతే!'

'అవును.'

'అదే గనక తెలిసిఉంటే, నువ్వు ఏమై ఉండే వాడివో తెలుసా? తెలియదు. తెలుస్తే, నువ్వు యీవిధంగా నేను యీవిధంగా కథచెబుతూ ఉంటే, వింటూ కూచోవు. నువ్వూ ఒకకథానాయకుడివి అయి ఉండే వాడివి. నువ్వూ ఏ కథ ఒకటి తయారుచేసేవాడివి. లేకపోతే ఒకటి సృష్టించే వాడివి. మక్పైకి వచ్చి ఉంటే, యింకో భ్రమరాజు నీ కథ చిలవలూ పలవలూ కల్పించి రాసిపారేసేవాడు ప్రజల మీద. అప్పుడు నువ్వు యిలాపడి ఉండేవాడివి కాదు, విరగొట్టిన మంచంకోడులాగ.'

'నేను విరగ్గొట్టిన మంచంకోడు నన్నమాట.'

'కాదు నిటారుగా నిలబడ్డ పందిర రాటవి. సరేనా?'

'ఏదికాదు సార్?'

'ఏది అవునో చెప్పు?'

'మీతో నెగ్గటం మహాకష్టం?'

'నాతో నువ్వు నెగ్గటమెందుకు నరసహరిరావూ? నాకూ. నీకూ ఏమంత పెద్ద పరిచయమని? ఎంతకాలం నువ్వు నాకు తెలుసని? అయినా నేను ఏదో చెబుతూనే ఉన్నాననుకో. ఏవో బైరాగి చిట్కాలు తెలుసుకుందామని గదా నీ తాపత్రయం? అంతేనా రాఘవులూ?'

'ఎంత మాట?'

'నీకూ బలేగా వచ్చోయ్ నటించటం, అమర్ సింగ్?'

'అవునండి....కాదండి....'

'ఊఁ?'

'మీ శిష్యరికం చేస్తున్నప్పటినుంచీ, నాలో ఎంత జ్ఞానం వచ్చిందనుకున్నారు?'

'పోనీలే, యివాళ పొద్దున్నుంచీ నీలో తెలివితేటలు పెరిగాయన్నావు కాదు యింకాను?'

'నన్ను మరీ అంత తీసిపారెయ్యకండి.'

'చూశావా, యీరకంగా నన్ను తీసిపారెయ్యకండి. నన్ను గుర్తించండి. నాగొడవ వినండి. నేను నిజంగా చాలా గొప్పవాడిని సార్!—అన్నంత కాలం, కాఫీహోటల్లో కప్పులు కడిగే పుల్లావు కూడా పూచికపుల్ల లాగ తీసిపారేస్తాడేగాని, విరిగిన బీడీముక్క కిచ్చిన విలువకూడా యివ్వడనుకో?'

'నిన్ను ఎవడన్నా ఖాతరుచెయ్యాలంటే, నువ్వు ఎవర్నీ ఖాతరు చెయ్యకూడదు. ఇదీ రహస్యం. ఇది తెలుసుకున్నాడు గనకనే రామ్మూర్తి పందిరి బజారు ఎక్కి కొప్పెక్కి కూచున్నాడు. తెలిసిందా సులోచనారు సారేసు కొచ్చిన సులేమాన్ సాయిబూ?' అన్నాడు స్వామి వీపుమీద చెళ్ళున చరిచినట్లుగా.

మళ్ళీ ముచ్చ్యమన్నదాకా నోరు తెరుచుకు కూచోటంకన్న వేరే గత్యంతరం లేకపోయింది అప్పటికి.

* * * *

## 9. వేసుకున్న అడ్డదార్లా - తవ్వుకున్న గోతులా

నేను విష్ణుశర్మనీకాదు, నువ్వు మూర్ఖుడైన రాజకుమారుడివీ కాదు. నేను చెప్పినదీ, చెప్పబోయేదీ పంచతంత్రం అంతకన్నా కాదు. నేను ఏదో చెబుతూనే ఉన్నాను. నువ్వు వింటూనే ఉన్నావు.

'ప్రతిరోజూ రాత్రికి నువ్వు హాజరుకావటం, నేను యిది చాలా ముఖ్యమైన పనిలాగ, నీకు రామ్మూర్తి కథ చెప్పటం యధా

విధిగా సాగుతూంది. మన యిద్దరిమధ్యా ఏదో ఏర్పడుతూంది. పాలీడుగూడు పోగుల్లాగ. అవునా ఆవార్లూ?'

సామియెంత చదువుకున్నాడని నాకు తెలియదు. స్కూలుకీ, కాలేజికీ వెళ్ళి చదువుకోక పోయిఉండొచ్చు. కాని, బాగా చదువు కుని, అర్థంచేసుకుని ఏ విషయాన్నయినా కూలంకషంగా చర్చించ గలిగే సమర్థత సామికి ఉన్నదని గ్రహించటానికి యిన్నిరోజులు పట్టిందినాకు.

సామికి యిన్ని విషయాలు పుస్తకాలు చదవటంవలన తెలిసా యంటే నేనేకాదు ఎవ్వడూ నమ్మడు. అడుగడుక్కూ మనిషి మనిషికీ ఎంతో తేడాఉంది. వేసిన ఏ అడుగూ పాతదికాదు. కలిసిన ప్రతి మనిషీ ఒక్కొక్క తరహా. మరి ఏపుస్తకంలో. ఏపేజీలో వెతుకుతాం గనక. ఎవడు ఎటువంటివాడో?

సామికి తెలిసినదీ నాకు తెలియనిది యిదే. నాకే కాదు. పుస్తకాలే చదివి. వల్లెవేసే ఏ ఒక్కడికీకూడా తెలియనిది యిదే. తెలుసుకోదలుచుకున్న వాడికి లోకమే ఒక పెద్ద భాండాగారం.

రామ్మూర్తి ఎవడోగాని. రామ్మూర్తి శిష్యుడే యింతటి వాడైతే, యింక రామ్మూర్తి ఎంతటివాడో ననిపిస్తూంది, అయితే, గురువును మించిన శిష్యుడుకూడా ఉండవచ్చుగా!

సామి అన్నట్టు నేను రామ్మూర్తికి మనవణ్ణి కావాలి నిజానికి, రామ్మూర్తి శిష్యుడికిశిష్యుడు కావటం ఏనాదబ్రహ్మ యింటి పక్కనో కాపురమున్నంత పని.

ఇది తెలుసుకుని పొంగిపోయాను.

సామి నావైపు చూశాడు. 'అటూ ఇటూ చూడకు అబ్దుల్ రహీం లాగ' అంటూ—

'అబ్దుల్ రహీమ్' అంటే రామ్‌రామ్ సేట్ దగ్గర పనిచేసి పని చేసి పార్ట్‌నర్ అయిపోయిన బావతుకదూ!'

'బలే జ్ఞాపకం ఉందోయ్ నీకు పీరుసాయిబూ? ఆ అబ్దుల్ రహీమ్ వేరు, అల్లాఅయితే ఒకడేగాని అబ్దుల్ రహీమ్ పేరుగలవాళ్ళు జనాభాలో కావలసినంతమంది. దానికోసం అలీఘర్ వెళ్లక్కర్లేదు.

'రామ్ రామ్ రామ్మూర్తిని మార్కెట్‌లోకి తీసుకువెళ్ళి 'వీడు మావాడు. వీడిని నమ్మొచ్చు' అని అర్థంవచ్చేలాగా పరిచయంచేశాడనుకో....'

'అవును మరి. రామ్ రామ్ దగ్గర పనిచేస్తున్నాడు గనకవెళ్ళి తనతో వ్యాపారసంబంధం ఉన్నవాళ్ళందరికీ పరిచయం చేస్తాడు సహజంగా....'

'నాలుగు నాలుగుల పదహారేళ్ళ్లు కాదు యింకా. నీకుప్రవృత్తింలో ముక్కలు వల్లెవెయ్యటం. లెక్కలు చూడటం ఎవడన్నా ఉద్యోగం యిస్తే చెయ్యటం తప్ప మరేమి రావులాగవుంది చూస్తే. ఎవడైనా ఓ పలుకుబడిగల వ్యాపారస్తుడు మరొకడి దగ్గరికి వెళ్ళి ఒకడిని చూపించి 'వీడు మావాడు వీడిని నమ్మండి. వ్యాపారం పొద్దుపెంచీ' అని పనివేశా చెప్పడు. తనుచేసే వ్యవహారాల్లో వీడిని యిరికిస్తాడు. వీడు యిరుక్కున్నా, తెలివిగలవాడైతే తనను యిరికించినవాళ్ళనే మళ్ళీ బయటికిరాకుండా యిరికించి, తను లాభసాటగా బయటపడతాడు.

రామ్మూర్తిని బజార్లోకి తీసుకువెళ్ళి మొట్టమొదట ఓ సోడా దుకాణంలో షరో ఆసామితో పరిచయం చేశాడు. ఆ సోడా దుకాణం ఆబిడ్స్‌రోడ్ జంక్షన్‌లో ఉంది. దుకాణం నిండా అద్దాలు. రామ్మూర్తి ఒక్కసారి అద్దంలో తన ముఖం చూసుకుని, అందరి ముఖాలూ చూశాడు. తన ముఖం అన్ని కోణాల్లోంచీ భయమేవేలాగ కనిపిస్తూంది. అందరి ముఖాలూ అన్ని కోణాల్లోంచి ఢీకొన్నట్టున్నాయి. ఒక్కొక్కళ్ళకి ఒకే ముఖం. కాని, యిన్ని ముఖాలు? అన్నిముఖాలూ తమని తాము చూసుకోలేక, యితర ముఖాల్ని చూస్తున్నాయి. ఇకిలిస్తున్నాయి. సకిలిస్తున్నాయి. గుడ్లు ఉరిమి చూస్తున్నాయి. ఎవడిని ఎప్పుడు మింగేద్దామా, అని ఎదురు చూస్తున్నాయి.

ఎవడో మీసాలరావు వచ్చి రెండు 'బాదంగీర్లు' అని గీరగా అని, ఒకదాని తర్వాత ఒకటి తాగి, డబ్బిచ్చేసి వెళ్ళిపోతూ రామ్మూర్తికి ఏదో కాగితం యిచ్చి వెళ్ళిపోయాడు.

ఆ రాగితం చూస్తూ చూస్తూన్న రామ్ రామ్ ముఖంలో రంగులు మారిపోయాయి. అదేదో డిటెక్టివ్ సినిమాలాగ కని పించింది. ఎవడీ మీసాలరావు? 'వాడి' బయాగ్రఫీ, ఏమిటి?, అనే ప్రశ్న అడగకుండానే రామ్ రామ్ అన్నాడు.

'మనం సికింద్రాబాద్ వెళ్ళాలి,' అని రామ్మూర్తిని ఓ చిన్న సూట్‌కేస్‌లాగ వెంట తీసుకుపోయాడు. సికింద్రాబాద్ స్టేషన్‌లో బస్సుదిగాడు వీధి పౌరుల్లాగ.

స్టేషన్‌రోడ్డులో ఒక గడియారాలు రిపేర్‌చేసే దుకాణం దగ్గర ఆగాడు రామ్ రామ్. ఆ దుకాణంలో స్ప్రింగులు ఊడదీస్తున్న ఓ సాయిబు రామ్ రామ్. దగ్గరగా వచ్చి 'రావ్‌సాహబ్‌నహీఆయే.' అన్నాడు. రామ్ రామ్‌కే వినిపించేలాగ.

'అచ్చా!' అని అక్కడ ఉన్న సూట్‌కేస్‌ను రామ్మూర్తికి యిచ్చి, 'ఏమూర్తీ సాహబ్, అప్నా ఆద్మీ! అన్నాడు ఆ సాయిబు తనని తాను అబ్దుల్ గనీ అని పరిచయం చేసుకున్నాడు.

ఆసూట్‌కేస్ తీసుకుని టాక్సీలో ఎక్కించుకుని బయలుదేరారు. మార్కెట్‌లోకి వెళ్ళగానే, ఎవరో పొడుగాటి మనిషి టాక్సీ ఆపు చేశాడు, తలుపుతీసి, చొరవగా లోపలికి వచ్చి పక్కన కూర్చున్నాడు. ఈ కొత్తమనిషికి కూడా 'అప్నా ఆద్మీ' అని పరిచయంచేశాడు. ఆ వ్యక్తి 'రావ్' అని తనని తాను పరిచయం చేసుకున్నాడు.

'వీరు యింకా రాలేదని అక్కడ అబ్దుల్‌గనీ అన్నాడుకదూ?'

'అవును' అని రామ్ రామ్ అనడమూ, నావైపు విసుగ్గా చూడటమూ, రావ్‌సాహబ్ అనుమానంగా ఒక చూపు విసరటమూ, మీట నొక్కినట్లుగా ఒకేసారి జరిగాయి.

రావ్‌సాహబ్ నావైపు తేరిపార చూసి 'మిమ్మల్ని ఎక్కడో చూశాను....ఎక్కడ చూశానో జ్ఞాపకం రావటంలేదు....'

'పొరబడ్డారు. మిమ్మలి నేను మొదటిసారిగా చూస్తున్నాను....'

'.........'

'రావ్ మాత్రం ఏదో మర్చిపోయిన వాడికిమల్లే యిటూ అటూ చూశాడు, నాచేతిలోని సూట్‌కేస్ లాంటిదే రావ్ దగరకూడా

ఉంది. జంక్షన్‌లో టాక్సీ ఆపి, 'మీకు ఫోన్‌చేశాను.' అని తన దగ్గర ఉన్న సూట్‌కేస్ టాక్సీలోవదలి రామ్మూర్తి దగ్గర ఉన్న సూట్‌కేస్ తీసుకుని దిగిపోయాడు. రామ్మూర్తి యిది గుర్తుపట్టి పొరపాటు జరిగిందేమోనని అనుమానించి, 'మీ సూట్‌కేస్ యిది' అని యివ్వబోయాడు.

రావ్ 'క్యాకబ్బా ఆద్మీ మాలూమ్ హోతాహై.' అని నవ్వుతూ దిగిపోయాడు. రావ్‌సాహబ్ ఎందుకల్లా అన్నాడో బోధపడలేదు రామ్మూర్తికి.

రామ్మూర్తి ఏదో అనబోతూంటే రామ్‌రామ్ అన్నాడు : 'మీరు యీవిషయం గుర్తుంచుకోండి. ఒకచోట జరిగినది మాటవరసకైనా సరే మరోచోట ఎత్తకండి. ఇందాక చేసిన పొరపాటు మళ్ళీ ఎప్పుడూ చెయ్యకండి, అయినా ఏ సూట్‌కేస్ ఎవరిదో ఎవరికి తెలియదని ? నేను లేనూ యిక్కడ ?'

రామ్మూర్తి కిమ్మనలేదు.

రామ్‌రామ్ అన్నాడు మళ్ళీ—'అందులో ఏముందో తెలుసా?'

'తెలీదు'

'నల్లమందు.... ఓపీమ్'

రామ్మూర్తి కళ్ళల్లో కొట్టొచ్చే ఆశ్చర్యాన్ని చూసి, మళ్ళా అన్నాడు రామ్‌రామ్.

'ఇది నా వ్యాపారంలో ఓచిన్నభాగం. సాయంత్రంలోగా యిలాటివి చూసినప్పుడల్లా గాబరాపడినట్టు కనిపించకండి ?'

రామ్మూర్తి లెంపలు వేసుకోలేదుకాని లోలోపల మాత్రం అదేవిధంగా అనుకున్నాడు. హాండ్‌బ్యాగ్‌లో హాండ్‌గ్రనేడ్ ఉన్నా యింక ఆశ్చర్యపడదలుచుకోలేదు.

చీకటి పడేలోపుగా మరో పదిచోట్లకి తీసుకు వెళ్ళాడు రామ్మూర్తిని. అందులో ఓ కిరసనాయిలు దుకాణం, ఓ కిళ్ళీకొట్టూ, రెండు మిఠాయిదుకాణాలూ, నాలుగు కల్లుంకొట్లూ, రెండు బట్టల దుకాణాలూ ఉన్నాయి. వాళ్ళందరూ బయటచేసే వ్యాపారం వేరు. లోపల జరిపే వ్యాపారం వేరు.

సికింద్రాబాదులో రెండు కిరసనాయిలు దుకాణాలూ అమ్ము తున్నది నాటుసారాఅనీ. దాని వ్యవహారం నడిపిస్తూన్నది రామ్‌రామ్ అనీ తెలిసి ఆశ్చర్యపడ్డాడు ఎంతవద్దనుకున్నా.

మార్కెట్‌దగ్గర రాంరాం ఆగినప్పుడు అక్కడ ఓ కిరస నాయిలు దుకాణంలో మాసిపోయిన బట్టలూ, అంతన్న మాసిపోయిన గడ్డమూవున్న ఓ నరసయ్య, సేట్ సంజ్ఞచేసినమీదట రామ్మూర్తికి కొంతడబ్బు యిచ్చాడు. ఆ దుకాణం పక్కగల్లీలో కొందరు తాగి తూలుతున్నారు. వాళ్ళనిచూస్తే నిజానికి వాళ్ళు కిరసనాయిలు తాగి పడిపోయారేమో ననిపించింది.

మరో కిరసనాయిలు దుకాణందగ్గర మరో ఆంజనేయులు అదే విధంగా వంగి వంగిగా మాట్లాడుతూ సేట్ సంజ్ఞచేసిన మీదట రామ్మూర్తికి డబ్బుయిచ్చాడు.

రెండు కిరసనాయిలు దుకాణాల్లోనూ యిచ్చిన డబ్బు ఓ బ్యాగ్‌లో పెట్టుకున్నాడు రామ్ రామ్....

తర్వాత కలాసీగూడాలో ఓ మిఠాయి దుకాణం దగ్గరకెళ్ళాడు. అక్కడ ఓ శంకరయ్య సేట్‌ని పక్కకు తీసుకువెళ్ళి మాట్లాడాడు. అక్కడే దగ్గరలోవున్న మరో మిఠాయిదుకాణంలో ఉన్న ఓగణపతి డబ్బు సేట్‌కి యిస్తే అది తీసుకుని రామ్మూర్తికి యిచ్చాడు ఆ దుకాణంలోనే.

ఆ తర్వాత ప్రతిగల్లీ లోనూ తిరిగినట్టయింది రామ్మూర్తిపని. నాలుగు చిల్లరకొట్లలోనూ వాళ్ళు అమ్ముతున్నది నల్లమందని తెలిసి కోవటానికి ఎక్కువసేపు పట్టలేదు రామ్మూర్తికి. వాళ్ళందరిచేతా రామ్మూర్తికే యిప్పించాడు డబ్బు. డబ్బు యిచ్చినప్పుడల్లా ఈయన వచ్చి సరుకుయిచ్చి డబ్బు తీసుకువెడతాడని చెప్పాడు.

తరువాత మార్కెట్ దగ్గరకు వచ్చారు యిద్దరో టాక్సీలో. రామ్ రామ్ కారు రిపేర్‌కి వెళ్ళటంవలన ఆవాళ వాళ్ళు టాక్సీలోనే తిరుగుతున్నారు. సొంతకారు ఉన్నా టాక్సీలో వెళ్ళవలసిన చోట్లకి టాక్సీలోనే వెళ్ళాలి. అయినా యివాళ మనకారు రిపేర్‌లో ఉంది అనుకో,' అని అన్నాడు రామ్‌రామ్.

ఓ బట్టల దుకాణం దగ్గర ఆగారు వాళ్లు. లోపలికి తీసుకు వెళ్ళాడు రామ్మూర్తిని. లోపల గుహలాగ ఉంది. ఎంత వెళ్ళినా తరగటంలేదు. ప్రతి గదిలో ఒక్కొక్కడు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడు సేట్‌ని చూసి. చివరికి ఓ గది దగ్గర ఆగాడు రామ్ రామ్ సేట్. 'రిమ్‌లెస్‌స్పెక్ట్స్' పెట్టుకొన్న రతన్‌లాల్ అనే పెద్ద మనిషిని రామ్మూర్తికి పరిచయం చేశాడు. ఆ పెద్దమనిషి రామ్మూర్తి చెయ్యి అదేపనిగా ఊపేశాడు. ఏ దారాపింగ్ దగ్గరో కసరత్ నేర్చుకోలేదు గదా అనిపించింది. సేట్లూ, రతన్‌లాలూ ఏమి మాట్లాడు కున్నారో రామ్మూర్తికి అర్థంకాలేదు. ఆశ్చర్యపడటంకన్న వేరే ఏమీ చెయ్యలేకపోయాడు. మిగతాబట్టల దుకాణాల్లోకూడా యిదే విధంగా పరిచయాలుచేసి, వ్యవహారాలు మాట్లాడి, యింటికి చేరుకునే సరికి, సేట్‌కోసం నలుగురు నాలుగు రకాలైన దుస్తులతో కాసుకుని కూచున్నారు. అయిదు నిమిషాల్లో ఆ టెలిఫోన్ ఎన్నిసార్లుమోగిందో లెక్కలేదు.

రోజంతా యింత తిరిగినా రామ్ రామ్ సేట్‌కి కొంచెం గూడా విసుగులేదు. వయసుమీరినా మాటపొరబడటంగాని, చెయ్యి వణకటం గాని లేదు.

రామ్ రామ్ కోసం కాసుకుని కూచున్నవాళ్లల్లో మొట్ట మొదట సేట్‌నివెళ్లి కలుసుకున్నది ఓ సూట్‌వేసుకున్న పెద్దమనిషి. సేట్‌తో ఎవరైనా మాట్లాడుతూన్నప్పుడు, ప్రత్యేకంగా పిలిస్తేనే గాని వెళ్లడు రామ్మూర్తి.

బయటకు వస్తూన్న ఆ పెద్దమనిషి లోపలికి వెళ్ళేటప్పటికీ, బయటకు వచ్చేసరికీ ఎంతో వ్యత్యాసం కనిపించింది. వెళ్ళేటప్పుడు ఎంత ఉషారుగా వెళ్ళాడో, వచ్చేటప్పుడు అంత నీరసంగా కని పించాడు.

రెండో పెద్దమనిషి నల్ల షేర్వాణీ, చూడీదార్‌పైజమా వేసు కున్నాడు. చిన్న గడ్డం ఉంది, లోపలికి వెళ్ళేటప్పుడు ఎంతో అను మానంగా వెళ్ళాడు. బయటకు వచ్చేటప్పుడు మాత్రం ముఖంమీద ఓ మణుగు సంతోషాన్ని పోగేసుకుని వచ్చాడు.

మూడో పెద్ద మనిషి చొక్కా, పైజమా వేసుకున్నాడు, పళ్ళికిలిస్తూ లోపలికి వెళ్ళాడు, పళ్ళికిలిస్తూనే బయటికి వచ్చాడు. ఈ పైజమా పెద్దమనిషి అత్తరు వ్యాపారస్థుడులాగా ఉన్నాడు చూస్తే— ఎందువల్లనంటే తెగ సెంటువాసన కొడుతూంది దూరంనుంచే.

వెళ్ళినవాడు మళ్ళీ తిరిగివచ్చి, 'రామ్మూర్తి మీరేనా' అని పలకరించి, సమాధానం కోసం ఆగకుండానే వెళ్ళిపోయాడు.

రామ్మూర్తికి అర్థంకాలేదు. కాని, అర్థం ఆయినట్టు నటించటమే మంచిదనిపించింది. రామ్మూర్తి రామ్ రామ్ సేట్ గదిలోకి వెళ్ళాడు. రామ్ రామ్ సేట్ ముఖం ప్రసన్నంగా ఉంది. ఇంత మందితో యిన్ని రకాలుగా వ్యవహారాలు చేసినా ఏమీ చెక్కుచెదర కుండా నవ్వుతూ ఉన్నాడు. ఇది అసలైన పిసలైన బిజినెస్‌మాన్ లక్షణం. రామ్మూర్తి నేర్చుకున్న మొదటిపాఠం.

'ఇక్కడపని చూసుకునే సరికి మరో గంటైనా పడుతుంది. మీరు కావలిస్తే వెళ్ళొచ్చు. రేపు ప్రొద్దున్న తొమ్మిది గంటలకు ఆబిడ్స్ రోడ్డులో సోడాదుకాణం దగ్గర రావ్ సాహబ్ మిమ్మల్ని కలుస్తారు. రేపటి ప్రోగ్రాం ఆయనే చెబుతారు. ఇంక వెళ్ళొచ్చు మీరు.'

రామ్ రామ్ కాగితాల్లో మునిగిపోయాడుమళ్ళా. రామ్మూర్తి మళ్ళా చీకట్లోకి వచ్చాడు. చిక్కడిపల్లినుంచి ఓ వారంరోజుల్లో మారి పోతాడు. ఏ హిమాయత్ నగర్‌లోనో ఓ చిన్న యిల్లు తీసుకుంటాడు. ఎవరిజేబు తడమాలా అన్నప్రశ్నరాదు. ప్రతిసాయంత్రం యికమీదట. ఇప్పటిదాకా వారానికోసారైనా కడుపునిండా భోజనం చెయ్యాలంటే ఎవరి పైనైనా. దండకమో, అష్టోత్రమో చదవలసి వచ్చేది.

రామ్మూర్తికి అబద్ధాలు చెప్పడానికీ, ఊపిరి పీల్చడానికీ పెద్ద తేడా ఏమీలేదు. కొన్ని సంవత్సరాలబట్టీ; తనకు బుద్ధితెలిసినప్పటి నుంచీ, తడుముకోకుండా అబద్ధాలు చెప్పటం రామ్మూర్తికి పుట్టుకతో వచ్చిన విద్యకాదు. కటువైన జీవితం రామ్మూర్తికి నేర్పిన పటువైన సత్యం, అబద్ధం.

రామ్మూర్తి ఎవరేమన్నా ఎన్నడూ పట్టించుకోలేదు యిప్పటిదాకా. ఇప్పుడు అసలే పట్టించుకోడు. ఏళ్ళకి ఏళ్ళు. తాగినచోట నీళ్లు తాగ

కుండా, తిన్నచోట తినకుండా. కొట్టినజేబు కొట్టకుండా, అరుగు తూన్న చెప్పుల్నీ, కరుగుతూన్న మంచితనాన్నీ లెక్కచెయ్యకుండా తిరిగాడు రామ్మూర్తి.

ఏ మాత్రం మంచితనం మిగిలిఉన్నా అన్నం పుట్టదన్న సంగతి ఏ పుస్తకంలోంచీ చదివిచెప్పక్కర్లేదు రామ్మూర్తికి.

వారంలో ఎన్ని రోజులు అన్నం తినడం మానేశాడన్నది కాదు; ఎన్నిసార్లు అన్నం తిన్నాడన్నది మననం చేసుకునే రామ్మూర్తికి ఎవరూ పాఠాలు చెప్పక్కర్లేదు. రోజురోజుకీ, పూటపూటకీ తిండి కోసం తిప్పలు పడటమూ, వేసుకున్నలాగూ. చొక్కా, తనదైనా కాకపోయినా అది చిరిగితే, మరొకటి చిక్కించుకోవటంకోసం ఎవడి జేబు కొయ్యాలో ఆలోచించటమూ-ఊపిరిలాగ అవసరంపోయింది రామ్మూర్తికి.

చిక్కడిపల్లిలో తను ఎక్కువకాలం ఉండబోవటంలేదన్న సంగతి రామ్మూర్తికి తెలుసు. అందుకే చుట్టూరావున్న వాతావరణం అంతా ఏదో కొత్తగా, చికాకుగా కనిపించింది అతనికి. ఇంతకాలం బట్టీ యిక్కడే ఉన్నానన్న సంగతి తెలుసుకునేసరికి యేదో అనిపించింది.

కుబుసం విడిచిన పాములాగ కొత్తదశలోకి వెళ్ళినట్టుంది రామ్మూర్తి పని.

గదిలోకి రాగానే జరిగినదేమిటని ఒక్కసారి తలుచుకున్నాడు. రామ్ రామ్‌సేట్ అందరిచేతా తనకు డబ్బు యిప్పించినదీ, వాళ్ళందరూ తనను ఏ విధంగా గుచ్చి గుచ్చి చూసినదీ. చివరికి యింటికి వెళ్ళిన తర్వాత నలుగురూ నాలుగురకాలుగా ప్రవర్తిస్తూంటే గుడ్లు అప్పగించి చూడటంకన్న తను ఏమీ చెయ్యలేకపోవటం చూస్తూంటే తనకి తెలియకుండానే తను రామ్ రామ్‌సేట్ చేతుల్లోకి ఏ విధంగా వెళ్ళిపోతున్నదీ ఆ కీలకమైన సంగతి తెలుసుకున్నాడు రామ్మూర్తి.

సావిత్రిని కూడా యీ వ్యాపారంలోకి ఎందుకు లాగాలను కున్నాడో ఎంతగింజుకున్నా అర్థంకాలేదు రామ్మూర్తికి, భావికి వేసుకుంటూన్న అడ్డదారులే కనిపిస్తున్నాయిగాని, తెలియకుండానే

తనకుతాను తప్పుకుంటూన్న గోతులు కనిపించటంలేదు అంత స్పష్టంగా. 'ఇంతకీ రామ్మూర్తి మనిషేగా అందరిలాగా ?' అన్నారు చటుక్కున సామి.

'అవుననుకోండి' అన్నాను. నేనేమంటున్నానో తెలుసుకోకుండానే.

* * * *

## 9. వేసిన ముందడుగు - ఏమిటని అడుగు

కథ మాట ఎలా ఉన్నా, రామ్మూర్తి నా దృష్టిలో ఓ ప్రత్యేకమైన స్థానం ఏర్పరుచుకున్నాడు. ఎవరన్నా సాగదీసి 'ప్లాసీ యుద్ధము ఎప్పుడు జరిగెను ? అందు ఎవరు గెలిచిరి ? సంధి ఫలితములెవ్వి ?' అని సాగదీసి అడిగితే, 'నాకు దెలియదు. ఎందువల్లననగా నాకు దెలియదు' అనవలసి వస్తుంది. కాని, రామ్మూర్తి ఎవ్వరని ఎవ్వరూ అడగకపోయినా తెలిసినవాళ్ల దగ్గిరకీ, కావలసిన వాళ్లదగ్గిరకీ, అక్కరలేనివాళ్ల దగ్గిరకీ పనిగట్టుకువెళ్ళి, యీయన జీవితచరిత్ర యిది అని చెప్పి, నెత్తిన నాలుగు అక్షింతలువేసో, వేయించుకునో వక్కావస్తాను. యజమాని రాకకోసం వరండాలోపడికూచుని కునికిపాట్లు పడుతూ ఏమీతోచక ఖిన్నవదనుడై పల్లీలు కొడుతూన్న మిడతంభొట్లు లాగ ఉన్న నన్నుచూసి సామి అన్నాడు- 'మైడియర్ వెంకట్రావ్, లోకంలో అన్నింటికన్న తేలికైనది ఏమిటి చెప్పుకో చూద్దాం ?'

'సుఖంగా భోజనం చెయ్యడం' అని ఆగి,' డబ్బులు ఏమీ యియ్యకుండా - డి. పీ.' అన్నాను.

'నువ్వు భోజనప్రియుడవని తెలుస్తూనే ఉంది. కాని మాంధాత పుస్తకాల్లోకి ఎక్కిపోయి పురాణ పురుషుడైపోయిన తర్వాత మరి ఎవ్వడూ ఊరికే కూడు పెట్టడం మానేసాడనుకో యీ దేశంలో. కూటి దాకా ఎందుకు మంచినీళ్లుకూడా యియ్యటంలేదు యిప్పుడు.

రామ్మూర్తి మర్నాడు, మరో వారంరోజులూ తెగకొట్టు కున్నాడు. ఏమిటి. వెధవగది ?.... ఈ వెధవ చిక్కడిపల్లి.... ఈవెధవగల్లీలు....? చుట్టూరా వెధవలు.... అంట్లవెధవలు.... పనికిరాని చేతకాని వాజమ్మలు.... డంబ్ క్రీచర్స్.... అంటూ బజార్లోకివచ్చి. యిటూ అటూ చూశాడు.

దారిన పోతూన్న ప్రతి సుబ్బారావు చొక్కా పుచ్చుకుని, 'ఏరా అబ్బాయ్, నీ తల విలువెంత ? నీ సగటు ఆదాయం ఏమిటి ? నీ వృత్తి ? ఇన్‌కంటాక్సు ఎంత కడుతున్నావు ? ఎంత ఎగ్గొడు తున్నావు ? నీ ఆటోబయాగ్రఫీ యీ మురికికాలువ పక్కన కక్కెయ్య' అనాలనిపించింది రామ్మూర్తికి.

అవాళనుంచీ, నిజానికి వారంరోజులనుంచీ, బుర్రకొట్టుకున్నా చాలా విషయాలు అర్థం కావటం మానేశాయి, అప్పటిదాకా ఆగి. పోయిన గుండె అప్పుడే కొట్టుకోటం మొదలెట్టి నట్టుగా ఉంది రామ్మూర్తి ప్రాణానికి.

కుక్కతోక ముడుచుకుని విరిగిన రొట్టిముక్కలకోసమూ, ఎంగిలి విస్తరాకుల కోసమూ, ఎగబడి, దెబ్బలాడి, కాట్లకుక్కలతో కలియబడి గెలుచుకొచ్చిన సుబ్బిగాడి పక్కనే బిక్కు బిక్కుమంటూ ఎందుకు విల్చుందో తెలియలేదు రామ్మూర్తికి అవాళ.

సగంతిని పారేసిన చాక్లెట్‌కోసం ఆశగాచూసి, అందక (అది కాలవలో పడిపోయింది), మురికితో బాటు కొట్టుకుపోతూన్న ప్పుడు చేసేది ఏమీలేక బిక్కముఖం వేసుకుని కూచున్న కుర్రాడు అలా ఎందుకు ఉన్నాడో అర్థంకాకుండా పోయింది అవాళ రామ్మూర్తికి.

గదిలో ఉన్న ప్రతివస్తువూ కొత్తగా కనిపిస్తూంది. గదిలో ఏముందని ? మడతపెట్టడానికి కూడా కూడిరాని ఓచాప, మాసి— తగలబెట్టినా తగలడని - తలగడా (గలీబు ఎక్కడని అడగకండి), చీకటిలో నల్లబడిపోయి, ఎవ్వడూ కొనని పాత పత్రికలూను.

అవాళ గది వదిలేసి హిమాయత్ నగర్‌లో ఓ మేడమీద రెండుగదులు అద్దెకు తీసుకున్నాడు. పాతగదిలోంచి తీసుకు వెళ్ళ వలసినవి ఏమీలేవు. చింకిచాప, చిరిగిన పత్రికలూ మురికి కాలవలోకి

విసిరేశాడు కసిగా. చుట్టు పక్కల ఉన్న వాళ్ళని పలకరిద్దామని పించ లేదు.

చెప్పకుండా వెళ్ళి పోతే?

ఇంతకాలంబట్టీ ఉంటూ ఒక్కసారైనా, మాటవరసకైనా చెప్పి వెళ్ళకపోవటం ఏమీబాగా కనిపించలేదు. పాతగదితో పాటు సంవత్సరాల తరబడి కుళ్ళిపోయిన పాతజీవితాన్ని, దానితాలూకు స్మృతుల వాసనలతోసహా అక్కడే తగలెట్టి, పూడ్చి, వదిలేసి వెళ్ళి పోవట్సున్నాడు. అందుకే యింటి యజమాని శేషయ్యగారి దగ్గిరికి వెళ్ళి అన్నాడు: 'నేను గది ఖాళీచేసి వెడుతున్నాను. ఇదుగో యీనెల అద్దె.' మొట్టమొదటిసారిగా యింతఖచ్చితంగా అద్దె తెచ్చి యిచ్చిన రామ్మూర్తిని చూసి తెగ ఆశ్చర్యపడ్డాడు శేషయ్య.

నిజానికి రామ్మూర్తి అద్దె ఎప్పుడూ సరిగ్గా యిచ్చిన పాపాన పోలేదు. రామ్మూర్తి ఎప్పుడు ఏమియిచ్చాడో శేషయ్యకి జ్ఞాపకం కూడాలేదు. ఆ గది పాడు చీకటికూపం గనక దానిమీద పెద్ద ఆశలు పెట్టుకోలేదు శేషయ్య. మరి రామ్మూర్తి వెడితేనేంచాలు అందులోకి దూకేద్దామని ఏ పిఠాపురం రాజాతమ్ముడూ కాసుకుని కూచోనూలేదు. కాని రామ్మూర్తి గది ఖాళీచేసి వెడుతున్నాడనేసరికి శేషయ్యకి దిగులుపుట్టింది. ...ద్దెకోసంకాదు. రామ్మూర్తి బాగుపడిపోతున్నా డేమోనని అనుమానం కలిగి, రామ్మూర్తి కళ్ళల్లోకి చూశాడు శేషయ్య. అవి మెరుస్తున్నాయి. లోపలికి దిగమునిపోయి లేవు మునపటిలాగ. రెండు చెంపలూ రెండు లోయల్లాగలేవు. ఒక్క సారిగా రామ్మూర్తిలో వచ్చిన యీ మార్పుని గుర్తించటానికి బిడియ పడ్డాడు శేషయ్య.

'ఎక్కడైనా ఉద్యోగం వచ్చిందేమిటి ఖర్మ?'

'ఊఁ....'

'ఎక్కడో?'

'ఒక సేట్ దగ్గర. మీకు తెలియదులెండి....'

'మంచిది వెళ్ళిరా. ఎప్పుడైనా వస్తూఉండు'

'ఓ....'

అంతే. మళ్ళీ వెనక్కి తిరిగి చూడలేదు రామ్మూర్తి. గబ గబా రిక్షా కట్టించుకుని హిమాయత్‌నగర్ వెళ్లాడు. రిక్షా దిగి సరా సరి గదిలోకి వెళ్ళాడు. మొదటిగది డ్రాయింగ్‌రూం. లోపలిది బెడ్‌రూం. అంతకుముందే కొన్నకుర్చీ ఒకటి అక్కడ ఉంది. ఆ కుర్చీలో నడుంవాల్చాడు రామ్మూర్తి. కళ్ళుతెరిచి చూచేసరికి కాలింగ్ బెల్ మోగింది. గబగబా హాల్లోకివచ్చి తలుపుతీశాడు.

ఓ పైజమా, లాల్చీ వేసుకుని, తెల్లటి టోపీ పెట్టుకున్న మనిషి ఒకడు కనిపించాడు. రామ్మూర్తి ఆ వ్యక్తిని అంతకు ముందు చూడకపోయినా రామ్మూర్తిని మాత్రం ఆ వ్యక్తి తెలిసిన వాడికిమల్లే పలకరించాడు.

'నిమ్మల్ని పొద్దున్న కాదు. సాయంత్రం నాలుగుగంటలకు పికిందాద్రిబాదు స్టేషన్‌దగ్గర రావ్‌సాహెబ్ కలుస్తాడు. ఆయన ఇచ్చిన సూట్‌కేస్ పట్టుకొచ్చి సేట్జీకియ్యాలి. యింటిదగ్గర ఎనిమిదిగంటలకి." అనిచెప్పి వెళ్ళిపోయాడు ఆ అపరిచిత వ్యక్తి.

చెప్పిన ప్రకారం రామ్మూర్తి కొత్త ఇంట్లోకి రామ్మూర్తి మారాడో లేదోనని చూడటం కాబోలుననుకున్నాడు రామ్మూర్తి... రామ్మూర్తి సేట్‌చేసే ప్రతి చిన్నపనీ ఏమిటో తెలుసుకోటమేకాకుండా అది ఎందుకు చేస్తున్నాడో కూడా తెలుసుకోటానికి తంటాలుపడు తున్నాడు.

ఇంట్లోకి కావలసిన ఫర్నిచర్ కొనుక్కోమన్నాడు సేట్. అవును, వరసగా అన్నీ కొనుక్కోవాల్సిందే. రావటం మొదలెట్టిన తర్వాత అన్నీ యథావిధిగా వస్తాయికాబోలు ననుకున్నాడు రామ్మూర్తి.

ఇల్లు మారాడో లేదో చూడటానికి ఒకణ్ణి పంపిస్తే, ఫర్నిచర్ కొన్నాడో లేదో చూడటానికి తనే స్వయంగా రావచ్చు. ఫర్నిచర్ కొన్నాదో లేదోననిగాని, యిల్లు మారేడా లేదా ననిగాని కాదు అసలు సంగతి. అసలు రామ్మూర్తి చెప్పినపని చెప్పినట్టు సరియైన టైమ్‌కి చేస్తున్నాడా లేదా అన్నది ముఖ్యం సేట్‌కి.

రామ్మూర్తి వీధిలోకి వచ్చాడు. ఆ సాయంత్రం సావిత్రి కోసం గాలం వేశాడు రామ్మూర్తి. చేప గనకనా దొరకడానికి?

జంక్షన్‌లో కాశాడు. బస్సయితే రోజూ ఒకే 'రూట్'లో వెడుతుంది గనక స్టాప్ దగ్గిర కాస్తే దొరుకుతుంది. మనుషులు, మరీ గానుగ ఎద్దుల్లాగ 'రొటీన్'గా తిరిగే వాళ్లు తప్ప మరెవ్వరూ ప్రతిరోజూ ఒకే రూట్‌లో వెళ్లరు. ఒకవేళ వారంలో అన్ని రోజులూ అలవాటు ప్రకారం వెళ్ళినా, మనసుపడి ఏ ఆదివారం అయినా పక్కనున్న గల్లీలోంచి జనాన్ని తోసుకుని మరీ వెడతారు.

సావిత్రి కనబడకపోయేసరికి రామ్మూర్తికి ఏమీ తోచలేదు. తప్పకుండా కలుసుకోవాలి సావిత్రిని. ఎంతో మాట్లాడాలి. అవాళ టాక్సీలో కూచుని 'ఆ సందు చివర ఆ గేదె పడుకున్నచోటు మా యిల్లు' అన్నట్టుగా చూపించింది. ఎక్కేగడపా, దిగేగడపా రభస కావచ్చు. అయినా సావిత్రి అక్కడ ఏ గిరిజగా మారిందో? సావిత్రి వనజగా మారగాలేనిది గిరిజగానో. సత్యవతిగానో మారదని ఏమిటి గ్యారంటీ?

ఈ సారి సావిత్రి కనిపించినప్పుడు వెంటబడి అయినాసరే. యిల్లు చూడాలి. కాబూలీవాడు అప్పుయిచ్చిన తర్వాత. నువ్వు ఎక్కడ ఉద్యోగం చేస్తున్నదీ. ఎక్కడ ఉంటున్నదీ చూస్తాడు. నీ దగ్గర నుంచి గోళ్ళూడగొట్టి డబ్బు ఎలా డబ్బు వసూలుచెయ్యాలో వాడికి తెలుసు? ఉద్యోగం చెయ్యకేం చేస్తాడు? ఉద్యోగం చేసేవాడు, యింటికి రాకేం చేస్తాడు? బొడ్లో చెయ్యేసి మరీ వసూలు చేస్తాడు. అదీ యిల్లు తెలుసుకోవడంలో ఉన్న సుళువు.

అది నిజమే! ఇల్లు కనుక్కోవాలంటే. ముందర సావిత్రిని కలవాలి కదా! సావిత్రిని కలవాలంటే. యిల్లు దొరకాలికదా!

బాగుందివరస? ఏదిముందు? ఏదివెనక? సావిత్రి ముందు. సావిత్రియిల్లు వెనక, కాదు కాదు. సావిత్రి యిల్లుముందు సావిత్రి తర్వాత అదే కనిపిస్తుంది. ఇల్లు దొరుకుతే సూది, సూదిలోదారం కాదుగదా కనిపించకుండా పోవటానికి.

ఇంతకీ యీ కట్టుకథలన్నీ బాగానే ఉన్నాయిగాని సావిత్రి ఎక్కడ? 'అయినా సావిత్రిని కలుస్తేనేగాని నిద్రపోకూడదు యివాళ!' అనుకున్నాడు రామూర్తి డిటెక్టివ్‌లాగ.

అందుకే మొదటి ఆట సినిమాజనంతో బాటు యిద్దరు ఫ్రెండ్స్‌తో కలిసి వస్తూన్న సావిత్రిని చూసి హలో అని అందా మనిపించినా గొంతుదాకా వచ్చిన మాటలు ఆగిపోయాయి. ఉక్కిరి బిక్కిరి అయిన ఆనందం చేసిన రభస అది ఆక్షణంలో.

సావిత్రి రామ్మూర్తిని చూసింది. రామ్మూర్తి సై అంటే సై అన్నాడు.

రోడ్డు పక్కన కాళాదు తాజా ప్రేమికుడిలాగ. మరోసారి గంటకల్లా సావిత్రి వచ్చింది.

'అర్ధరాత్రివేళ రోడ్లుకాయటం ఎప్పటినుంచీ?'

'ఇవాళను.చే'

'బాగుంది డ్యూటీ'

'మీకోసం సాయంత్రం నుంచీ చూస్తున్నాను.'

'ఇవాళ సాయంత్రంనుంచేనా ?'

'ఆమాట నమ్మనంటారు ?'

రామ్మూర్తికి సావిత్రిని రాత్రివేళ రోడ్డుపక్కన నిలబెట్టి మాట్లాడించటం యిష్టంలేదు.

'చూడండి. మిమ్మల్ని రాత్రిపూట రోడ్డుపక్కన నిలబెట్టి మాట్లాడుతూన్నందుకు క్షమించండి. నేను హిమాయత్‌నగర్‌లో లాయర్ అంకయ్యగారి యింటిపై భాగంలోకి మారాను యివాళే. మీకు చెబుదామని. అంతే. మళ్ళీ కలుస్తాను లెండి. అని వెళ్ళిపోయాడు.

రామ్మూర్తి వెళ్ళిన వైపే చూస్తూ ఉండిపోయింది సావిత్రి. ఏమీ తోచలేదు సావిత్రికి. రామ్మూర్తిని గూర్చి ఏమనుకోవాలో ఎంత ఆలోచించినా ఏమీ తట్టలేదు.

రామ్మూర్తి మాత్రం సావిత్రిని గూర్చి ఏమీ అనుకోలేదు. కనిపించక పోయేసరికి ఒక్కసారి రొమాంటిక్‌గా గాలి విసురుకు గురి అయ్యాడు. కాని. సావిత్రి కలిసే సరికి మళ్ళా అచాంచల్యంలోంచి బయటపడ గలిగాడు.

తనకు ఒక వస్తువు కావలసి వచ్చినప్పుడు, ఆవస్తువుకు ఎంత

దూరంగా ఉన్నట్టు కనిపిస్తే అంత మంచిది అని రామ్మూర్తి ఉద్దేశం. ఏవ్యక్తితో తనకి పని ఉందో, ఆవ్యక్తి తనని వెతుక్కుంటూ వచ్చే లాగ చెయ్యగలగటమే రామ్మూర్తి సావిత్రిపైన వేస్తూన్న అస్త్రం.

అందుకే అంత తపననీ అంత తేలికగా అదుపులో పెట్టుకున్నాడు. ఒక్కసారిగా ఉద్రేకానికి గురి అయిపోయి కాబోయే పనుల్ని చెడగొట్టుకోటం రామ్మూర్తి చేసేపనికాదు. అందువల్లనే తను యిల్లు మారినట్టూ, దగ్గరలోకి వచ్చినట్టూ సూచన యిచ్చాడు. అంతే.

మర్నాడు సాయంత్రం నాలుగు గంటలకల్లా సికింద్రాబాద్ స్టేషనుకు వెళ్ళాడు రామ్మూర్తి. అక్కడ సిద్ధంగా ఉన్నాడు రావ్. ఇద్దరూ కలిసి ఎదురుగా ఉన్న ఇరానీ రెస్టారెంట్‌లోకి వెళ్ళారు. అక్కడ రావ్‌సాహబ్ ముక్కసరిగా, పొడి పొడిగా మాట్లాడాడు.

రావ్‌సాహబ్ తనను పురుగును చూసినటు చూశాడేమోనని పించింది. రామ్మూర్తికి రావ్‌సాహబ్ అర్థంకాలేదు. తను సేట్ దగ్గర కొత్తగా చేరాడుగనక యిదే విధంగా చూస్తారు కాబోలు ననుకున్నాడు. రామ్ రామ్ సేట్‌కి యీ రావ్‌సాహబ్ తనపైన యిష్టమొచ్చిన అభిప్రాయం చెప్పొచ్చును కూడాను. అడిగినా అడగక పోయినా.

రావ్‌సాహబ్ అన్నాడు—'ఇది సేట్‌కి సరిగా ఎనిమిది గంటలకి యిచ్చి, తొమ్మిదింటికల్లా చార్మినార్ దగ్గర నల్ల షేర్వాణీ నూడీ దార్ పైజమా వేసుకున్న పెద్దమనిషి. మొన్నరాత్రి చూసివుండాలి మీరు. మీకు మూడు పాకెట్లు యిస్తాడు. వాటిని తీసుకుని రేపొద్దున్నే కలాసీగూడా కిరసనాయిలు దుకాణాల్లో మొదటిదుకాణంలో ఇయ్యాలి. ఆ దుకాణంవాడు యిచ్చిన డబ్బు పట్టుకెళ్ళి సేటుకియ్యాలి పదిగంటలకి....' అని చెప్పి నావైపు అదోలా చూశాడు.

తల ఊపాడు రామ్మూర్తి.

'ఎక్కడ ఏ చిన్నపొరపాటు వచ్చినా....'

'రాదు....డోంట్ యు వర్రీ'

'అఫ్‌కోర్స్' అని వెళ్ళిపోయాడు రావ్‌సాహబ్.

రావ్‌సాహబ్ చెప్పిన ప్రతిమాటా అతిజాగ్రత్తగా విన్నాడు రామ్మూర్తి. ఈ పెట్టె వాళ్ళకి యియ్యటం, ఆ డబ్బు సేట్‌కి

యిచ్చేయటం, అంతా పైకి అయోమయంగా కనిపిస్తున్నా, త్వర లోనే దీనిలోని లోతుపాతులు తెలుసుకోగలుగుతాననే నమ్మకముంది రామ్మూర్తిలో.

తను చేస్తున్న ప్రతిపనీ తనచేత చేయిస్తున్న ప్రతిపని వెనక ఉన్న తతంగం, యీ వ్యాపారంలోని రహస్యాలు. ఇవేవీ తీరి కగా కూచుని ఏ పుస్తకంలోంచో చదివి నేర్చుకోవలసినవి కావుగనక రామ్మూర్తి ఏమాత్రం గాబరాపడలేదు. మొదట్నుంచీ పుస్తకాలు అట్టే చదివినవాడు కాడుగనక బతికిపోయాడు నిజానికి.

పుస్తకాలు చదివేవాళ్లకీ, పుస్తకాలు రాసేవాళ్ళకీ ఒకే జబ్బు ఉంటుంది. అదేమిటంటారా? పుస్తకాల్లో రాసిన ప్రతిమాట వేద వాక్కని అనుకోవటం.

తప్పులూ, అబద్ధాలూ అచ్చువెయ్యటానికి వేరే ప్రత్యేకమైన యంత్రాలు అక్కర్లేదని వాళ్లకితెలియదు. పాపం. ఇది నిజమా, అబద్ధమా అని ఆలోచించేది మనిషేగాని, యంత్రం కాదు.

రామ్మూర్తి బస్సెక్కి సుల్తాన్ బజార్లోకి వచ్చాడు. హోటల్లో కాఫీతాగి ఓగోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ వెలిగించి జంక్షన్‌లోకి వచ్చి నిల్చున్నాడు 'ఎవడొస్తాడో రండోస్!' అన్నట్టు. ట్రాఫిక్ ఆపు చెయ్యలేదు రామ్మూర్తి వస్తున్నాడని. చుట్టూరా జనం గుమిగూడ లేదు. చీమల్లా ప్రజలు తండోపతండాలుగావచ్చి, రోడ్లవెంట జండాలు పుచ్చుకుని నిల్చోలేదు. రామ్మూర్తి రోడ్డుమీద నడుస్తూంటే స్త్రీలు ప్రక్క మేడల్లోంచి గులాబీరేకులు చల్లలేదు. పన్నీరు అంతకన్నా ఒలకబొయ్యలేదు.

అంతా మామూలుగానే ఉంది. పోలీస్‌కాన్‌స్టేబుల్ మాత్రం కాస్త చికాకుపడ్డాడు. వాణ్ణిగౌరవిద్దామనే సదుద్దేశంతో పక్కకు తప్పుకున్నాడు రామ్మూర్తి.

తను కనీసం పోలీస్‌కాన్‌స్టేబుల్ అయినా రోడ్డుమీద జనాన్ని యిష్టంవచ్చినట్లు నడిపించవచ్చును అనుకునేవాడు ఒకప్పుడు. బస్సులూ, కార్లూ అన్నీ చెయ్యిచూపిస్తే ఆగిపోవల్సిందే. రంగు రంగుల యూనిఫారంలో ఉన్న పోలీస్ కాన్‌స్టేబుల్ చాలా గమ్మత్తుగా

కనిపించేవాడు రామ్మూర్తికి కుర్రాడుగా ఉన్నప్పుడు. 'ఎప్పటికైనా నేను అంత పెద్దవాడినై, రంగురంగుల బట్టలూ, తలపాగా చుట్టుకుని నోట్లో విజిల్ పెట్టుకుని, దారినపోయే ప్రతి కారునీ ఆపెయ్యగలనా ?' అనుకునేవాడు. ఎందుకో ఒక్కసారి జ్ఞాపకంవచ్చి నవ్వొచ్చింది ఆ క్షణంలో.

ఇవాళ యీ నడిరోడ్డులో నిలబడి ప్రజలు తననిచూసి మురిసి పోలేదని ఒక్కక్షణం అనిపించడానికి కారణం ఆ పూర్వస్మృతి మరొక్కసారి కలవరపెట్టడమే. నిజంగా పోలీస్‌కాన్‌స్టేబుల్ అయితే ఎంతగమత్తుగా ఉంటుందో ? ఒక్కనవ్వు నవ్వి మనలోకంలోకి వచ్చి పడ్డాడు రామ్మూర్తి.

ఎన్ని టక్కుటమార విద్యలు నేర్చుకున్నా తనని తలదన్నిన వాళ్లు ఎప్పుడూ ఉంటారని తెలుసు రామ్మూర్తికి. తను రాను రాను మారుతున్నాడనీ, యీ మార్పు తనకి తెలియకుండా కొంత, తెలిసి కొంతా వస్తోందనీ. తెలుసుకుంటున్నాడు రామ్మూర్తి.

రాబోయే జీవితం ఎలా ఉంటుందో అనే అనుమానం ఎప్పుడూ రాలేదు రామూర్తికి. ఎందువల్లనంటే, భావి జీవితం ఎలా ఉండా లన్నది నిశ్చయించుకోవటం అన్న ప్రశ్నలేదు. గాలికి కొట్టుకుపోయే ఆకుని పట్టుకుని నిలవేసి, నీ అడ్రసు ఏమిటీ అంటే సమాధానం ఏం చెబుతుంది గనక ?

గబ గబా యింటికి వచ్చాడు. ఏమనిపించిందో ఏమో ఒక్కసారి పెట్టె తెరిచి చూశాడు. ఒక్కసారి తనకళ్లని తనే నమ్మలేక పోయాడు. అన్నీ వందరూపాయల నోట్ల కట్టలు. ఒక్కసారి గుండె ఆగిపోయినంత పని అయింది. తన తెరచిన నోరు మూసు కోవటానికి కొంతసేపు పట్టింది. తను యింతగా ఆశ్చర్యపడటానికి ఏముంది ? ఎందుకు ? అన్ని నోట్లు ఒక్కసారి తనచేతులో ఉండి కూడా తనవి కావని తెలుసుకునా ? బ్యాంక్‌లో క్యాషియర్ లెక్క పెట్టిన డబ్బంతా చప్పినట్లు ఎలా అక్కడపెట్టేసి కదలాలో, తన స్థితి గూడా అదే విధంగా ఉందని తెలుసుకుని కొంచెం దెబ్బతిన్నాడు.

మళ్లా యీ లోకంలోకి వచ్చి మామూలు మనిషి కావడానికి కొంతసేపు పట్టింది రామ్మూర్తికి.

సేట్‌కి పెట్టెయియ్యటానికి బయలుదేరాడు. ఇయ్యకపోతే ఎంత బాగుండును, నిజానికి? కాని మళ్ళా ఆలోచించిచూస్తే యిస్తేనే మంచిదనిపించింది రామ్మూర్తికి. ఈ దశలో ఏ మాత్రం తెలివితేటలు చూపించినా తనకు పుట్టగతులు లేకుండా పోతాయి. పుట్టగతులు లేకపోతేనేం? ఈ డబ్బుపుచ్చుకుని పత్తాలేకుండాపోతేనో? అవును. మళ్ళీతుపాకి గుండుకు అందకుండా పోతేసరి! ఊరు వదలి పెట్టటానికిగాని, పేరు మార్చుకోవటానికిగాని తను ఏమీ సంకోచించ నక్కర్లేదు. ఈ ఊరు తనది గనకనా? ఈపేరులో ఏముందిగనక? ఆమాటకొస్తే ఏఊరు తనది? తనకి ఉన్న పేరేమిటి గనక పోవటా నికి? అందుకని ఊరు విడచిపెట్టి, పేరు మార్చేసుకుని, హైర్ స్టయిల్ మార్చి, ఓనెల గడ్డం చేయించుకోవటం మానేసి. ఓ చలవ జోడు గనక తగిలిస్తే, చేసుకున్న పెళ్ళాంకూడా గుర్తుపట్టక పోవ టమే కాకుండా, కర్రపుచ్చుకుని తన్ని తగిలేస్తుంది. ఐడియా బురా నహీ' అనుకున్నాడు.

వచ్చిన ఓరిజినల్ ఐడియాని అంతకన్న కాస్తమంచి ఐడియా కోసం వదిలేసి, బుద్ధిగా సేట్ బంగళాకి వెళ్ళాడు.

'నువ్వొస్తావని అనుకోలేదే' అన్నట్లు చూశాడు సేట్. మళ్లా వెంటనే తనలో తనే నవ్వుకున్నాడు సన్నగా. గడియారం చూసు కుని సరిగ్గా టైంకి వచ్చారే!' అని చేతులోపెట్టి తీసుకున్నాడు.

పెట్టె రామ్మూర్తి ముందరే విప్పదీసి సన్నగా నవ్వి పెట్టె మూసేశాడు.

'మీరు తొమ్మిది గంటలకు ఎక్కడకు వెళ్ళి, ఎవర్ని కలుసు కోవాలో తెలుసుగా?'

'ఊఁ....'

'ఇంకమీరు వెళ్ళవచ్చు' రేపొద్దున్న మీరు ఎక్కడఉన్నా సరే నాకు ఫోన్ చెయ్యండి' అని చెప్పితన పక్కన ఉన్న కాగితాలు ముందర వేసుకున్నాడు.

రామ్మూర్తి బయటకువస్తూ ఆలోచనలోపడ్డాడు. సేట్ తనని వింతగా చూడటమూ. తర్వాత తనముందే పెట్టె విప్పదీసి ఆదోలాగ నవ్వటమూ శాస్త్ర చిరాకు పెట్టాయి రామ్మూర్తిని. మళ్ళా అనవసరంగా బుర్ర పాడుచేసుకోవటం ఎందుకని గబ గబా ముందుకు నడిచి వెళ్ళాడు.

ఓ కప్పు టీ తాగి, యిటూ ఆటూ తిరిగి తొమ్మిది అవుతూంటే చార్‌మినార్ దగ్గరకు వచ్చాడు. అక్కడికి సరిగ్గా అప్పుడే వచ్చాడు నల్లషేర్వాణీ. చూడీదార్. పైజమావేసుకున్న పెద్దమనిషి. రామ్మూర్తిని గుర్తు పట్టాడు. ఇద్దరూ ఒకళ్ళ కొకళ్ళు 'సలాం' చేసుకున్నారు.

దగ్గరున్న హోటల్‌లో టీ తాగి విడిపోయే ముందు నాకు మూడు ప్యాకెట్లు యిచ్చి 'ఇవి ఎక్కడ యివ్వాలో తెలుసును కదా?' అన్నాడు ఉర్దూలో

'సికింద్రాబాద్‌లో....'

రామ్మూర్తిని మాట పూర్తి చెయ్యనియ్యకుండానే....'టీక్‌హై. సేట్ కో ఫోన్ కర్‌దేనా.' అన్నాడు.

'జరూర్.'

గబుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు షేర్వాణీ వేసుకున్న వ్యక్తి.

చాలా బరువుగా ఉన్నాయి ప్యాకెట్లు. అందులో ఏముందో విప్పదీసి చూద్దామనిపించింది రామ్మూర్తికి. కాని ఎందుకో మళ్ళా ఆ కోర్కెను చంపుకుని హిమాయత్ నగర్‌కి బయలుదేరాడు దగ్గరున్న బస్సెక్కి వెడదామని.

సందు తిరక్కుండానే పోలీసువాడు ఎదురొస్తున్నాడు.

రామ్మూర్తి చేతులో ప్యాకెట్లు ఉన్నాయి. పోలీసువాడు. 'వెధవముఖం. వాడూను. కేడీలాగ.' అనుకుని ఒక్కసారి తన చేతిలో ప్యాకెట్లవైపు చూసుకున్నాడు.

'ఇందులో ఏ నల్లమందో గంజాయో లేదుకదా?....ఉంటే అవును ఉంటే....ఉంటేయేం? పోలీసువాడు ఎదురుగా....ఎదురుగా పోలీసు....వాడు పోలీసు .... పోలీసువాడు వాడు .... నిజంగా వాడు

గనక పోలీసువాడు....ఏరాఅబ్బీ. ఒరేయ్,చూడు పోలీసు....నాపోలీసూ ఓ నా పోలీసూ....చూశావూ, అసలుసంగతి ఏమిటంటే....అసలు సంగతి అసలు ఏమిటం....ఇందులోది నల్లమందుకాదు - గంజాయి కూడా కాదు .... కా కా కా రప్పూస ....నీ నీ .... నీకు తెలియని దేముంది .... మా భావమరది పుట్టినరోజుకు పట్టుకె....

ఛీ ః యిందులోది ఏమైతేనేం ? నాదికాదు ఫలానా ఫలానా సేట్ రామ్ రామ్ సేట్ ఆఫ్ చార్‌మీనార్ హైద్రాబాద్ డక్కన్‌గారిది. నాకు దీనితో .... అంటే, సదరు పాకెట్లతో యే రకమయిన అనగా ఏ మాత్రమూ సంబంధములేదు. లేదుగనక లేదు. నాచేతిలోవి యీ ప్యాకెట్లు కాదు కాదు నాచేత కొనిపోబడుచున్న యీ ప్యాకెట్లలో ఏమున్నదో నేనెరుగను. ఇది నిక్కము .... నన్ను నమ్మడు. నాకు జందెములేదు. కాని నేను బ్రాహ్మణుడను.... అబద్ధమాడుటయందు ఏమాత్రము నమ్మకములేనివాడను. మీరు ఓ పోలీసుగారూ దీనిని నా మాటగా నమ్మడు....సత్యమును ధర్మమును మీరు తప్పక నమ్మవలయును .... అట్లు నమ్ముట మీధర్మము .... మీరట్లు నమ్మవలెనని నమ్ముట నాధర్మము .... సత్యము అహింస పరమ ధర్మములు గాన అట్లు పెద్దలు నుడివిరి గాన .... అట్లుధర్మశాస్త్రములు ఘోషించినవి గాన....ఆ పరంపరలో పుట్టిన బ్రాహ్మణుడను....నన్ను నమ్మి నా ప్యాకెట్లను ముఖ్యముగా నన్నూ....నన్నూ నా ప్యాకెట్లనూ ...నా ప్యాకెట్లతో ఉన్న నన్నూ, నాతోవున్న నా ప్యాకెట్లనూ సమూలముగా విడువుడు. మీ ఋణము నేనెన్నటికి ఉంచుకొనజాలను. మీ పోలీసుస్టేషనుకుగాని లేక యింటికిగాని లేక మరే ప్రదేశము నిర్ణయించెదరో ఆ ప్రదేశమునకు వచ్చి మీకుగాని, మీరు జెప్పినవారికి గాని, మీ వారసులకుగాని, మీరు చెల్లించమని చెప్పిన మొత్తము చెల్లించి. వారిచ్చిన రసీదు పొందగలవాడను.

ఇట్లు రామ్మూర్తి వ్రాలు.

కాని ఆ పోలీసు పెద్దపులిషి ఓటి లాటీ ఊపుకుంటూ నా వైపైనా చూడకుండా వెళ్ళిపోయాడు. వాడికి ఎప్పుడు ఆ మాసిపోయి మడ్డికట్టిన నిక్కరూ, బెల్టూ, దవాలూ, కాళ్లకు కట్టిన పట్టీలూవిప్పి

చిలక్కొయ్యకి తగిలిద్దామా అని ఉంది. గబ గబా యింటికి వెళ్ళి పోతూ తను యింతగా ఎందుకు గాబరాపడ్డాడో అర్ధంకాలేదు. తన నీడనుచూసి తనే గాబరా పడ్డట్లయింది రామ్మూర్తికి.

రాత్రంతా ఎంతో గమ్మత్తుగా గడిచింది. ఏవేవో కలలు. ఎన్నెన్నో ఆలోచనలు. ఆ సేట్ చేసే వ్యాపారాలు చాలా గమ్మత్తుగా ఉన్నయి. ఏదీ అంత తేలికగా అంతు చిక్కటంలేదు.

'అంత తేలికగా వ్యాపార రహస్యాలు తెలిసిపోతే, వాట్లని మరో పేరుతో పిలవవలసి వస్తుంది'. అనుకుని నిద్రపోయాడు.

ప్రొద్దున్నేలేచి, ఉషారుగా తయారై, బస్సెక్కి సికింద్రాబాదు వెళ్ళాడు. స్టేషన్‌లో దిగి, రిక్షా ఎక్కి కలాసిగూడా వెళ్ళాడు.

అప్పటికే తొమ్మిదిగంటలైంది. మొదటి కిరసనాయిలు దుకాణం దగ్గరకి వెళ్ళగానే అందులోంచి చింతనిప్పుల్లాంటి కళ్ళతో ఉన్న ఓ నరసయ్య బయటకువచ్చి రామ్మూర్తి చేతిలోని ప్యాకెట్లు అందుకున్నాడు. డబ్బు ఓ కవర్లో పెట్టి యిచ్చాడు రామ్మూర్తికి.

'ఎన్ని రూపాయలు?'

'సేట్‌కు తెలుసు.'

'మంచిది.'

అంతకన్నా వేరే అనటానికి ఏమీ కనిపించలేదు రామ్మూర్తికి. ఈ వ్యాపారంలో ఒకళ్ళమీద మరొకళ్ళకి ఉన్న నమ్మకం అట్లాంటిది అనుకున్నాడు. దగ్గరఉన్న దుకాణంలోకి వెళ్ళి ఫోన్ చేశాడు సేట్‌కి.

'ఇప్పుడు తొమ్మిదింబావు అయింది.'

'అవును దుకాణం దగ్గర ఆలస్యం అయింది.'

'ఓహో....'

'ఇప్పుడు మీదగ్గరకు వస్తున్నాను....'

'అక్కర్లేదు. మిమల్ని మళ్ళా రావ్‌సాహెబ్ సరోజనీరోడ్ తాజ్ హోటల్లో కలుసారు పదిగంటలకి. మీరు ఆయనకి ఆ డబ్బు యిచ్చేసి, మీ సొంతపనులు చూసుకోండి. సాయంత్రం ఆరు గంటలకల్లా నాకు ఫోన్ చెయ్యండి.'

'మంచిది.'

రిసీవర్ క్రాడిల్‌లో పెట్టేసి టెలిఫోన్ కాల్‌కి డబ్బు దుకాణంలో యిచ్చేసి, బయటకు వచ్చాడా రామ్మూర్తి.

బుర్రకొట్టుకున్నా అర్థంకావటంలేదు రామ్మూర్తికి రామ్ రామ్ సేట్ వ్యాపారం ఏమిటో; ఇటునుండి అటు మార్చటమూ అటు నుంచి యిటు మార్చటమూ, ఏమిటి మరీ సినిమాకథలాగ, కట్టు కథలాగ కనిపిస్తోంది, నమ్మతగ్గదిగా లేదు చూస్తే. కాని....

అనుకున్నట్లుగా రావ్ సరోజినీరోడ్డు తాజ్‌హోటల్లో కానుకుని ఉన్నాడు. 'వీళ్ల మనుషులా, మిషన్లా' అనుకునేలాగ.

రావ్ డబ్బుతీసుకున్నాడు.

'లెక్క పెట్టారా. ఎంతుందో?'

'మీకు యీ వ్యవహారాలు కొత్తగదూ? అందువలన మీకు తెలియదు. డబ్బు లెక్క పెట్టుకోవటం అంటూ లేదు యీవ్యాపారంలో.'

'మరి తక్కువుంటేనో?'

'ఉండదు. అంతే మరో ప్రశ్న వెయ్యకండి?'

రామ్మూర్తి సమాధానంకోసం మరో ప్రశ్న కోసం ఆగకుండా రావ్ సాహెబ్ వెళ్ళిపోయాడు. డబ్బు బ్రీఫ్‌కేస్‌లో పెట్టుకుని, బిల్లు చెల్లించేసి. తన కోసం ఆర్డరిచ్చిన కాఫీ మెల్లిగా తాగుతూ కూర్చున్నాడు రామ్మూర్తి. మరేమీ ఆలోచించకుండా ఓగోల్డ్‌ఫ్లాగ్ సిగరెట్ వెలిగించాడు. కాని సిగరెట్ పొగతో ఆలోచనల దుమారం రేగింది, ఆ దుమారంలో తనుకొట్టుకు పోతానేమోననే అనుమానం.'

ప్రవాహంలో కొట్టుకుపోయే పూచిక పుల్లకి అస్తిత్వం ఏం ఉంటుంది? ఒక్కసారి ఆగి. వెనక్కి తిరిగి చూడటానికి జీవితం అవకాశం యిస్తుందా?

తనకు జీవితం యిచ్చిన అవకాశాన్ని జారవిడుచుకునే ప్రశ్నే లేదు. కుక్కలాగ, బక్క చిక్కిన కుక్కలాగ. విజయవాడమురికి కాలవల వెంట తిరిగి నప్పుడు 'ఛీ ఛీ' అనిపించుకున్నాడు. మద్రాసు మెరినాబీచ్‌లో ఎవడోనచేతన్‌ది జేబు కొట్టేసి నప్పుడు, అందులో పావలాయే ఉన్నప్పుడు. ఆ పర్స్ పోయిందని గాబరా పడిపోయి వెదకుతూన్న ఆగుమాస్తా ముఖాన్ని యిట్టే గుర్తుపట్టేసి పర్స్‌లో

పావలా చిత్తు కాగితాలూ, చిరిగిన ఫొటోతో సహా యిచ్చి నప్పుడు, 'రొంబ థాంక్స్' అని అంటాడనుకుంటే, ఆ గుమాస్తా హతకుడు 'యూస్కౌండ్రల్' అని చీదరించుకున్నప్పుడు, నిజంగా నిజాయితీ పైన నమ్మకం తుడిచిపెట్టుకు పోయింది రామ్మూర్తికి.

ఈ కాట్ల కుక్కల సమాజంలో బతకాలంటే, తను గూడా ఓ కాట్ల కుక్క కావడం కన్న ఏమీ చెయ్య గలడు గనక? ఒక్కసారిగా తనూ, తనస్థితీ, మారుతూన్న జీవితం గుర్తుకు వచ్చాయి. సావిత్రి ఒక్కసారి స్మృతిపథంలో తిరిగింది. 'అవును సావిత్రిని కలుసుకోవాలి', అనుకున్నాడు ఎంతోయిదిగా. ఎందుకో నవ్వొచ్చింది.

సావిత్రినిగూర్చి ఆలోచించేసరికి ఏదో తియ్యగా అనిపించింది. మళ్ళా ఒక్కసారి తనలోతాను ఏదో అనుకున్నాడు. ప్రేమలో పడటం లేదుగదా? తనకే అనుమానం వచ్చింది. తిన్నగా హిమాయత్‌నగర్ యింటికి వచ్చేశాడు.

ఒక్కసారి కళ్ళుమూసుకుని చూస్తే మరోలోకంలోకి వెళ్ళి వచ్చినట్టుంది. సావిత్రి కాలేజీచదువు యీ సంవత్సరంతో అయి పోతుంది. ఇంక కావలసిందేముంది!

రాబోయే రోజుల్లో జీవితపు దారిలో ముళ్ళుండవనీ, అంతా సిమెంట్ రోడ్డనీ అనుకోలేదుగాని, ఆదార్లోవచ్చే అడ్డంకుల్ని తప్పించెయ్యటానికి ఏమైనా చెయ్యటానికి సిద్ధంగా ఉండాలనిపించింది.

'అంటే తెలిసిందికదూ ఆత్మారామ్' అన్నాడు సామి.

'తెలిసింది....అంటే తెలియదు' అన్నాను. ఏమి అన్నానో ఏమాత్రం తెలియకుండా.

'ఇదే పరమరహస్యం. తెలిసీ తెలియకపోవటం చాలా గొప్పస్థితి....'

'భర్తృహరిపద్యం....అంటే తెలుగులో....'

'అవును, నీకు కంఠస్థంగా వచ్చుంటావు, అంతేనా? చదివేస్తావా? పోనీ చదివెయ్యి....అక్కరకురాని చుట్టము స్టయిల్‌లో. అదికాదు అంబరీషా, సంగతేమిటంటే భర్తృహరి యింకా

చాలా చెప్పారు. ఆ పద్యాల్నీ, లేక ఒరిజినల్ శ్లోకాల్నీ బట్టీ పట్టేసి మొట్టమొదట దొరికిన సంసారిమీద దులిపెయ్యటంకాదు. ఇంకొకళ్లు చెప్పినది ఎంత అందంగా చెప్పినా చెప్పినది చెప్పినట్లు మింగెయ్యకూడదు. బతుక్కి- మనబతుక్కి- అన్వయించుకుని అర్థం చేసుకోవాలి' మన బతుక్కి పట్టించుకోవాలి. అవునా?

'అవును'

'అవును అంటే కుదరదు. నేను ఏమిటన్నానంటే.... తెలిసీ తెలియకపోవటం అంటే నువ్వు అనుకుంటూన్న అమాయిక స్థితి కాదు నిజానికి.

'కొంచెం తెలియటము' మరికొంచెం తెలియకపోవటమూను.

'ఇప్పుడు నీకు కొంచెం తెలుస్తుంది. ప్రతివిషయాన్ని గూర్చి ప్రతివాడికీఅంతే! ఒప్పుకోరుగాని నిజానికిఎవ్వరికీ పూర్తిగాతెలియదు. ఇది ఎవ్వరికి పూర్తి గా తెలియవలసినంతగా తెలియదు. తెలిసీ తెలియక పోవటం అంటే కొంత తెలుసుకుని ఆ తెలుసుకున్న విషయాన్ని అనుభవంలోకి తెలుసుకుని తర్వాత మరికొన్ని విషయాల్ని తెలుసు కోవటం. తెలుసుకోటానికి ప్రయత్నించటం.

'చాలా కొత్తగా వుంది గురూజీ!'

'ఈ తెలుసుకోవడానికీ, తెలియకపోవడానికీ ఓ అంతులేదు. అంతువుందంటే నువ్వు బురదలో కాలువేసి దాన్ని బుర్రకు పాము కుని పన్నీటివాసన అని మభ్యపెట్టుకుంటూన్నా వన్నమాట.'

'అబ్బ! మరీ మరీ చిత్రంగా ఉంది గురూజీ!'

'మాటలు అర్థాల్ని కోల్పోతాయి. కొత్త అర్థాల్ని సంత రించుకుంటాయి. పాత సామెతల్ని వల్లెవెయ్యటం. కుక్కిమలక మంచంలో పడుకోవటంలాగ ఉంటుంది. అవునా రాయుడూ? ఇదేవిధంగా పాతసామెతల్ని వల్లెవేస్తూ, పద్యాలు బట్టీపట్టి నప్పజెపు తూంటే, ఏ స్కూల్లోనో పాఠాలుచెప్పే మరో మామూలు తెలుగు మాష్టారై ఊరుకునేవాడు రామ్మూర్తి.

'ప్రతి విషయాన్నీ అనుభవంతో రంగరించటం వల్ల నే యే పుస్తకం చదవక్కర్లేకుండానే బాగుపడ్డాడు. జీవితమే ఓ పెద్దపుస్తకం

రామ్మూర్తికి. ప్రతి అనుభవమూ ఓ అధ్యాయం. ఇది తెలుసు కోవటం మొదలెట్టిన మరుక్షణం ముందుకు ఒక అడుగు పెట్టటం మొదలెట్టాడు.

ఒక్కసారి ఎంతో తెలిసిపోయినట్టు అనిపించింది. కాని అది కేవలం నా ఉద్దేశం అని తెలుసుకోగానే నాలోనాకే నవ్వొచ్చింది.

'నీలో నువ్వు నవ్వుకుని, నువ్వూ ఓ తత్వవేత్తనని అనుకో వచ్చు' అని సులోచనాలు మరోసారి సర్దుకున్నాడు సామి.

సామిని గూర్చి ఆలోచించక తప్పలేదు నాకు. సామి చాలా మామూలుగా కనిపిస్తాడు. కాని మామూలు మనిషికాదు. ప్రతివిషయాన్ని గూర్చి ఎంతో బాగా తెలుసుకుని అనుభవం లోకి తెచ్చుకున్నవాడని మాట్లాడే ప్రతిమాటనుబట్టీ తెలుస్తూనేవుంది. అయినా సామి స్కూలుకీ కాలేజీకీ పోయి చదువుకోలేదు. పుస్త కాల్లో మాటలు వల్లెవెయ్యటానికి పుస్తకాల జోలికేపోడు సామి.

ఇంక రామ్మూర్తి ఎంతటివాడో ఊహకు కూడా అందటం లేదు ఇంతవరకూ!

* * * *

## 10. నిచ్చెనలో మొదటి మెట్టు - ఆలోచనలు కట్టిపెట్టు

చెబుతూన్నది కథకాదని తెలుసు. సంఘటనలు కాలక్షేపం బటా నీలు కావనీ తెలుసు. కొందరు మనుషులు చుట్టూరా పరిసరాలని బట్టి మారుతారనీ, మరికొందరు పరిసరాల్నే మారుస్తారనీ రామ్మూర్తికి ఎవ్వరూ చెప్పలేదు. చెప్పరుకూడాను.

'రామ్మూర్తి భవిష్యత్తు రామ్మూర్తి చేతులోఉంది. అంటే రామ్ రామ్ సేట్ చేతులో ఉంది, అంటే రామ్‌రామ్‌సేట్ రామ్మూర్తి చేతుల్లో ఉన్నాడన్నమాట. ఎలాఉంది యీక్వేషన్ కృష్ణమూర్తీ ?'

'కొంచెం కష్టంగాఉంది. గురూజీ. అర్థంకావటం క్లిష్టంగా ఉంది.'

'ఉంటుంది. అంతతేలికగా ఉంటే, నేను నేర్చుకోవలసిన అవసరమూ ఉండదు, నీకు చెప్పవలసిన అవసరం అంతకన్నా ఉండదు .... రామ్మూర్తికూడా యిది ఎక్కడా నేర్చుకున్నదికాదు. అందుకే దానికి అంతవిలువ ఉంది.

'రామ్మూర్తి ముక్కుసూటి మనిషికాదు. అదితెలుసా? నేనూ కాను. కాకూడదు. 'ఒప్పుకున్నాను సార్....'

'ముక్కుకు సూటిగా వెడితే తలకి బొప్పికట్టటమో. సరాసరి వెళ్ళి తిన్నగా గోతిలో పడటమో జరుగుతుంది. లేవదీయటంమాట అలాఉంచి, మరోనాలుగు రాళ్ళువేసో, యింతమట్టి పోసేసో పూడ్చేసే అవకాశం ఉంది. కనక, ముక్కుసూటిగా వెళ్ళటం అన్నది మర్చిపోవాలి....' 'అవును మర్చిపోవాలి.'

'అంటే సరిపోదు, రామ్మూర్తికి వ్యాపారంలోని రహస్యాలు చెప్పడానికి ఎవడూ పనిగట్టుక్కూచోలేదు. అయినా అలా కూచో బెట్టి చెబితే తెలిసిపోయేవి అంతకన్నా కావు అవి.

'రామ్ రామ్ సేట్ దగ్గరకు ప్రొద్దున్నే వెళ్ళాడు రామ్మూర్తి ఓ రోజు మామూలుగా, అవాళ రామ్మూర్తి ఎందుకో కొంచెం మంద కొడిగా ఉన్నాడు. సేట్‌కి రామ్మూర్తిని చూడగానే ఏదో అనిపించింది.

'ఇవాళ మీరు యింటికి వెళ్ళి రెస్ట్ తీసుకోండి. సాయంత్రం ఆరు గంటలకి ఫోన్ చెయ్యండి.... మర్చిపోయా మీకు ఫోన్‌వస్తుంది యీ వారంలో.....'

'నేను కులాసాగానే ఉన్నాను. 'రెస్ట్' తీసుకోవలసిన అవసరం లేదు నాకు.'

ఉట్టి కులాసా లాభంలేదు. చాలదు. ఉషారుగా ఉండాలి. ఉషారుగా ఉండటం కన్న కూడా చలాకీగా కనిపించాలి. డబ్బు ఎంత కావాలో తీసుకోండి.

'మీ రిచ్చిన డబ్బు యింకా ఖర్చు కాలేదు.'

'అంటే? ఎందుకు ఖర్చు కాలేదు?'

రామ్మూర్తికి నవ్వాలో, నవ్వకూడదో తెలియలేదు. నిజానికి ఏం చేస్తే ఏమి అనుకుంటాడో అనిపించింది, సమాధానం చెప్పడానికి ఏమీ దొరకలేదు. అంటే రామ్మూర్తికి ఖర్చు పెట్టటంచేత కాదనా? అంత డబ్బు అక్కర్లేక పోవటం అంటూ ఉండదు కదా?

'మీరు రావ్‌సాహబ్‌తో కలిపి యిక్కడకురండి సాయంత్రం.'

'ఊఁ.'

రామ్మూర్తి వెళ్ళిపోబోతూంటే, మళ్ళా పిలిచి, 'మీరుయిక్కడకు రానక్కర్లేదు. రావ్‌సాహబ్‌ని సాయంత్రం ఆరు గంటలకి కింగ్స్‌వేలో ఆనందభవన్ దగ్గర కలవండి, తర్వాత ప్రోగ్రామ్ ఆయనే చెబుతారు. ఇంక మీరు వెళ్ళవచ్చు....'

రామ్మూర్తి ఏదో అనబోయి. మళ్ళీ మనసుమార్చుకుని బయటకు వచ్చేశాడు. 'సావిత్రిని కలుసుకోవాలి,' అనుకున్నాడు తాజా ప్రేమికుడి లాగ.

మధ్యాహ్నం కాలేజి అయిపోగానే సావిత్రి రూమ్‌కివచ్చేస్తుంది, అప్పుడు కలుసుకుని మాట్లాడాలి. సావిత్రినికలుస్తేనేగాని వ్యవహారం కుదుట పడదు. ఈ డల్‌నెస్ పోదు. హోటల్లో భోజనంచేసి యింటికి వచ్చి పడుకున్నాడు.

రెండు గంటలకిలేచి, కాఫీతాగి మూడు గంటలకల్లా కాపలా వేశాడు సావిత్రి కోసం. నాలుగు గంటలదాకా రాలేదు సావిత్రి. సందులో మలుపుదగ్గర కనిపించింది సావిత్రి. కాని, వెంట ముగ్గురు చెలికత్తెల్లాంటి వాళ్ళు ఉన్నారు. 'ఆ ముగ్గుర్నీ ఎవళ్ళో ఎగనెత్తుకు పోగూడదా?' 'పోనీ ఉన్నవళంగా మర్చిపోయిన' 'మేకప్‌కిట్' తెచ్చుకోవటానికి పరుగెత్తుకు పోగూడదూ?' 'పోని వాళ్ళని....' యింకో కొంటి ఆలోచనవచ్చి మళ్ళా ఆ ఆలోచనని దూరంగాతోసేశాడు.

సావిత్రి రామ్మూర్తిని చూసింది. రామ్మూర్తి తనకోసమే విచ్చున్నాడని తెలుసు సావిత్రికి. రామ్మూర్తి మరో సిగరెట్టుపెట్టి కాల్చేశాడు, సావిత్రి వచ్చే లోపల.

సావిత్రి రాగానే 'మీకోసం ఎంతసేపట్నుంచీ కాసుకుని ఉన్నానో తెలుసా?' అన్నాడు రామ్మూర్తి.

'మిమ్మల్ని కలుస్తానని చెప్పలేదే నేను?'

'లేదు. నేనే మిమ్మల్ని కలుసుకుని మాట్లాడదామని కాసు క్కూర్చున్నాను.'

సన్నగా నవ్వింది సావిత్రి.

ఇద్దరూ కలిసి రామ్మూర్తి ఇంటికి వెళ్ళారు. ఇల్లంతా ఒకసారి యిటూ అటూచూసి, ఇంట్లో యింకా ఎవరైనా ఉన్నారా? అంది సావిత్రి.

'మనమే....'

'..........'

'ఒక్కనిమిషం ఉండండి. హీటర్‌మీద టీకి నీళ్ళుపెట్టివస్తాను.'

'సంసారం పెట్టేసినట్టున్నారు? ఈ హడావిడి అంతా ఆపద్ధతి లోనే ఉంది చూస్తే.'

'ఏం సంసారం లెద్దురూ! సంసారులు ఎంతమంది సుఖపడు తున్నారు గనుక?'

'ఇంకొకళ్ళతో మనకెందుకు చెప్పండి? మీవాళ్ళంతా ఎక్కడ ఉన్నట్లు?'

రామ్మూర్తి సీరియస్ సిట్యుయేషన్‌లో యిరుక్కున్న హీరో లాగ నవ్వేశాడు.

'లోకమే నా యిల్లూ, సంసారమూను. మీసంగతి నేను అడ గను. నాసంగతి మీరూ అడగకండి. ఒకరి జీవిత చరిత్ర మరొక ళ్ళకి చెప్పటంవలన ఒరిగేది ఏమీ ఉండదు.'

'అంటే?' అంది సావిత్రి మరీమరీ మౌనంగా.

'మనం రానురాను ఒకళ్ళను గురించి ఒకళ్ళు తెలుసుకోవటమే మంచిది. కథలు చెప్పుకునే కన్న....'

'ఓహో....'

'ఉండండి.... ఒక్క నిమిషంలో టీ ట్రే తీసుకువస్తాను.'

'ఆ మాత్రం నాకూ వచ్చునులెండి'—అని సావిత్రి అక్కడ నుంచి లేచి టీట్రే తనే అందిపుచ్చుకుని టీ కలిపింది యిద్దరికీ.

టీ తాగుతూ అన్నాడు రామ్మూర్తి: 'చూడండి. నేను ఓ వ్యాపారంలోకి దిగాను. అంటే నేను లాగలేను. ఓ పెద్ద వ్యాపారస్తుడి దగ్గర మరో గమ్మత్తయిన ఉద్యోగంలో చేరాను.'

సావిత్రి తమాషాగా రామ్మూర్తి కళ్ళల్లోకి చూసింది.

'ఈ ఉద్యోగం ఎంత గమ్మత్తయినదంటే... ఎంత వ్యవహారం ఉందంటే దీని వెనక....మీకు నవ్వు రావచ్చు వింటే!'

'చెబుదురూ. ఊరికే దబాయించక!'

'అమాత్రం ఉపోద్ఘాతం అవసరంలేకుంటే.... లేకపోతే....'

'నేను నమ్మకపోవచ్చు.'

'మీరు నమ్మరని నేను అనుకోవటం లేదు. ఆ అనుమానం గనక కలిగితే మీతో ఏమీ చెప్పాలనుకునే వాడినికాదు.'

'మీరుగూడా చాలా సెన్సిటివ్ అండీ!'

'కాదు. నేను ఏమాత్రం సెన్సిటివ్ కాదు. కొత్త సెన్సిబుల్ అంతే! అయినా మీరన్న మాటలు గనక పట్టించుకున్నాను మరెవరైనా అయితే యీ సంగతులు చెప్పే ప్రశ్నేలేదు.'

'అంత దాచవలసింది ఏముంది యిందులో?'

'లేకపోవచ్చు. కాని ఊరంతా చెప్పుకు తిరగవలసింది కూడా ఏమీలేదు. ఎవడి జీవితం వాడిది. ఎవడి పద్ధతులు వాళ్ళవి. అవి యింకొన్నాళ్ళకు తెలియటంవల్ల చవక అయిపోవచ్చు. అదిగాకుండా నేను యింకా మొదట్లోనే ఉన్నాను....'

'నేను బ్లాక్ మైల్ చెయ్యనులెండి.'

'మీమీదనాకు ఆమాత్రం నమ్మకం ఉంది. నేను చేసే బిజినెస్ అంటే నేను పనిచేస్తున్నచోట. కొత్త గడబిడగా ఉంటుంది. పొద్దున్న యిక్కడా. సాయంత్రం మరోచోటాను!'

'తమాషాగా ఉండి ఉండాలి.'

రామ్మూర్తిని చెప్పనియ్యకుండా ఆపుచెయ్యలేదు సావిత్రి. సావిత్రివేపే చూస్తూ అన్నాడు రామ్మూర్తి. 'నేను సొంతంగానే వ్యాపారం చెయ్యాలని ఏమాత్రం వీలున్నా .... ఎంత త్వరలో వీలైతే....'

'బాగుంది.'

'దానికి మీరు తోడునీడగా ఉండాలి. అంటే, మీ సహకారం కావాలి. అవి గొంతు సవరించుకుని ఉపన్యాసధోరణిలో ఉందికదూ' అన్నాడు.

'పనికొస్తారు మొత్తంమీద. రాజకీయనాయకుడయ్యే లక్షణాలున్నాయి.'

'పోనీలెండి. ఆశీర్వదించారుకదా మీరు ! రాజకీయనాయకుడిని అయినా. కాకపోయినా. ముఠానాయకుడిని అయ్యే అవకాశం ఉంది.

'అయితే యింకా మంచిది'

రామ్మూర్తి ఎంత స్పష్టంగా చెబుదామని అనుకున్నాడో అంత అస్పష్టంగా విషయాన్ని వెల్లడిచేస్తున్నాడు. సావిత్రితో తనుచెప్పదల్చుకున్నది డొంకతిరుగుడు వ్యవహారంలాగ కాకుండా సూటిగా చెప్పేస్తే పోయేదనుకున్నాడు. నుళ్ళా తను ముక్కుసూటిగాపోయే మనిషికాదనీ. ఒకసారి ముక్కుకిసూటిగా పోతే అది బెడిసికొట్టొచ్చనీ అనుమానం వేసింది.

'నన్ను గురించి నేను చెప్పుకోవటం తప్ప మిమ్మల్నిగురించి మీరు చెప్పనూలేదు. నేనూ నా గొడవలో మునిగిపోయి మిమ్మల్ని చెప్పనివ్వలేను.'

'మనం మొదట్లోనే అనుకున్నాంగదా. ఒకళ్ళనిగూర్చి ఒకళ్లు తెలుసుకోనక్కరలేదని ?'

'అవును. మీరన్నది నిజమే. అసలు మిమ్మల్ని వారానికో సారైనా కలుసుకోగలిగితే నాకు కాస్త రిలీఫ్. మీరు గనక....'

సావిత్రి గిరుక్కున తిరిగి చూసింది. ఎదురుగా కూర్చున్నా ఏవో తెగిన ఆలోచనలని తిరిగి కూరుస్తున్నట్లనిపించింది.

'పరీక్షలు అయిపోనివ్వండి.'

'బాగుంది. 'పేపర్లు రాయనివ్వండి.' అన్నారు కాదు.'

'నేను పైకి చదవాలని అనుకోవటంలేదు....'

సావిత్రి ఒక్క క్షణం ఆగింది. రామ్మూర్తి ఆ క్షణంలో అంతకు ముందు ఎప్పుడూ చూపించనంత మౌనం వహించాడు.

రామ్మూర్తి ఏమన్నా అంటాడేమోనని ఆగి, ఏమీ అనకపోయేసరికి ఉత్సాహం కొంచెం చప్పబడింది. 'పరిస్థితులు అలా వచ్చాయి.'

రామ్మూర్తి విసురుగా చూశాడు. 'మీరు ఏదో దాస్తున్నారు!'

'కాదు, నన్ను నేనే దాచుకుంటున్నాను.' అని మరోప్రక్కకు తిరిగింది సావిత్రి. ఫాన్‌గాలికి జుట్టు కొంచెంగా జరిగి, మళ్ళా నుదుటిమీద పడుతూంది. కట్టుకున్న రెడ్ వాయిల్‌చీర నడుముదగ్గర సన్నగా బిగించేసి, సన్నని ఉండీలేని నడుముని మరీ మరీ అందంగా కనిపించేలాగ చేస్తూంది. వేసుకున్న ఎర్రజాకెట్టు వంటివి పట్టేసి చెక్కినట్టున్న వంపుల్ని ఆట్టే దాచలేకపోతూంది. విరగబూసిన మల్లెలు తలలో పక పకా నవ్వుతున్నాయి. శాసిస్తున్నట్లున్న సావిత్రి ముక్కుపై సూటిగా చూసాడు రామ్మూర్తి. వేళ్ళ గమ్మత్తుగా గాలిలో ఏవో రాస్తున్నాయి. అవి రామ్మూర్తి భావి జీవితాన్ని రాస్తున్నట్లని పించింది.

గదిలో ఎదురుగా సావిత్రీ, తమూ. మరెవ్వరూలేరు. పట్టరాని యవ్వనం. కట్టలు తెంచుకునే కోర్కెలు. తీరనిదాహం చిమ్ముతూన్న కళ్ళు.

ఒక్కసారి మనసు చలించింది.

'ఆ ఏమిటన్నారు?' అంది సావిత్రి.

'ఆ....' అన్నాడు రామ్మూర్తి.

ఇద్దరూ ఏమీ అనలేదని యిద్దరికీ వెంటనే తెలిసింది, ఇద్దరూ దొంగల్లాగ ఒకళ్ళ కళ్ళల్లోకి మరొకళ్లు చూసుకున్నారు.

మరోక్షణంలో యీలోకంలోకి వచ్చేశారు.

సావిత్రి గబుక్కున లేచి నిల్చుంది. 'మళ్ళీ కలుద్దాం.' అని వెళ్ళిపోయింది. రామ్మూర్తి ఏమీ అనలేదు.

రామ్మూర్తి ఆవాళ రాత్రి ఎంతో ఆలోచించాడు. ప్రొద్దున్నే మరో తప్పుడుపని చెయ్యటానికి తయారు కావాలి. ఉషారుగా ఉండాలి. అంటే ఆలోచనలు కట్టిపెట్టాలి.

ఆ మాటలే మననం చేసుకుంటూ హాయిగా నిద్రపోయాడు.

'తియ్యటి కలలు వచ్చి ఉంటాయి' అన్నాను.

'అవును పొద్దున్నే మెలకువకూడారాదు నీకైతే' అన్నాడుసామి.

'అమ్మో, పట్టేసాడురా మళ్ళీ అనిపించింది.

'చూడు సీతారామారావ్, ఆరాత్రీ, మరో రాత్రీకలలుకంటూ కూచుంటే, భవిష్యత్తు గొడ్లు కాసేది. అందుకే బాగుపడటం మొదలెట్టు. ఆలోచనలు కట్టిపెట్టు! '(ప్రొసగూ రా కుదిరింది!'

'నీబుద్ధి పోగొట్టుకున్నావుకాదు, సుబ్బిశెట్టీ! తర్వాత ఏమైందో నువ్వు అడగకా మానవు. ఇంత చెప్పిన తర్వాత నేను చెప్పెయ్యకా మానను. నీకు యీకథ చెప్పటంవల్ల—అంటే ఎంత చెప్పాలో అంతే చెబుతాను గనక—నావ్యాపారానికి నష్టంలేదు గనక. నువ్వు నటిస్తూన్న బుద్ధిమంతనం నాకు గూడా నచ్చింది గనక, ఫర్వాలేదు. కాని, నువ్వు కథ అయిపోయేలోగా ఏరోజున నాకు కాస్త 'సెక్యూరిటీరిస్క్' అని అనుమానం వస్తే, అప్పుడే నేను చాప చుట్టెయ్యగలను తెలుసా?'

'ఎంతమాట సర్! మీరు చెప్పింది నిజం....'

'చాలుచాలు ఇవాల్టికివాలు, సగంచాలు, ఎక్కువ అయితే వెడిపికొడుతుంది. నామాటకి ఆగకుండానే లేచాడు సామి.

సామి లేచాడంటే అవాల్టికి కథ అయిపోయిందన్నమాటే. నాకుమాత్రం చాలా ఇబ్బందిగాఉంది. రామ్మూర్తి కథ నేను సరదాగా తెలుసుకుందామని యీ సామిని పీక్కుని తిన్నాను, తీరా చెప్పటం మొదలెట్టేసరికి, నాకు యీకథ తెలుసుకోవలసిన అవసరం మరీ మరీ కనిపించింది.

వింటూ వింటూంటే, ఇది కాలక్షేపంకథ కాదనీ, కబుర్లు చెబుతూన్నట్లు కనిపిస్తూ జీవితంలో ఎన్నో అధ్యాయాల్ని నాచేత అధ్యయనం చేయిస్తున్నా డనిపిస్తోంది.

కాని ఇదంతా డిటెక్టివ్ కథలో సస్పెన్స్‌లాగ ఉంది. భరించటం కష్టం. పోనీ రామ్మూర్తి జీవితం ఫలానావాడి జీవితంలాగ ఉంది అంటే, ఉదాహరణద్వారా తెలుసుకునే వాడిని, వచ్చిన తిప్పల్లా రామ్మూర్తి జీవితం మరోడి జీవితాన్ని పోలదు. అయినా,

చెబుతూన్న ప్రతి విషయం నాబుర్రకి పట్టటానికి. అంటే నేను జీవితంలో కాకపోయినా, ఆలోచనలలో నైనా అనుభవించటానికీ నాకు యీ టైమ్ యిస్తున్నట్లు అనుమానం వేసింది. అందుకే రామ్మూర్తి మాట ఎలాఉన్నా సామే నాపాలిట రామ్మూర్తి అయి ఊరుకున్నాడు.

*　　*　　*　　*

## 11. భవిష్యత్తులో ఒడంబడిక - ఇద్దరి కలయిక

'ఓ అమ్మాయీ అబ్బాయీ కలిస్తే ఏం జరుగుతుంది ?'

'ఏమైనా జరగవచ్చు'

'ఏమీ జరక్కపోవచ్చు కూడాను.'

'ఏమీ జరగకుండా ఉండదు'

దారిలోపడ్డావు సోమేశ్వరరావ్? పనికొస్తావు. అడవిలో వాది లేపినా, రామ్మూర్తికి మర్నాడూ మరోనాడూ యింకా నెలలతరబడి పనిచేసినకొద్దీ నమ్మకం కలుగుతూంది.

మరో కొన్ని యేళ్ళుగనక రామ్‌నామ్ దగ్గిర పనిచేస్తే తను ఓ దారికి రావడమే కాకుండా, పైకి లేచిపోగలననే నమ్మకం కలుగుతూ వచ్చింది. తను పెద్ద పొడిచేస్తాడనిగాని. లోకాన్ని ఉద్ధరిస్తాడని గాని ఎప్పుడూ అనుకోలేదు.

'లోకమూ ఉద్ధరించబడటానికి సిద్ధంగాలేదు'

'షక్కీ నీ అభిప్రాయాలు చెప్పటం మొదలెట్టావన్నమాట.'

'కాదు కాదు మీరేచెప్పండి' అని ముడుచుక్కూచున్నాను.

'రామ్మూర్తి ఏడాది తిరక్కుండానే వ్యవహర్తగా తయారయ్యాడు. మునుపు గూడుపుఠాణీగా కనిపించినవన్నీ చాలా మామూలుగా కనిపిస్తున్నాయి యిప్పుడు....'

'ఇట్లా ఉంటూండగా ఒక రోజున....'

సామి ఆగాడు. నావైపు చూశాడు.

'ఈ సస్పెన్స్ భరించటం కష్టం. చెప్పండి....'

రోడ్డుమీద నడుస్తే పడిపోయే నాకే రెక్కలొచ్చినట్టు అనుమానం వచ్చింది సామికి.

'చూడు చిట్టిబాబూ! లోకంలో రెక్కలు వచ్చిన తర్వాత పక్షులు ఎగిరిపోతాయి. వాట్ల ఆహారాన్ని అవే సంపాదించుకోగల వన్నమాట. కాని, మనుష్యుల సంగతివేరు. రెక్కలు వచ్చినా, పిల్లలు తమ చెప్పుచేతల్లో ఉంటారనుకోవటం మన అజ్ఞానం. అవునా? అయినా, ఆవిధంగా అనుకోవటమూ తప్పదు. ఎందువల్లనో చెప్పుకోచూద్దాం?' 'అజ్ఞానమే జీవితంగనక!'

'పాండిత్యం ఒంటబట్టకపోయినా నశ్యం సేవించటంమాత్రం గట్టిగా నేర్చుకున్నాట్ట నీబోటివాడే!'

'నేను?....'

'అవును నువ్వు నిజంగానువ్వే. మరేమీ అనుమానం లేదు. రామ్‌రామ్ సేట్‌కి తనమీద నమ్మకం బాగా కుదిరిందని పసిగట్టినప్పటి నుంచీ, రామ్మూర్తి మరీమరీ జాగ్రత్తగా ఉండటం మొదలెట్టాడు.

సావిత్రి బి. ఏ. పరీక్షలు రాయగానే రామ్మూర్తిని కలుసుకుని చెప్పేసింది ఓ కథ.

ఓరోజు సాయంత్రం రామ్మూర్తి రొంద్లు ముగించుకుని సీరియస్‌గా సిగరెట్టు కాలుస్తూ హిమాయత్‌నగర్ పెట్రోలుబంకు దగ్గరనుంచి వస్తూంటే కనిపించింది సావిత్రి.

'హలో!' 'మీకే హలో!'

నవ్వేశారిద్దరూ. దగ్గరలోఉన్న హోటల్‌లోకి వెళ్ళి కూచున్నారు. కాఫీతాగుతూ అన్నాడు రామ్మూర్తి. 'మీ పరీక్షలు అయిపోయినట్టున్నాయి....'

'మీకు తెలియనట్టు నటించకండి. మీకు చెప్పాను....'

'అవును, మర్చిపోయాను పనితొందరలో....'

'నాకు తెలుసు మీరు మర్చిపోతారని. అందుకే జ్ఞాపకం చేద్దామని వచ్చాను. నేను చదువు పూర్తిచేశాననీ, యింక చదవననీ, ఉద్యోగం ఏ దన్నా చేస్తాననీ కూడా చెప్పాను. అది కూడా చాలా సహజంగా మర్చిపోయే ఉండాలి.'

'మీరు మరీ అన్యాయంగా మాట్లాడుతున్నారు. తప్పు ఒప్పుకున్న తర్వాత....'

'శిక్షకి సిద్ధంగా ఉండండి' అని ముందుకు వంగింది. ముద్దు పెట్టుకున్నంత దగ్గరగా వచ్చాయి వాళ్ల పెదిమలు. అది హోటలు, యిద్దరూ ఎంత తెగించామనుకుంటూన్నా యీ దేశంలో పుట్టిన వాళ్లవటం వలనా, యిద్దరికీ లో లోపలే ఏవేవో అభిప్రాయాలూ, ఆ కాంక్షలూ సుప్తంగా ఉండటంవలనా, మళ్ళా, ఏమీ ఎరగని వాళ్లల్లాగ, ఎంతో బుద్ధిమంతుల్లాగ కాఫీ కప్పుల్ని ముద్దుపెట్టుకున్నారు. ఆ చప్పుడుకే పక్కనున్న ఓ జంట ఓ మాదిరిగా గాబరా పడ్డారు.

'మీరు మీ పలుకుబడి అంతా ఉపయోగించి....'

'ఓ చిన్న ఉద్యోగం యిప్పించమంటారు.... అంతేగా? దానికేం? నాకు ఉద్యోగం యిప్పించడానికేం అభ్యంతరం లేదు. మీరు చెయ్యాలిగా నేను యిప్పించిన ఉద్యోగం?'

ఒక్కసారి నవ్వేసింది సావిత్రి.

'ఎంత హాయిగా ఉంది యీ అమ్మాయి నవ్వితే!' అనిపించింది రామ్మూర్తికి. సావిత్రి తనతో కలిస్తే చాలు ననుకున్నాడు ఒకప్పుడు. నిజంగా సావిత్రే గనక కలిసివస్తే తనకింక తక్కువేమిటనుకున్నాడు. ఇప్పుడు ఎంతో గమ్మత్తుగా, తనంత తామగా ఆ అమ్మాయే వచ్చేసింది.

'ఎందుకు నవ్వారు?' నవ్వుతూనే అడిగాడు రామ్మూర్తి.

'నవ్వటం నేరం ఎప్పటినుంచీ అయింది దేశంలో? ఏదో మంచి సినిమాపాట జ్ఞాపకాని కొస్తూంది....ఉండండి.... జ్ఞాపకం వచ్చింది....ప్రేమేనేరమౌనా?....ఎవరు పాడిందది భానుమతేకదూ?'

'ఇప్పుడు పాడుతూన్నది మాత్రం మీరు. ఇప్పుడూ ప్రేమ నేరమేగా మరి! నిజం చెప్పటం అంతకన్న నేరం. అందే లోకాన్ని

ఉద్ధరించటం కోసం తనకు తాను అన్యాయం చేసుకోవటం మరీ మరీ పచ్చి నేరం!'

'బాగా చెప్పారండీ' అంది సావిత్రి.

సావిత్రి కళ్ళల్లో విశ్వాసం తళుక్కున మెరిసింది. ఈక్షణం యిదే విధంగా నిలబడి పోతే బాగుండుననిపించింది.

రామ్మూర్తి యిటువంటి సమయం కోసమే కాసుకు కూచు న్నది. కాని, సావిత్రిని ఎంత దూరంలో ఉంచాలో అంతదూరంలో ఉంచటం మంచిదని రామ్మూర్తికి అనిపించింది. సావిత్రి అంటే రామ్మూర్తికి తెలియ కుండా కొంత, తెలిసి కొంత మమకారం పెరుగుతూందని తెలుసుకోగానే ఓకసంగా బాధపడ్డాడు.

'ప్రేమలో పడిపోయానేమోననే అనుమానంరాగానే ఓసారి వెనక్కు తిరిగి చూసి ముందుకు దూకాడు. తను ప్రేమలో పడడు. తను ఎవరినన్నా ప్రేమిస్తున్నాననుకోవటం కేవలం తనని తాను మభ్యపెట్టుకోవటం. సావిత్రి తనకి కావాలి. అన్ని రకాలుగానూ కావాలి. అందుకు మరి సావిత్రిని వదలిపెట్టే ప్రశ్నే లేదు.

'అయితే నన్నేం చెయ్యమంటారు?' అని అడగలేదు సావిత్రి. 'మీరు యికనుంచీ మీ బాధ్యతలు నామీద వదిలెయ్యండి', అని రామ్మూర్తి బ్లాంక్ చెక్ రాసి యివ్వనూలేదు

సావిత్రికి నిజానికి అర్థంకాలేదు. తను ఇంతగా విప్పిచెప్పి నప్పుడు రామ్మూర్తి అంతగమ్మునుగా ఊరుకున్నాడు. ఒకప్పుడు సావిత్రి మాటని పట్టుకుని సాగదీసి తనవైపు తిప్పుకున్న రామ్మూర్తి, యిప్పుడేమన్నా మారాడా, మారుతున్నాడా అని సంకోచించింది కూడాను ఓక్షణం సావిత్రి.

రామ్మూర్తికీ సావిత్రికీ యిప్పటిదాకా ఉన్నది స్నేహం అనే అనాలి. కేవలం పరిచయంగా తీసిపారెయ్యటానికి వీల్లేదు వాళ్ళ కలయికని. ఏదో సరదాగా కాఫీతాగి, కబుర్లు చెప్పుకుని, ఎవరి దోవన వాళ్ళు వెళ్ళిపోవటం కాదు. అంత తేలికగా మరచేదికాదు వాళ్ళస్నేహం.

ఒకళ్ళ కొకళ్ళు ఏమీ వాగ్దానాలు చేసుకోలేదు. కథల్లోని

ప్రేమికులమల్లే కలలు కనలేదు. ఒకళ్ళ కళ్ళల్లో ఒకళ్ళు నీలి ఆకాశపు నీడల్ని చూడలేదు. అలాగని కేవలం పొడిపొడిగానూ లేరు.

సావిత్రిని గూర్చి ఆలోచించకుండా ఉండలేక పోయాడు రామ్మూర్తి. ఎన్నిసార్లు ప్రయత్నించినా, సావిత్రిని ప్రేమించి, పెళ్ళిచేసుకుని, తద్వారా ఓ అమ్మాయిని ఉద్ధరిద్దామనే సదుద్దేశం ఎప్పుడూలేదు. రామ్మూర్తిచేత మంగళసూత్రం ముడివేయించుకుని, బుగ్గన చుక్కపెట్టుకుని, కాళ్ళకి పారాణి పూసుకుని, కళ్యాణపు బొట్టుతో కళకళలాడుతూ పెళ్ళి పందిరిలో కనిపిద్దామని అనుకోలేక పోయింది సావిత్రి.

రామ్మూర్తితో పరిచయం పెంచుకుందామనే సంకల్పం కలిగి నప్పటినుంచీ, ఆలోచిస్తూనే ఉంది సావిత్రి. అసలు రామ్మూర్తి ఎవరు ? తనకీ, రామ్మూర్తికీ ఏమిటి సంబంధం ? ఈ వ్యక్తి తనకు ఎందుకూ పనికిరాకపోతే వృధాగా కాలయాపన ఎందుకు ? ఉబుసు పోక కబుర్లతో, సరదాగా కాలంగడిపెయ్యగల యిష్టం ఉన్నా, ఆ విధంగా గడపగల ఆర్థికస్తోమత తనకు లేదని తెలుసు సావిత్రికి.

ఈ విషయం బుర్రకి మరీ మరీ తట్టగానే సావిత్రి సన్నగా నవ్వుతూ అంది. 'చూడండి నేను ఇంకా ఏంచెయ్యాలో ఆలోచించుకోలేదు.' 'ఎందుకు మీరింత సందిగ్ధావస్థలో పడాలి ?'

'మీకు నాసంగతి అంతే యింటిపరిస్థితి చెప్పలేదు ఇప్పటివరకూ'

'నేను ఆమాత్రం ఊహించుకోగలను'

సావిత్రి అదోరకంగా చూసింది. రామ్మూర్తి చూసీచూడనట్టు అన్నాడు మళ్ళా. 'మీరు ఇంకా చదవటానికి మీ యింటిపరిస్థితులు అనుకూలంగా లేవు. మీ అమ్మగారు....'

'మీకు చెప్పకుండానే అన్నీ తెలుసునను కుంటా'

'కావలసినవాళ్ళను గూర్చి తెలియనైనా తెలియాలి. లేకపోతే తెలుసుకోనైనా తెలుసుకోవాలి. అవునా ?'

సావిత్రికి మాట తడబడింది, రామ్మూర్తికి అన్నీ చెప్పేసి తనకి ఏ విధంగా ఉపయోగపడతాడో తేల్చేసుకుందా మనుకుంటుంది గాని అది అంతతేలికగా తేలేలాగలేదు.

పోనీ రామ్మూర్తికి తనమీద ఏమీలేదా? కేవలం కబుర్లుచెప్పి కాలక్షేపం చెయ్యడమేనా? సావిత్రికి ఏమీ తేలలేదు. రామ్మూర్తి ఎటూ తేల్చటంలేదు. అయినా తను అడిగితీరుతుంది. ఆమాత్రానికే స్నేహం దెబ్బతింటే తిననీ!

సావిత్రి మరీ మౌనంగా కూచునేసరికి అన్నాడు రామ్మూర్తి: 'మీరు ఏదో చెప్పదలచుకున్నారు. కాని ఎందుకో మళ్ళీ మళ్ళీ ఆగి పోతున్నారు సగంలో.

'నిజమే కొంతవరకు మీరన్నది?' అని కొంచెం ఆగి 'మీరు నాతో అన్ని విషయాలూ చెప్తారుగనకనా?'

'మిమ్మల్ని విసిగించమంటారా నా సొదచెప్పి'

'అయితే నేను చెప్పేది కూడా మీకు సొదగానే అనిపిస్తేనో.'

'రామ్మూర్తికి సావిత్రిపైన నమ్మకంలేక కాదు. సావిత్రి అంటే మోజు లేకా కాదు. కాని, రామ్మూర్తికి తనకి ప్రస్తుతంలో ఉన్న 'లిమిటేషన్' తెలుసు. తనకుమార్కెట్‌లో ఉన్న 'లిమిటేషన్' తెలుసు. తనకు మార్కెట్‌లో ఒక్క పైసా విలువలేదనే కటునసత్యం తెలుసు. ఎవడైనా వందరూపాయలనోటు పట్టుకొచ్చి యిస్తే దాన్ని పదిసార్లు యిటూ అటూ తిప్పి పుచ్చుకునే చాదస్తం లేకపోయినా, ఎవడైనా గబుక్కున వచ్చి 'నీ మీద మనసాయింది. యీ వందా పుచ్చుకో!' అని యిస్తే ఎగిరి గంతేసి మాత్రం పుచ్చుకోడు.

సావిత్రికి రామ్మూర్తి అంటే కుదిరిన నమ్మకం కలకాలం ఉండేది అవునో కాదో తెలియదు. అసలు నమ్మకం అనేది కలకాలం ఉంటుందన్నది కూడా నిశ్చయంగా చెప్పగలిగిన విషయం కాదు. ఒక వ్యక్తిమీద మరో వ్యక్తి ఎందుకు ఆధారపడతాడు? ఒకళ్ళకోసం ఒకళ్లు లోకంలో ఎందుకుపడి చస్తారు? మనుషులమధ్య సంబంధాలు పెరగటానికి ఏమిటి సూత్రం? వీట్లకి సమాధానాలు రామ్మూర్తి దగ్గర లేవు.

మనిషికీ, మనిషికీ మధ్య ఉండే కనిపించీ, కనిపించని బంధం ఎంత సున్నితమైందో రామ్మూర్తి ఎప్పుడూ తెలుసుకోవడానికి ప్రయత్నం చెయ్యలేదు. రామ్మూర్తి జీవితం నుంచి నేర్చుకున్నది తనకు

వస్తూన్న ఒడుదుడుకుల వల్లనే. ఎవ్వరిమీదా విపరీతమైన ఆపేక్ష లేకపోవటానికీ, అయినా అందరితోనూ కలిసిమెలిసి ఉండటానికీ కారణం కేవలం తనకుతానుగా పెంపొందించుకున్న జాగ్రత్త. అప నమ్మకం ఒక రకమైన కవచం రామ్మూర్తికి.

ఎవ్వరినీ ఎప్పుడూ నమ్మకపోవడం చాలా సుళువుగా కనిపించినా, ఆచరణలో చాలా కష్టం అని ప్రతివాడికీ అనుభవం ద్వారా తెలుసు, అందుకే రామ్మూర్తిని సావిత్రి ఎంత గుచ్చి గుచ్చి అడిగినా తిన్నగా సమాధానం చెప్పలేదు. రామ్మూర్తిని తను బుట్టలో వెయ్యటం అంత తేలికకాదని సావిత్రి ఎంతోబాధగా తెలుసుకుంది.

కాని సావిత్రి రామ్మూర్తిలాగే 'ఇన్‌క్యూరబుల్ ఆప్టిమిష్టు.' ఏ మాత్రం నిరుత్సాహాన్ని పొందకుండా భవిష్యత్తుపైన విపరీతమైన విశ్వాసం కలది.

రామ్మూర్తి సావిత్రితో అన్నాడు: 'చూడండి. మీకూ నాకూ తెలుసు, మనం ఒకళ్ళ కొకళ్ళు కావాలని. మీరు ఏవిధంగా ఉండదలుచుకున్నారో ఏంచెయ్యదలుచు కున్నారో నాకు కొంతలో కొంత తెలుసు........'

సావిత్రి రామ్మూర్తివైపు గమ్మత్తుగా చూసింది. కళ్ళలోని మెరుపుని అల్లరిచేసే ముంగురులు చీల్చిన మేఘపు ముక్కల్లా అడ్డుకుని మరీ మురిపిస్తున్నాయి.

రామ్మూర్తి మళ్ళీ అన్నాడు. 'అందుకని మీరు నన్ను యింటర్‌వ్యూ చెయ్యకండి. నేను మిమ్మల్ని అడ్డదిడ్డం ప్రశ్నలు వెయ్యను. నేను రెండు మూడు నెలల్లో కాళ్ళూ చేతులూ కూడ దీసుకుంటాను. మీకు మరెక్కడా ఉద్యోగం చెయ్యవలసిన అవసరం కలగదు. 'అని నాటకంలో 'స్పెషల్ ఎఫెక్ట్' కోసం తంటాలు పడే హీరోలాగ కొంచెం ఆగి అన్నాడు: 'నన్ను మీరు అంతవరకూ నమ్మగలిగితే....'

'మీరు బలే వారండీ' అంది సావిత్రి,

'సావిత్రి నిజానికి నమ్మిందంటావా. లేదా అప్పారావ్?' అని విసిరాడు, ఓ కంకర్రాయి నామీద సామి.

'చెప్పటం కష్టమే!' అన్నాను.

'అవును నీకు కష్టమే. సావిత్రి అంత కులాసాగా మాట్లాడిం దంటే రామ్మూర్తి మీద అప్పట్లో నమ్మకం కుదరటమేకాదు. రామ్మూర్తి కోసం ఏమైనా చెయ్యటానికి సిద్ధంగా ఉన్న దన్నమాటే.

'అయినా యిద్దరి మధ్య స్నేహం చాలా చిత్రంగా ఉంటుంది కాదూ? అసలు నాకూ రామ్మూర్తికీ ఎలా పరిచయం అయిందను కున్నావేమిటి?' అని నావైపు తిరిగి నేను ఉత్సాహం చూపించక పోయే సరికి, 'నాకు తెలుసు. నాకథ నీకు అక్కర్లేదని. అయినా, వినక తప్పదని నీకూ తెలుసు. ఇలా కావలసినవాట్లతో బాటు అక్క ర్లేనివి కూడా భరించగలగటం నిజంగా ఒక పెద్ద 'ఆర్ట్.'

'నేను యిక్కడా అక్కడా నిరగ్గొట్టిన మంచం కోడులాగ తిరుగుతూ ఉంటే తగిలాడు నాకు రామ్మూర్తి

రామ్మూర్తికి ఓమనిషి కావలసివచ్చాడు. నేను బికారిలాగా ఊరూపేరూ లేకుండా, ఓ రోజు ఉన్నచోటు మరోరోజులేకుండా తీర్థయాత్రలు చేస్తున్న రోజులవి. మేము ఏవిధంగా కలిసిమెలిసి తిరిగిందీ, నేను వ్యాపారంలోకి ఎలా దిగిందీ నీకు యిప్పుడు చెప్పినా అర్థంకాదు.

'నిజంగా అర్థంకాదంటారా?'

'ఎంత అహంభావమోయ్ నీకు అహోబలరావూ? నువ్వు నచ్చావోయ్ చెప్పద్దూ? నీకూ ఆషాఢభూతికీ ఎంతపోలిక ఉందని? నిజానికి ఆషాఢభూతి ప్రతియుగంలో, ప్రతి తరంలో పుడుతూనే ఉంటాడు. మనం గుర్తుపట్టాలిగాని?'

'మీరు ....'

'నాకు తెలుసు....రామ్మూర్తి సావిత్రి—యిద్దరికీ బిజినెస్ ఎగ్రిమెంట్ ఎలాకలిగిందీ అని....అవునా?'

'అవును....'

'నాకు కావలసింది నీకూ, నీకు కావలసింది నాకూ తెలిసి నప్పుడు మనిద్దరికీ కావలసింది మనిద్దరికీ తెలుసునన్న మాటేగదా?'

'రామ్మూర్తి సావిత్రినీ, సావిత్రి రామ్మూర్తినీ ఓరకంగా అర్థం చేసుకున్నారని తెలుసుకోగానే వాళ్ళిద్దరూ బిజినెస్ పార్టనర్స్‌గా మారిపోయారు.

వాళ్ళస్నేహం బంధంగా మెలిచుకు పోయింది, తీగలా అల్లుకు పోయింది. ఎంతచుట్టుకుపోయిన తీగఅయినా రెండు వస్తువులూ వేరువేరుగానే ఉంటాయికదా ? అదీ సంగతి' అని ఊరుకున్నాడు అవాల్టికి సామి.

* * * *

# 12. అడుగడుక్కీ ఓ హర్డిల్

నాకు ఏ సంగతి నికరంగా తెలుసు, ఏవో నాలుగుకబుర్లు విన్నంత మాత్రాన నా జేబులునిండు తాయని నేను ఎప్పుడూ అనుకో లేదు. ఒకడి అనుభవం యింకొకడు చెబుతూన్నప్పుడు, అందులో కొంత భాగం మినహాయిస్తాడనీ, ఆ మినహాయింపు లోపాయికారీ వ్యవహారమనీ మాత్రం తెలియలేదు యిప్పటిదాకా.

సామి రామ్మూర్తి అంత వాడని అనుకోలేదు. రామ్మూర్తి దగ్గర చేరి మెల్లిగా పాతికో పరకో నిలవేసుకుని పకోడీలు అమ్ము కుంటున్నాడని నే ననుకున్నది మొదట్లో.

నేను అసలు మొదటి దశలో ఉన్నాను గనకా, రామ్మూర్తి నాకు ఎప్పుడూ అందుబాటులో ఉండడు గనకా, సామి అయినా ఏదో నా వారఫలాలు బాగా రాయించుకున్నాను గనక నాకు తగిలాడు గనక, యిది వదలకూడదనుకున్నాను ; కాని నాకు తెలిపినది, తెలుసుకున్నదీ చాలా తక్కువని తర్వాత తెలుసుకున్నాను.

అందుకే సామి ఎన్ని తికమకలు పెట్టినా, వాట్లన్నిటినీ శిరసా వహించి క్రికెట్‌మాచ్‌కి రోజంతా గాలరీ పైన కాపరంచేసినట్టు, మొదటిరోజు మొదటి ఆట మొదటి టికెట్ తీసుకోవటం కోసం చేసినంత శ్రద్ధతో వింటున్నాను.

నిజానికి నా బుద్ధికి నాకే ఆశ్చర్యం వేస్తూంది. ఇంత బుద్ధి ఉందని యిప్పటిదాకా నాకుతెలియనే తెలియదు. నేను వట్టి 'హోక్స్'నని నా ఉద్దేశ్యం. సామి నన్ను పట్టుకుని 'నువ్వు ఆషాఢభూతి అంతటి వాడ'వన్నాడు. ఒక్కసారి వెయ్యేనుగుల బలంవచ్చినట్లయింది. నేను ఉట్టి వెధవని కానని తెలుసుకున్న తర్వాత కూడా బురదలో ఎందుకు పొర్లాడటం?

సామి హాల్లోకి రావడం ఆలస్యమయ్యేసరికి అక్కరలేనిదిక్కుమాలిన ఆలోచనలు. ఇంతలోకే వీపుమీద చెళ్లుమంటే చూశాను. సామి వెనక్కి తిరిగిపట్టే తిరిగి ముందుకువచ్చాడు.

'ఏమిటీ చాలా డీప్‌గా వున్నావు మైడియర్ గిరీశం?'

'మీకు గిరీశం కూడా తెలుసునన్నమాట?'

'నువ్వు వట్టి వాజమ్మవోయ్ రంగనాధరావ్! ఆంధ్రదేశంలో ఉంటూ సాహిత్యసేవ చెయ్యకపోయినా, గిరీశం అంటే తెలియని వాడెవడోయ్? మనందర్లోనూ రోజులో ఏదో ఓ సమయంలో గిరీశం తొంగి చూడట్లోయ్?'

'అయితే మీరు గురజాడ పొయిట్రీ కూడా చదివారా?'

'లేదోయ్ నారాయణమూర్తి, యిద్దరు కవిగాళ్లు కొట్టుకుంటూంటే విన్నాను.... అంటే! 'ఆ లైన్లు నావంటే, కాదు అవి గురజాడ' వని యిద్దరూ ఘర్షణపడుతూ దొమ్మీ అయ్యేలాగ ఉంటే నేనే విడదీసాను.

దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్!

'ఈ లైన్లు నేనుకూడా రాశాను. నేను సహజకవిని. గురజాడని చప్తే చదవలేదని. ఎదటివాడి జందెం పుచ్చుకుని ప్రమాణం చేశాడు. నేనురాసినట్టే గురజాడకూడా రాశాడేమో' అనేమాట పూర్తి కాకుండా—' నువ్వు భట్రాజుగాడివి, ఎవడుడబ్బువిదిలిస్తే, కండవా వేస్తే అక్కడికి పరుగెత్తి ఆశీర్వచనం పద్యాలు చదివే అణాకాణీ వాడివి; అని పై కండువా లాగి కొట్టబోతూంటే నేను అన్నానుకదా. 'పోనీ యివాల్టికి పోనీ. నువ్వూ మరో పుంజీలైన్లు రాసిపారెయ్యి

కూడదూ?' అన్నాను. అదిసరేలే. యీసాహిత్యంజోలికి మనంఎందుకు పోవటం? నువ్వు సాహిత్యం అంటే చెవికోసుకుంటావేమిటి?

'ఏదో కాస్త అంటుతూ ఉంటుంది, అప్పుడప్పుడు....'

'అప్పుడప్పుడైతే ఫర్వాలేదు. మోతాదు మించితే అన్నం పుట్టదు ఆంధ్రదేశంలో. అది తెలుసా?'

'తెలుసు. ఓమాదిరిగా?'

'ఇదుగో, తెలుస్తూనే ఉంది. ఆనాటి పరుపూ ఆ ఒడుపూ ఆదీను. వడిసెలలో రాయి విసరగానే సరికాదు. అది తగిలినతర్వాత వచ్చే తంటాలు ఎదుర్కోటానికి దమ్ము కూడా ఉండాలి. అవి నీకు ఉన్నా యని?' రామి ఒక్కక్షణం ఆగాడు. సంగీత విద్వాంసుడిలాగ గొంతు సవరించుకున్నాడు. ఒక్కసారి గడియారం చూసుకున్నాడు.

'గంటకి ఎన్ని మైళ్ళు పరుగెత్తగలవోయ్ నువ్వు. గురు త్మంతుడూ?' 'ఆ....ఏమన్నారు?'

'ఏమిటా పరధ్యానం సులేమాన్ భాయీ? పరుగెడుతూ, పరు గెడుతూ దారిలో ఆగితే వేగం తగ్గిపోతుంది కదూ? ఎక్కువ వేగంగా పరుగెత్తుతూ, పగరుస్తూ, రొప్పుతూ, రోజుతూ, దారిలో పడిపోవటం కూడా జరుగుతుంది. అవునా?'

'పరి యింకో పందెం ఉంది అందులో అడుగడుక్కీ హార్డిల్. అది పరిస్థితులతో మనం వేసే పందెం. పరిస్థితులు మనల్ని కాళ్ళుచ్చుకు లాగేస్తుంటే. మనం పళ్లుదులుపుకుని పొట్టేళ్ళలాగ చక చకా ముందుకు పోవటం మరో పందెం? అవునా?'

రామ్మూర్తి రామ్‌రామ్ సేట్‌కి చాలా ముఖ్యమైనవాడుగా అయి పోయాడు. వ్యాపారంలో ప్రతినిధులుపు గానూ రామ్మూర్తి ఉన్నాడు నిజానికి. సావిత్రిని ఓరోజున తీసుకువచ్చి పరిచయం చేశాడు రామ్ రామ్‌కి. 'మిస్ సావిత్రి. బి. ఏ. పాస్ అయ్యారు. మనతో పని చెయ్యటానికి చాలా ఉత్సాహంగా....'

'ఓ....తప్పకుండా' అని రామ్‌రామ్ సావిత్రిజీ. మీరు మీ యిష్టంవచ్చినప్పటినుంచీ డ్యూటీలో చేరవచ్చు....'

'థ్యాంక్స్' అని సన్నగా నవ్వి రామ్మూర్తివైపు చూసింది. రామ్మూర్తి కంటిరెప్పలు ఆర్పాడు ఒప్పుదలగా.

రామ్మూర్తి బయటకు రాగానే సావిత్రి అడిగింది. 'ఇదేం ఉద్యోగం? నేను ఎవరినో, ఏంచెయ్యాలనో తెలుసుకోకుండానే?' అని కొంచెంఆగి, 'మీరు చెప్పిఉండాలి. అవునా?' అంది.

'ఇటీజ్ వెరీసింపుల్' అన్నాడు రామ్మూర్తి.

రామ్మూర్తి సావిత్రికి వేరేగదిచూశాడు. ఏరోజు కారోజు యిద్దరూకలిసి బజారుకు వెళ్ళటం. రొమాన్స్ వ్యవహారాలు చక్కబెట్టటమూను.

సావిత్రికి అడిగినప్పుడల్లా డబ్బుయిస్తున్నాడు రామ్మూర్తి. 'మా అమ్మా, చెల్లాయీ' అని ఏదో చెప్పబోయింది ఒకసారి సావిత్రి. 'పోనిద్దురూ' అని పొలైట్‌గా పక్కకు తప్పించేశాడు మాటని. దాన్నిబట్టి సావిత్రి అర్థంచేసుకుంది రామ్మూర్తికి యివన్నీ పట్టవని.

సావిత్రికి మాత్రం కావలసినదేముంది గనక। అంతా గమ్మత్తుగా కనిపించినా ఏమీ ఎబ్బెట్టుగాలేదు. ఆడవాళ్ళు చదువుకోవటం. ఉద్యోగం చెయ్యటం చాలా మామూలు విషయాలైపోయాయిగనక, సావిత్రితల్లి సావిత్రిని గుచ్చిగుచ్చి అడగనూలేదు.

సావిత్రి ఒకరోజు సాయంత్రం ఆరుగంటలకి సికింద్రాబాద్ టాజ్‌హోటల్లో కూసుక్కూర్చుంది, కాఫీ సిప్‌చేస్తూ. ఇంతలోకే రావ్ సాహెబ్‌వచ్చి 'హలో,' అన్నాడు. సావిత్రి 'హలో' అంది. రోజూ వ్యాపారరీత్యా తిరుగుతూన్న వాళ్ళల్లో రావ్ సాహెబ్ ముఖ్యమైన వాడనీ, సేట్‌కి ఆప్తుడనీ తెలుసు సావిత్రికి.

అంతకు ముందు రెండు సార్లు కాస్త చనువుగా, మామూలు కంటె ఎక్కువగా దగ్గరకు రావటానికి ప్రయత్నించాడు రావ్. మనుష్యుల్ని ఎంత దూరంగా, ఎలా ఉంచాలో సావిత్రికి బాగా తెలుసు. ఆ విద్యలో కావలిస్తే ఎంతమందికైనా 'ట్రెయినింగ్' యివ్వగలదు కూడాను. దగ్గరకు రాదల్చుకుంటే సూదంటురాయిలాగ దగ్గరకు లాగగలిగే శక్తి ఉంది తనలో.

మొదటిసారి తనకు తానుగా రావ్ సాహెబ్ పరిచయంచేసు

కోటానికి చూశాడు తను ఒంటరిగా హోటల్లో ఉంటున్నప్పుడు. అవాళ రామ్మూర్తి తనని ఒక సూట్‌కేస్ రావ్ సాహెబ్‌కి యిమ్మని పంపాడు. సూట్‌కేస్ పుచ్చుకున్న తర్వాత సావిత్రి లేచి వెళ్ళబోతూంటే రావ్ చెయ్యిపుచ్చుకుని ఆపుచేశాడు. సావిత్రికి చెళ్లున చెంప పగలగొడదా మనిపించింది. కాని, ఎందుకైనా మంచిదని చెయ్యి విదల్చుకుంది మెల్లిగా. కాని, బుద్ధి ఉన్న ఎవడికైనా ఓ ఆడది యిష్టంలేనప్పుడు ఏరకంగా విదల్చుకుంటుందో తెలుసు.

రామ్మూర్తికీ, సావిత్రికీ స్నేహం ఉందని తెలుసు రావ్‌కి. అది కేవలం స్నేహం మాత్రమే కాదని పసిగట్టడానికి ఎక్కువకాలం పట్టలేదు. రామ్మూర్తి కన్న చాలా ఏళ్ళుగా రామ్ రామ్ వ్యాపారంలో పాతుకుపోయినవాడు రావ్. అవసర మొస్తే రామ్మూర్తిని ఓ చిత్తు కాగితంలాగ చింపిపారెయ్యగలననే ధైర్యం రావ్‌కి ఉంది. తనకు రామ్ రామ్ అన్నిరకాలుగా మద్దతు యిస్తాడనే నమ్మకమూ ఉంది;

సావిత్రిలో చాలా ఆకర్షణ ఉన్నమాట నిజం. కాని సెక్సీగా వుండే అమ్మాయిలతో పరిచయం ఓ కొత్త అనుభవంకాదు రావ్‌కి. సావిత్రికోసం రామ్మూర్తితో తగాదాపడటం యిష్టంకూడా లేదు. సావిత్రికూడా రామ్ రామ్‌సేట్ వ్యాపారంలో పనిచేస్తూంది గనక తను మరింత జాగ్రత్తగా ఉండాలి.

కాని ఎంత రాయిలాంటివాడికైనా, ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సమయంలో మనస్సు చలిస్తుంది. ఆ క్షణంనుంచి గనక తప్పుకుంటే, మళ్ళీ అంతా మామూలుగానే ఉండొచ్చు. కాని తప్పించుకోలేని క్షణం కూడా అదే.

రెండోసారి కూడా రావ్ అదేవిధంగా 'స్టేర్' చేసి చెయ్యి నొక్కాడు. సావిత్రి మరికొంచెం గట్టిగా చెయ్యి విదిల్చింది. రావ్‌కి విలన్‌గా మారే ఉద్దేశంలేదు. కనీసం సావిత్రికోసం తను యింత కాలంనుంచీ నానాసనులుచేసి సంపాదిస్తున్న డబ్బును పోగొట్టుకోడు.

కాని సావిత్రికి తెలియజెప్పాలి. ఏ పని చెయ్యనని నటిస్తూందో ఆ పనులు చేస్తేనేగాని తప్పదని తెలియజెప్పాలి. తెలివి తక్కువగా తేలిపోడు తను.

రావ్ దగ్గిరకి వచ్చి 'హలో' అనగానే కొంచెం గాబరాపడినా వెంటనే సర్దుకుని ముభావంగా ఊరుకుంది సావిత్రి.

ఆవాళ సాయంత్రం రామ్మూర్తిని సావిత్రి అడిగింది 'ఏమండీ యీ రావుసాహెబ్‌కి ఆడవాళ్ళను వేటాడటం తప్ప వేరేపని ఏమీ లేదేమిటండీ'

'ఏం, మిమ్మల్ని ఏమన్నా అన్నాడా?'

'అదేం కాదులెండి' అని ఊరుకుంది.

రామ్మూర్తి ఇంకా గుచ్చిగుచ్చి ప్రశ్నలు అడుగుతాడనీ, అప్పుడు తను రావ్‌నిగూర్చి అనుకుంటూన్నవి చెప్పొచ్చని అనుకుంది. కాని రామ్మూర్తి ఆమాట మళ్ళీ ఎత్తకపోయేసరికి సావిత్రికి నిరుత్సాహం కలిగింది.

'రామ్మూర్తి తననిగూర్చి ఏమనుకుంటున్నాడు? నాకు ఏమైనా తనకి ఏమీ పట్టదా?' అని ఎన్నోవిధాలుగా ఆలోచించింది సావిత్రి.

సావిత్రి గదిలో ఎవరూ ఉండరు. ఆ పెద్ద కుటుంబం ఇంజనీరుగారింట్లో నివసిస్తుంది గనక. సావిత్రి పగలూ రాత్రీ ఏంచేస్తూందో నని ఆలోచనలు ఇంకో ఊళ్ళోవున్న వాళ్ళమ్మకిగాని, చుట్టుపక్కలుండే అమ్మలక్కలకిగాని రావు.

'మీ అమ్మాయి హైదరాబాదులో ఎక్కడ ఉంటోందేమిటి?' అని గుచ్చిగుచ్చి అడిగే ప్రశ్నలకి సావిత్రీవాళ్ళ అమ్మ 'మా అమ్మాయికేం, నిక్షేపంగా ఫలానా ఫలానా ఇంజనీరుగారి ఇంట్లో ఉంటూంది. వాళ్ళపిల్లలతో గాటే....' అని చెబుతూ ఉండవచ్చు.

గౌరవంగల వారి సంచన ఉండటంవల్ల గౌరవం అంటుతుంది. గౌరవం కొనుక్కుంటే వచ్చేదికాదని చెప్పేవాళ్ళకు, నిజానికి వాళ్ళేమి చెబుతూందీ వాళ్ళకే తెలియదు. గౌరవం అనేది ఒక ఘనపదార్థమనీ, అది ఏదోఒక అవ్యక్త శక్తివలనగాని, ఓ మహాకార్యం చెయ్యటంవల్లగాని సంక్రమిస్తుందనీ అనుకుంటారు చాలా మంది.

నిజానికి ఎవరైనా, ఎవర్నయినా ఎందుకు గౌరవిస్తారూ అంటే, ఆవ్యక్తి తనకుగాని, తన తాలూకువాళ్ళకు గాని, యిప్పుడైనా,

ఎప్పుడైనా పనికి వస్తాడనే ఆలోచన ఉండటంవల్లనే. 'గౌరవం ఏమున్నా కొనుక్కుంటే వచ్చేదా ఏమిటి?' అని అనడం కేవలం అలవాటుకోసం. ఆవిధంగా అనకపోతే గౌరవానికి లోటేమోననే అనుమానంతో. బాధతో తప్ప మరేమీ లేదు. నెలనెలకీ తప్పని సరిగా మనియార్డరు వస్తూంది. అమ్మాయి ఉద్యోగంచేసి డబ్బు పంపుతూంది. అంతకన్న ఏంకావాలి? అనుకుని సంబరపడింది సావిత్రి తల్లి.

అప్పటి దాకా అక్కడా యిక్కడా చాకిరీచేసి కొంతా, వీళ్ల దగ్గర నుంచీ, వాళ్ల దగ్గర నుంచి తీసుకునీ తంటాలుపడేది. ఇదంతా కాకుండా సావిత్రి గూడా అక్కడా యిక్కడా ట్యూషన్లూ అవీ చెప్పి గడిపింది

ఒక్కసారి చదువు పూర్తికావటమూ, రామ్మూర్తితో పరిచయం పెంపొందటమూ, అన్నీ కలిసొచ్చాయి. ఇంక యీ పంచనా, ఆ పంచనా పాకులాడక్కర్లేదు. తల్లీ చెల్లాయీ కులాసాగా ఉన్నారు యిన్నాళ్లకి.

రామ్మూర్తి తనని గూర్చి ఏమి అనుకుంటున్నదీ అనే ఆలోచనే రాలేదు సావిత్రికి. ఆనంద్ లాంటి వాళ్లకు తియ్యటి కబుర్లుచెప్పి కావలసిన వస్తువులు కొనుక్కొన్న సంగతులు గుర్తుకు వచ్చినప్పుడు మాత్రం ఏదో అనిపిస్తూ వచ్చేది. తను యింత యిదిగా మనుషుల్ని టోపీలో వెయ్యగలనా? అనిపించేది.

లేనిపోని ఆశల్ని కల్పించి, వాళ్లు దగ్గరకు రాగానే, తనకు కావలసినవి కొనిపించుకుని మళ్ళా ఎంతో చాక చక్యంగా తప్పించు కుంటూ వచ్చింది. రామూర్తితో తనకి ఉన్న పరిచయాన్ని స్నేహంగా మార్చుకుని తనకి పనికివచ్చేలాగ చేసుకుంది.

సావిత్రి తనలో ఉన్న అనేక వ్యక్తిత్వాల్ని చూసుకోటానికి మనసుపడినా, మనసు పడకపోయినా, యిన్ని తరహాలవ్యక్తిత్వాన్ని గుర్తించినప్పుడు మాత్రం ఏదో అనిపిస్తుంది. మళ్ళా మామూలే!

ఇప్పుడు రావ్‌సాహెబ్ కొంచెం వెకిలి వేషాలు వేసినంత మాత్రాన ఒక్కసారి కథల్లోని నాయికలాగ, ఇతిహాసాల్లోకి ఎక్కిన

పీరనారుల్లాగ ఆవేశ పడదల్చుకోలేదు. ఆవేశం అనేది అందరివంటికీ పడదు. చాలామంది జీవితాలకి పడదు.

ఎప్పుడూ పట్టీలు కొడుతూ నడిచే బండీ గతుపల బతుకుల్ని. తలపుకు తెస్తుంది సావిత్రికి. జీవితాన్ని గూర్చి ఆలోచించి నప్పుడల్లా.

కాని రామూర్తి తనని విలాస వస్తువుగా చూడకపోయినా, తనని మరోక్కళ్లు ఆ విధంగా చూద్దాం అనుకుంటూన్నప్పుడు, చూస్తూ గడుసుదనంగా ఊరుకోవటం కష్టం కలిగించింది.

రాత్రంతా ఎంత ఆలోచించినా తెగలేదు. ముడిపడలేదు. నిద్రపట్టలేదు సావిత్రికి. ప్రొద్దున్న కలవగానే రామ్మూర్తి అడిగాడు—

'రాత్రి మీరు నిద్రపోలేదులా ఉంది? నాలాగే మీరూ జాగారం చేస్తున్నారా ఏమిటి?'

'అంటే మీరు నిద్రపోవటం మానేశారా రాత్రిళ్లు?'

'ఒరకంగా నిజం, మరోరకంగా అబద్ధమూను.'

సావిత్రికి నవ్వొచ్చిందిగాని నవ్వలేదు. ఇంత సీరియస్‌గాఉన్న తనకి రామ్మూర్తి మాట్లాడగానే ఎందుకు నవ్వొచ్చింది?

'మీరు ఏదీ తిన్నగా చెప్పరుకదూ? అది మీ ప్రత్యేకత అనుకుంటా' అని అదోలా చూసింది సావిత్రి.

'ఏం చెయ్యమంటారు చెప్పండి? ప్రతిదీ. నిజమూ, అబద్ధమూను. రుజువు చెయ్యమంటారా?'

'మీరు దేన్నైనా రుజువు చెయ్యగలరు. నాకు తెలుసు. నేను ఏమైపోయినా చూస్తూ ఊరుకోగలరు కూడాను!'

సావిత్రికి తొందరపడ్డానేమో ననిపించింది. కావలసినదాని కన్నా ఎక్కువ చనువు తీసుకున్నానేమోననే భావం కలిగింది. రామ్మూర్తి ఒక్కమాట ఏమైనా విసిరితే ఆ గౌరవంకాస్తా పోవచ్చని పించింది.

రామ్మూర్తికీ తనకీ మధ్యన ఉన్న బంధం అంత సున్నితమైనది. ఎంతో జాగ్రత్తగా చూసుకోవాలి. ఈనాడు తనంటే మోజు పడుతున్నాడు కదాఅని ఏమాత్రం మాటవిసిరినా మళ్ళా అంతు చిక్కకుండా పోవచ్చుకూడాను. తర్వాత ఏమనుకున్నా ఏమీలాభం ఉండదు.

'ఏమిటి ఆలోచనలో పడ్డారు? ఇవాళ మీచేతికి కావలసినంత పని' అన్నాడు రామ్మూర్తి

సావిత్రికి ఒక్కసారి గుక్కతిప్పుకున్నట్లయింది. ఎంతో తీవ్రంగా ఆలోచనలో మునిగినప్పుడు, చేతినిండా పనిగనక ఉంటే అంతకన్నా కావలసింది మరోటిలేదు. లేకపోతే పిచ్చెత్తిపోదూ? అనుకుంది సావిత్రి.

'చెప్పమంటారా' అని ఆగి, ఉండండి 'స్టౌ' పైన కెటిల్ పెట్టి వస్తా' అన్నాడు.

'మీ పనివాడికి సెలవు యిచ్చారా ఏమిటి?'

'వాడే పుచ్చుకున్నాడు నేను సెలవుయిస్తే పుచ్చుకుంటే వాడి గొప్పదనం ఏముందిగనక?'

'మీరు చెయ్యికాల్చుకోవటం ఎందుకు? ఆ మాత్రం నేనూ చెయ్యగలను' అని రామ్మూర్తి సమాధానంకోసం ఆగకుండా లేచి వెళ్ళి 'టీ' తయారుచేసింది. రామ్మూర్తికి తమాషాగా ఏదన్నా అందా మనిపించింది. కాని మళ్ళీ ఎందుకో ఏమీఅనకుండానే ఊరుకున్నాడు.

'టీ' కలుపుతూ సావిత్రి అంది 'మీరు నన్ను ఎంతదూరంగా ఉంచాలో అంతకన్నా దూరంగా ఉంచుతున్నారుకదూ....?'

'మీరు తర్వాత ఏమిచెబుతారో కూడా నాకు తెలుసు. చెప్ప మంటారా?' అని సిల్వర్‌జూబిలీ హీరోలాగ కళ్ళల్లోకి చూసి మళ్ళా అన్నాడు—'మీరు ఇవాళ రాత్రి ఎనిమిదిగంటలకు రావ్‌సాహెబ్‌ని కలుసుకోవాలి....' అనే రామ్మూర్తి మాట పూర్తి చెయ్యకుండానే 'ఊఁ!' అంది గర్జిస్తున్నట్లుగా.

రామ్మూర్తి ఒక్కసారి గాబరాపడినట్లు చూశాడు. ఏదోదెబ్బ తగిలినప్పుడు అదెబ్బ తట్టుకోవటానికి చేసే ప్రయత్నం కనిపించింది.

సావిత్రి కూడా రామ్మూర్తివైపు చూసింది తను ఏమన్నానో నని ఒక్కసారి తనకితాను ఆలోచించుకున్నట్టుగా తనవైపు తనలోకి తాను చూసుకుంది.

'మీరు ఏదో అనబోయారు....'

'అవును....కాని ఏమీ అనబోవటంలేదు'

'అదీ ఒకందుకు మంచిదేలెండి....'

'మీకు యిష్టంలేని పని ఏదీ మీచేత చేయించటం నాకుయిష్టం లేదు....' అని కొంచెం ఆగి 'అది మీకు గూడా తెలిసేవుండాలి.... అవునా?' 'అవును కాదు' అని నవ్వేసింది సావిత్రి. మాట కలిపెయ్యటం కోసం నవ్విందని రామ్మూర్తికి తెలుసు. రామ్మూర్తికి తెలుసని సావిత్రికీ తెలుసు.

రామ్మూర్తికి ఖచ్చితంగా ఏదోచెప్పేద్దామన్న ఊహ చాలాసార్లు వచ్చింది. కాని ఎందుకో ఏమో. ఏమీ తెలియనట్లు ముఖావంగా ఊరుకున్నాడు. 'బొగ్గుల వ్యాపారంలోకి దిగిం తర్వాత చేతులు నల్లబడ్డాయని ఏడ్చి ఏంలాభం ...యీ సామెత మీకుతెలుసా?' అన్నాడు రామ్మూర్తి.

'తెలుగులో యీ సామెత ఉందా? లేక యిది మీ ఉర్దూ పాండిత్యమా? పోనీ ఉన్నా ఏ బొగ్గుల దుకాణపు శాస్త్రుర్లో కనిపెట్టి ఉంటాడు.'

'అయితే శాస్త్రుర్లుని పట్టుకుని బొగ్గుల దుకాణం పెట్టుకోమంటారా?'

'మంగలి దుకాణం కంటె తీసిపోయిందా?'

'మంగలి దుకాణం తీసిపారెయ్యకండి. గిరాకీ చాలా ఎక్కువ లాండ్రీకీ. సెలూన్‌కీను.'

'అయితే, యింతకీ మీరు ఏది పెట్టదలుచు కున్నారు. రెండింట్లో?'

'రెండూను.'

సావిత్రీ రామ్మూర్తీ యిద్దరూ మాట మార్చినందుకు ఒకళ్ళనొకళ్ళు లోలోపలే అభినందించు కున్నారు.

'మీరు ఎనిమిది గంటలకి వెడుతున్నట్టె కదూ?' అన్న రామ్మూర్తి మాట కొనని పట్టుకుని సాగదీసి 'ఆ వెడుతున్నట్టే.... ఎనిమిదింటికే....చేతులో చెయ్యి వెయ్యాలా?' అని చెయ్యి అందిచ్చింది అనుకోకుండానే సావిత్రి.

రామ్మూర్తి చెయ్యి అందుకుని గట్టిగా నొక్కాడు.

'మీరు చాలా మోటువారండీ' అంది కొంటిగా సావిత్రి.'

'ఊ....అలాగేం?' అని కళ్ళల్లోకి గుచ్చుకునే లాగ చూశాడు రామ్మూర్తి. రామ్మూర్తిని తినేసేలాగ చూసింది గుటకలు మింగు కుంటూ సావిత్రి.

అవాళ యింటికి వెళ్ళినతర్వాత సావిత్రికీ, రామ్మూర్తికీ జాగరణ తప్పదని యిద్దరికీ తెలుసు. ఒకరోజు తప్పించుకోవచ్చు, రెండు రోజులు తప్పించుకోవచ్చు. ఇలా ఎన్నాళ్లని ఒకళ్లని ఒకళ్ళు తప్పించుకుని తిరగ గలరు గనక? పరిస్థితుల్ని, వాట్ల ప్రభావాన్నుంచీ ఎలా తప్పించుకోవటం?

ఈ విషయం వాళ్ళిద్దరికీ తెలుసు. అందుకే మరీ చిక్కు. ఎవరు కాస్తమాట జారినా ఏమన్నా కావచ్చు. కాలుజారటాన్ని గూర్చి, యిద్దరిలో ఎవరూ అంతగా పట్టించుకున్నా పట్టించుకోకపోయినా, యిద్దరూ యిప్పటివరకూ పొడి పొడిగానే, దూరంగానే ఉంటూ వచ్చారు. ఒకళ్లని గూర్చి ఒకళ్లకి కావలసిన దానికన్న ఎక్కువగా, అతి తక్కువ కాలంలో తెలిసినప్పుడు వచ్చే చిక్కుల్నివాళ్లు అను భవిస్తున్నారు.

సావిత్రికి వేరే ఆధారంలేదని రామ్మూర్తికి తెలుసు. రామ్మూర్తి అతి తంత్రీ, మహాతంత్రీయే గాని, తనను నమ్మిన సావిత్రిని వదులుకోలేదు, మోసం చెయ్యలేదు. తనకు పనికివచ్చే వస్తువులాగ వాడుకోదలచుకున్నాడు. అది నిజమే! కాని, అందులోనూ ఒక పద్ధతి ఉంది. స్వార్థంలో ఓ రహస్యం ఉన్నా, మోసంలేదు. కసీసం రామ్మూర్తి ఉద్దేశంలో.

రామ్మూర్తికి తెలుసు- కసీసం అమాయకుడు కాదు గనక- రావ్ సాహబ్‌కి సావిత్రిపైన మోజుకలిగిందని. చూస్తూ, చూస్తూ రావ్ సాహబ్ మాట దిక్కరించలేడు. అతని పైన గౌరవం వలన కాదు. రావ్ సాహబ్‌కి రామ్ రామ్ సేట్‌కి ఉన్న సంబంధం వల్ల.

మరి ఏమిటి చెయ్యటం? చూస్తూ ఊరుకోవటం మాత్రం కాదు- జాగ్రత్తగా పరిస్థితుల్ని అర్థం చేసుకుని మసలటం!

మూడు రోజుల తర్వాత వాళ్ళు రామ్‌రామ్‌సేట్ బంగళాదగ్గర కలుసుకున్నారు. సావిత్రి తనంతట తాను రామ్‌రామ్ బంగళాకి

రావటం కొత్తకాదు. కాని ఎందుకో ఏమో ఆవాళ రామ్మూర్తికి సావిత్రి అక్కడికి రావటం నచ్చలేదు. సావిత్రి తనదని తనకు తెలియకుండానే తాను లోపల అనుకుంటున్నాడా? సావిత్రిచేత తనకి నచ్చని పనులు తెలిసి చేయిస్తున్నాడని అనుమానం కలిగితే రామ్మూర్తి మీద సావిత్రికి ఉన్న గౌరవం తొలగిపోవచ్చు. రామ్మూర్తినికూడా ఆమె జీవితంనుంచి తప్పుకోమని చెప్పకపోయినా, ఆ పరిస్థితి కలుగ జేయవచ్చు.

ఎందుకో ఏమో రామ్మూర్తి బుర్రకి యీ ఛోటా మోటా సమస్య చాలా పెద్దదై కూర్చుంది. సావిత్రిని మాట్లాడించి మెల్లిగా నచ్చజెప్పాలి.

సావిత్రిని చూసి రామ్‌రాంసేట్ నవ్వి అన్నాడు; 'సావిత్రీజీ, మీరు కొద్దిరోజుల్లోనే పనిలోని నేర్పులు పట్టేగారు' అని రామ్మూర్తి వైపు తిరిగి 'మీరు మంచి ట్రైనింగ్ యిచ్చివుండాలి' అని నువ్వు చాలా మంచిపిట్టని పట్టావు అన్న అర్థంవచ్చేలాగ చూశాడు రామ్మూర్తి వైపు. సావిత్రి సన్నగా, పేలవంగా నవ్వింది. ఆ నవ్వులో రాం రాంకి అర్థంకానిదీ కేవలం రామ్మూర్తికి మాత్రమే అర్థం అయ్యేదీ ఏదో భావమూ, బాధా ఉన్నాయి. రామ్మూర్తి చూసీకూడా చూడ నట్టు ఊరుకున్నాడు.

సావిత్రీ, రామ్మూర్తీ-యిద్దరూ బయటకు వచ్చేస్తూంటే సావిత్రితో ఏదో మాట్లాడదామని ఎన్నోసార్లు, 'మీరు....యివాళ....' అని ఏదో పొడిపొడిగా అనబోయాడు రామ్మూర్తి.

ఎప్పుడూ టంకంలాగ అతికే మాటలు ఎందుకో ఆవాళ అతక లేదు. ఇద్దరి మనసుల్లో ఏవేవో అనుమానాలు తొంగితొంగి చూస్తూనే ఉన్నాయి. ఏవో తెలియని చెప్పలేని ఆందోళనలు సావిత్రిని కలవర పరుస్తున్నాయి. వాట్లకి ఒక స్పష్టమైన రూపంగనక వచ్చివుంటే వాట్లని చెప్పగలిగి ఉండేది సావిత్రి. ఎందువల్లనంటే లోలోపల బాధపడటం సావిత్రికి నచ్చదు నిజానికి. నచ్చినా నచ్చకపోయినా బాధ బాధే.

రామ్మూర్తి మాత్రం టాక్సీలో కూచున్నప్పటినుంచీ వాళ్లు

సుల్తాన్‌బజార్లో దిగేదాకా ఏదోఒకటి అంటూనేవున్నాడు. సావిత్రి ముభావంగా 'ఊ' కొడుతూనే ఉంది.

సావిత్రి యింత ముభావంగా ఉండగల్గుతుందని రామ్మూర్తికి తెలియదు యిప్పటిదాకా. అంటే రామ్మూర్తి మరికొంచెం జాగ్రత్తగా ఉండాలన్నమాట. ఇకనుంచీ సావిత్రికూడా ఓ 'హర్డిల్' కాదుగదా ?

ఆలోచనలో పడ్డాడు రామ్మూర్తి. 'ఏమంటావు సుబ్బు సామీ! అడుగడుక్కీ హర్డిల్ కదూ రామ్మూర్తికి ?' అన్నాడు సామి.

'రామ్మూర్తికి ఇది ఓలెక్కా సార్' అన్నాను.

'రామ్మూర్తి యింకా అంతవాడు కాలేదు. కథ యింతవాకా వచ్చేసరికి సావిత్రి 'నువ్వెంత నీ తలలో జేజెమ్మ ఎంత? అని గుడిసెమీద దెబ్బతీసి లేచిపోయిందంటే రామ్మూర్తి జీవితవ్యాపారం దెబ్బతింటుంది.

'రామ్మూర్తికి మరో సావిత్రో? సత్యవతో దొరక్కపోతుందంటారా ?'

'అది కేవలం 'స్పెక్యులేషన్' కదా? వళ్లు కొవ్వెక్కినప్పుడు ఓ పదివేలు ఓ సుబ్బారాయుడు తింటేనేం. మరోపాతికవేలు ఇంకో పీరుసాయిబు తింటేనేం అనిపించవచ్చు. ఓ రూపాయి ఏ గణపాయి తిన్నా, ఉన్నది ఆ రూపాయే అయినప్పుడు దరిమిలా మరేమీ ఉండదుగనక మూకుడు గోక్కోవాలిగనక రామ్మూర్తి ఆ 'రిస్క్' తీసుకోరాదు అప్పట్లో.

'అయినా సావిత్రి యింకా చేతిలోంచి జారలేదు. చేతిలో ఉన్న ఒక పిట్ట దూరంగా ఎగిరే రెండుగోసుల పిట్టల సమానం. ఇది తెలుసుకో శిష్యా' అన్నాడు సూటిగా సామి.

*　　*　　*　　*

# 13. రామ్మూర్తి జీవితంలో మలుపు

మనిషికి సమస్య వచ్చినప్పుడే మతిపోతుంది. మనిషికి మతి కావల సింది సమస్య వచ్చినప్పుడే. సమస్య వచ్చినప్పుడు సడన్‌గా మతి పని చెయ్యటం మొదలెట్టదు కదా?

అసలు ఏదైనా సమస్యవస్తేనేగాని అసలు మతి ఉందో లేదో తెలుసుకోవడం కూడా కష్టం. మరీ పెద్ద సమస్య వస్తేనేగాని సామాన్యంగా మనిషి మతి చెడదు. చిన్న చిన్న వాట్లకోసం మతి చెడగొట్టుకునే వాళ్ళూ ఉన్నారు. వాళ్ళు చరిత్రలోకి ఎక్కరు. షాహుకారు ఖాతా పుస్తకాల్లోకి మాత్రం ఎక్కుతారు. లేక పోతే స్మాల్‌కాసెస్ కోర్టుల కెక్కుతారు. అంతే!

'రామ్మూర్తికి ఓ పెద్ద అవకాశం, మరో పెద్ద సమస్యాను రెండిటికీఉన్న 'లింక్' చెప్పుకో చూద్దాం సుబ్బిసెట్టీ!' అన్నాడుసామి.

'రెండూ ఒక దానికి ఒకటి విరుద్ధం కదా? అవకాశం లేక పోవటమే ఓ పెద్ద సమస్య.' అన్నాను.

'ఇప్పుడు రామ్మూర్తికి వచ్చినది ఓ పెద్ద సమస్య. వచ్చిన అవకాశం చేతిలోంచి జారిపోవచ్చు. సావిత్రికి గనక రామ్మూర్తి మీద నమ్మకం పోయిందా, రామ్మూర్తి చేతుల్లోంచి సావిత్రి జారి పోయినట్టే.

సావిత్రి చేతిలోంచి జారిపోయిందంటే, రామ్మూర్తి కుడి చెయ్యి తెగిపోయిందన్న మాటే?

రామ్మూర్తి ఓ అమ్మాయి మీద మరీ యింతగా ఆధారపడి ఉండటం నమ్మ తగ్గదిగా ఉందంటారా?

'వచ్చిందీ అనుమానం? నిన్ను మాటి మాటికీ అనుమానం ఎందుకు వచ్చిందీ అని నిన్ను అనుమానించటం ఏమీ బాగాలేదు. నీకు వచ్చే అనుమానాలన్నీ ధర్మ సందేహాలు. అది నేనుతీర్చలేను.'

'ఇంక అడగన్లెండి!'

'అలా అంటావేగాని నువ్వుమాత్రం ఊరుకోగలవా ఏమ న్నానా ?' నువ్వు అలా అడుగుతూనే ఉంటావు. నేను చెబుతూనే ఉంటాను. ఏదో మోటుసామెత చెప్పినట్టు....' అని ఆగి, ఒక్క సిగరెట్ దమ్ములాగి 'అదేమిటని అడక్కేం ? నాకూ తెలియదు.' నేను మళ్ళీ ఆషాఢభూతి పోజులో కూచున్నాను. సామికి మళ్ళీ మూడ్ వచ్చింది. చెప్పటం మొదలెట్టాడు.

రామ్మూర్తికీ సావిత్రికీ మధ్య కలతలు ఏమీ రాలేదు. వాళ్ళిద్దరూ ఎడముఖం, పెడముఖం పెట్టుకోలేదు. ఒకళ్ళతో ఒకళ్ళు మామూలుగా కలిసిమెలిసి ఉన్నట్టుగానే ఉన్నారు. కాని ఏదో లోపం తొంగితొంగి చూస్తూంది వాళ్ళిద్దరి మధ్యా. అదే విధంగా యిద్దరూ అంతదగ్గరకి వద్దామనుకున్న వాళ్ళు-అంత దూరంగా ఉంచే. వాళ్ళిద్దరి మధ్యనా మరి స్నేహం సన్నగిల్లొచ్చు. అందుకే రామ్మూర్తి తనంత తానుగా సావిత్రి గదికి వెళ్ళాడు ఆసాయంత్రం. రామ్మూర్తీ సావిత్రీ ఒకేచోట పనిచేస్తున్నారు గనక యిద్దరూ ఒకళ్ళకోసం ఒకళ్ళు రావటం ఇంజనీరుగారింట్లో అంత ఎబ్బెట్టుగా చూడరు. అది గాకుండా, సావిత్రి వాళ్ళయింట్లో వాళ్ళందరినీ ఒకరకంగా పట్టేసిం దనే చెప్పాలి. సావిత్రి అక్కయ్య....సావిత్రి....సావిత్రి ఎంత నెమ్మదనుకున్నారు....ఎంత పొందికి ఆ మనిషికి....మరి చదువు కున్నదన్న గర్వం, భేషజం ఏకోశానా లేదు. సావిత్రిని పెంచిన వాళ్లు చాలాజాగ్రత్తగా పెంచి ఉండాలి....మరి సావిత్రి నిజానికి.... యిలా ఉండేవి వాళ్ళ అభిప్రాయాలు.

అందుకనే రామ్మూర్తి అవాళ సాయంత్రం పనివున్నా లేక పోయినా సావిత్రిని కలుసుకోవటానికి వెళ్ళాడు. సావిత్రి ఏదో పత్రిక తిరగేస్తూంది 'లేజీ' గా కాఫీ సిప్‌చేస్తూ.

రామ్మూర్తిని చూసి ఆశ్చర్యపడ్డా, అది కనిపించనియ్యకుం డానే 'రండి....యిల్లుమనదే, కుర్చీలు మనవే....' అంటూండగా—

'మరి మనదికానిది ఏదీ ?'

'మనం....'

'మీరు కాలేజీ నాటకాల్లోనన్నా కనీసం వేషంవేసి వుండాలి.

'మీరు కనీసం ఓ వన్-ఏక్ట్-ప్లే అయినా రాసి ఉండాలంటా రేమోననుకున్నాను.'

'నాకు తెలియదు మీరు రాస్తారని?' అని తమాషాగా ఓ నిమిషం ఆగి సావిత్రి 'రియాక్షన్' కోసం చూసి 'అయితే ఇది మరో డిస్కవరీ' అన్నాడు రామ్మూర్తి.

'వద్దు, వద్దు మీరుమాత్రం నన్ను 'డిస్కవర్' చేసి మరో కొలంబస్ అయిపోకండి'

'ఒక రచయిత్రిని 'డిస్కవర్' చెయ్యటంలో ఉన్న 'థ్రిల్' మీకు ఏం తెలుసు?'

'ఇంతకీ నేను వంటచెయ్యలేదు గనక వంటింటిని గూర్చి, పెళ్ళికాలేదు గనక వైవాహిక జీవితాన్ని గూర్చి 'అథారిటేటివ్' గా రాసెయ్యొచ్చు....' అని కొంచెం 'పోజ్' ఇచ్చి మళ్ళీఅంది సావిత్రి. తెలియని విషయాన్ని గూర్చి రాయగలిగినంత తేలికగా తెలిసిన విష యాల్ని గూర్చి రాయలేం! చెప్పలేం - అవునా?'

'ఇంతకీ మీరో ఉపన్యాసం దంచేశారు? ఇంతకు ముందు ఏమన్నా అనుమానం ఉండేమోగాని....'

ఇద్దరికీ తెలియకుండానే కొంతసేపు గడిచింది. ఇద్దరికీ తాము మాట్లాడుతూన్న విషయం తమకి సంబంధించింది కాదని తెలుసు. అందుకే మరీ పట్టూ విడుపూ తెలియకుండా మాట్లాడుతున్నారు.

సావిత్రికి నిజానికి రచనలో కాస్తో కూస్తో ప్రవేశం ఉంది. కాలేజీ మేగజైన్‌లో కథలు రాయటం, తర్వాత స్నేహితులు బలవంత పెడితే పత్రికలకి పంపటం, వాళ్ళ ప్రచురించిన తర్వాత స్నేహితులు ఆ కథల్ని పొగడినా, తనకు ఏదో లోపం కనిపించటం, అంతేత రాయటం మానెయ్యటం జరిగాయి.

సావిత్రికి రచయిత్రి అవుదామనే ఉద్దేశం లేదు ఎప్పుడూ. ఈ దేశంలో యువతి నిద్రపోతూందనీ, అప్పుడప్పుడు ఎవరైనా అరుస్తే, తాము కూడా అరిచి, వాళ్ళ బస్సులూ, రైళ్లూ తగలెడితే, తామూ ఓ అగ్గిపుల్లా, ఓ పెట్రోలు టిన్నూ పడేసి, మళ్ళీ తీరుబాటుగా

ఓ సిగరెట్ వెలిగించుకుని కూర్చుంటారని తను ఓ సారి కాలేజిలో ఉపన్యాసం యిచ్చింది కూడాను.

కాలేజీలో అందరిలాగా డబ్బు తగలెయ్యకపోయినా, సావిత్రికి కాలేజీలో పేరుండి. సావిత్రికి యితర రచయిత్రుల నవలలూ, కథలూ చదివినప్పుడు నవ్వొచ్చేది. నవలలు చాకలిపద్దుల్లాగానో, లేక చాదస్తంగా, చేతకానివాళ్లురాసే డైరీల్లాగానో కనిపించేవి. కథలు నమిలి పారేసిన పిప్పిలాగ అనిపించేవి. లేదా యింకొక కథ ఏదో జ్ఞాపకం వచ్చేది. ఓ కథ చదివితే, చిత్రించే సంఘటనలలో పటుత్వం లేదు. భావనలో ఓ ఉద్వేగం లేదు. పాత్రలలో జీవంలేదు. కాని, యీకొట్టొచ్చే లోపాలేవీ ఆ రచయిత్రుల ప్రాచుర్యానికి గాని, డబ్బుకు గాని అడ్డంకులుగా ఉండటంలేదు. అది గాకుండా, వాళ్లకి మహిళా సమాజాలు బిరుదు లివ్వటం, వాళ్లనుచూసి సాహిత్య సంస్థలు గూడా బహుమతు లియ్యటం సమ్మానాలు చెయ్యటానికి పోటీపడటం చూస్తూంటే వినోదంగా ఉండేది.

అందుకే రామ్మూర్తి అన్నమాటలు కాలేజీ స్మృతుల్ని రెచ్చగొట్టాయి సావిత్రిలో. రామ్మూర్తికి సాహిత్యచర్చపైన మోజు లేకపోగా, సాహిత్యం అన్నా, రచయితలన్నా ఓరకమైన 'ఎలర్జీ.' కారణం తను ఎక్కువ చదువుకోలేక పోయాడనికాదు. నిజానికి తను చదువుకోక పోవటంవల్ల నష్టపడలేదనీ, చదువుకున్న వాళ్ళు బజార్ల వెంబడి 'నువ్వా నువ్వా' అని ఉద్యోగం కోసం తిరుగుతున్నారనీ తెలుసుకున్న తర్వాత బాధపడక పోవటమే గాకుండా, సంతోషించాడు కూడాను. సాహిత్యాన్ని పట్టుకు పాకులాడేవాళ్లు చాలా దీనమైన స్థితిలో ఉండటం తను చూస్తూనే ఉన్నాడు.

రామ్మూర్తి సావిత్రికోసం తహ తహ లాడలేదు. విరహ గీతాలు ఆలాపించి మజ్నూ అయిపోలేదు. కనీసం 'రొమాన్సు'లో పడ్డవాడికి మల్లే నన్నా ప్రవర్తించలేదు అప్పటిదాకా. సావిత్రికూడా తను మనసు పడుతున్నట్లు కనిపించలేదు. నాగరికతని ఆకళింపు చేసుకున్న వ్యక్తిలాగే యిప్పటిదాకా ప్రవర్తించింది.

ఈవ్యవహారం యింతటితో గనక ఆగిపోతే యింక ముందు

కథ ఏమీ లేనట్టే. రామ్మూర్తి తన సొంత ఉద్యోగం. సావిత్రి తన సొంత ఉద్యోగం చేసుకుని కథకి కాదుగదా వాళ్ళపిల్లలకిగూడా జ్ఞాపకంవచ్చేవాళ్లుకారు.

అసలు ఎవడి జీవితంలోనైనా చెప్పుకోతగ్గ మార్పు రావాలంటే ఒకమలుపు అవసరం. ఆ మలుపు తిరగాక. బతుకు ఒక పద్ధతిలో నడచిపోతుంది. అంతకు ముందు బస్సులో వెళ్ళటానికి డబ్బుల కోసం ఎవడి జేబైనా కొయ్యవలసివస్తే. తర్వాత జెర్రిగొడ్డులాంటి కారులో జారిపోతానంటుంది.

ఆ కులాసాకోసం. బతుకులో ఆ ఖిలాసా కోసం తంటాలు పడ్డంత కాలం. కాలం బూటుకాలితో తంతూనే ఉంటుంది. మనిషి దేనికోసం పాకులాడతాడో. అది మరో ఆమడ దూరం పోతుంది. అవాళ సాయంత్రం అలాగే కరిగిపోయింది. కరిగిపోవటానికీ. నీళ్ళు కారిపోవటానికీ ఉన్న తేడా అది.

వాళ్ళిద్దరూ అవాళ కలిసే హోటల్లో భోజనం చేశారు.

'నేను యింటికి వెడతాను, మీరు దిగబెట్టక్కర్లేదులెండి....' అంది అదోలా సావిత్రి.

'మీరు ఇవాళ అంతదబ్బున ఇంటికి వెడుతున్నారా ?'

'ఏం ?....'

'ఏం లేదు!' వాళ్ళు వెళ్ళి టిర్రేస్‌మీద కూచున్నారు. సావిత్రి కళ్ళల్లో ఏదో మెరుపు మెరిసింది. రామ్మూర్తికి చిక్కని బాధ కలిగింది. సావిత్రి కట్టుకున్న తెల్లచీర, వంటికి అంటుకు పోయిన తెల్ల బ్లౌజూ, తల్లో తెల్లని విచ్చీవిచ్చుకోని మల్లెలూ, ఆకాశంలో అర్థం లేని ఆరాటం, యవ్వనపు పొంగు....ఏమాత్రం అర్థంచేసుకోలేని వయసు, కొట్టొచ్చేకోరికల బాకులు, గుచ్చుకునే చూపులు....రామ్మూర్తికి మతిపోయింది.

ఒక్కసారి సావిత్రిని దగ్గరగాతీసుకుని గట్టిగా కౌగలించుకున్నాడు. ఆ కౌగిలిలో ఎంతోకాలంబట్టీ పేరుకుపోయిన కోర్కెల సహస్రాలు మేల్కొన్నాయి. సావిత్రి కసిగా రామ్మూర్తి పెదవుల్ని కొరికేసింది. జుట్టులోకి వేళ్ళుపోనిచ్చి జుట్టు పీకేస్తున్నట్టు గట్టిగా

పట్టుకుంది. రామ్మూర్తి సావిత్రిని ఉక్కిరి బిక్కిరి చేసేశాడు. ఓగంట తర్వాతగాని వాళ్ళకి తెలివిరాలేదు.

వాళ్ల టెర్రేస్ మీద హిమాయత్‌నగర్లో పబ్లిక్‌గా....ఏమిటి యీ ఆవేశం? కళ్ళులేని ఆవేశం. అర్థంలేని అర్థానికి మైళ్ళకి మైళ్ల దూరంగా ఉన్న ఆవేశం. ఎంతకాలంబట్టో ఉగ్గబట్టుకున్న కోర్కెలు పగ్గాలు తెంచుకుని, ఆకలివేస్తూన్న పెద్దపులి బోనులోనుంచి పారిపోయి కసిగా కనపడిన జంతువుని కొరికేసినట్టుగా....

ఏమిటి? ఎందుకింత ఆవేశం? ఏ కోర్కెల సాఫల్యానికి వాళ్ళిద్దరూ కాచుకూర్చున్నారు? ఏ మధుర క్షణాలకోసం వాళ్ళు కాసుకూర్చునట్టు?.

ఎందు కీ విధంగా ఒకళ్ళ కొకళ్ళు వశం అయిపోయారు? వీళ్ళల్లో ఒక్కరూ ఆశయాల్లాంటి వేమీ ఉన్నవాళ్ళుకారు. ఇద్దరికీ ప్రేమను గూర్చి అభిప్రాయం అంటూలేదు జీవితంలో అవకాశాలు లేక బ్రహ్మజెముడులాంటి పరిస్థితుల్ని అతివాకచక్యంగా దాటుకుని వస్తూన్నవాళ్లు. ఓ మధురమైన ఆవేశానికి లోబడి తమ జీవితాల్ని నిస్సారం చేసుకుంటారా? కసిగా లోకంమీద పడి బతకదలుచు కున్నప్పుడు. వాటికి యీ 'రొమాన్సు' అడ్డంరానా?

ఈ ప్రశ్నలకి సమాధానం రామ్మూర్తి దగ్గరలేదు. సావిత్రి దగ్గర అసలుకన్నాలేదు. ఇద్దరికీ జీవితంనుంచి ఏమికావాలో తెలుసు. అది ఎలా తీసుకోవాలో బాగాతెలుసు. సుఖాన్ని ఎలా పిండుకోవాలో స్వానుభవంతో నేర్చుకుంటున్నారు వాళ్ళు.

ఇంక వాళ్లు ఏమిచేసినా బాధ్యత వాళ్ళదేననే విషయం వాళ్ళిద్దరికీ అతిస్పష్టంగా తెలిసింది. ఏ పరిస్థితుల్లోనైనా ఏ రకంగా మెలగాలో వాళ్ళకి జీవితం నేర్పుతూంది.

ఇంకా వాళ్ళెందుకు వెనక్కి తగ్గాలి? అవును దేనికి తగ్గాలి? చెప్పుచూద్దాం పార్వతీశం అన్నాడు సామి.

'అవును ఎందుకు తగ్గాలి!' అన్నానునేను.

సామీ ఓఖరీదైన నవ్వొకటి పారేసాడు నావైపు. అవాల్టికి కథ అయిపోయిందన్నట్టు.

* * * *

# 14. రెండుచేతులు కలిసినప్పుడు

రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు, ఇద్దరిచూపులు కలిస్తే కథ రాసే వాడికి వెర్రెక్కిపోతుంది. అదేగనక అలవాటుగా సినిమా కథలూ, పాటలూ రాసేవాడైతే. ఆరాత్రీ వేసుకున్నంత ఘాటుగా ఫీలైపోయి ఓ Vat 69 పెగ్ పుచ్చుకున్నంత హాయిగా బాధపడిపోతాడు. అవునా సీతారామారావ్ ?

సామికి తెలిసిన విషయాలే గనక నాకు గనక తెలిసింటే నేనూ ఏదో అయిపోయి ఉండేవాడిననిపిస్తుంది. కానీ కేవలం తెలియటం వలన ఏమిటి ప్రయోజనం? తెలిసిన సంగతి అమలులో పెడితేనేగాని ఎందుకు తెలియటం? ఇదీ ఓ మెరిట్ పాయింట్ చూస్తే, సామి ఇన్‌స్పిరేషన్ ఓ సిగరెట్ దమ్ము. అందుకే ఒక్క సిగరెట్ లాగి ఉన్నాడు

రామ్మూర్తీ, సావిత్రీ యిద్దరూ కలిసి రామ్‌రామ్ సేట్ దగ్గిరికి వెళ్ళారు పొద్దున్నే.

రామ్‌రామ్ చాలా బిజీగా ఉన్నాడనీ, మరో అరగంటదాకా ఎవ్వరినీ చూడడనీ అక్కడఉన్న పని వాడు చెప్పటంతో ఇద్దరూ హాల్లో సోఫాలో కూలబడ్డారు.

ఈ అరగంటలో రావ్‌కూడా అక్కడికివచ్చాడు. 'హలో' అంటే 'హలో' అనుకున్నారు. అంతకుమించి వాళ్ళసంభాషణ ముందుకు పోలేదు. ఇంతలోకే రామ్‌రామ్ ఒకతెల్లటోపీవాలాని బయటకిపంపించి, రావ్‌ని లోపలికి పిలిచాడు. రావ్ అదోరకంగా చూస్తూ లోపలికి వెళ్ళాడు. రామ్మూర్తీ సావిత్రీ ఒకళ్ళవైపు ఒకళ్ళు ఏమీ అర్థం కాకుండా చూశారు. లోపల్నుంచి ఏవో గట్టిగా మాటలు వినిపించాయి. మరో పది నిమిషాలకి రావ్ బయటకు వచ్చేశాడు. ముఖం మటమటలాడుతూంది. దాన్ని దాచుకోవటానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్టు అతను నవ్విన నవ్వునుబట్టి తెలుస్తూంది. నిజానికి రావ్‌కి

తన భావాల్ని దాచుకో గలిగిన శక్తి ఉంది. ఎంత ప్రయత్నించినా దాచుకోలేక పోతున్నాడంటే దానికి కారణం? రావ్ తంత్రానికి గూడా ఒక లిమిట్ ఉందన్నమాట!

సావిత్రీ, రామ్మూర్తీ లోపలికి వెళ్ళగానే రామ్ రామ్ నవ్వుతూ అన్నాడు "మీ రిద్దరూ కలిసి రావటం బాగుంది. మీ రిద్దరికీ కలిసి మెలిసి పనిచెయ్యటం వచ్చిందనుకుంటా....'

'డ్యూటీ అంటే డ్యూటీయే.' అన్నాడు రామ్మూర్తి.

'అవును' అందించింది సావిత్రి.

రామ్ రామ్ రామ్మూర్తి వైపుచూసి సావిత్రితో అన్నాడు. "సావిత్రీజీ రావ్ సాహెబ్‌తో మీరు పనిచెయ్యాలి రేపట్నుంచీ!' అని కొంచెం ఆగి, 'మీ కేమన్నా అభ్యంతరమా?' అని రామ్మూర్తి వైపు చూశాడు.

సావిత్రి రామ్మూర్తి వైపు విసురుగా చూసింది. రామ్మూర్తి ముఖం ముడుచుకోలేదు. కాని, సావిత్రి అనుకున్న 'రియాక్షన్.' రామ్మూర్తిలో రాలేదు. తనకు ఏమీ పట్టనట్టు ఊరుకున్నాడు.

రామ్ రామ్ మాత్రం ఏమీ ఎరగనట్టుగా సావిత్రిని మళ్ళా అడిగాడు. "మీరు ఒకవేళ పనిచెయ్యదలుచుకోకపోతే?'

'నాకు అటువంటి అభ్యంతరాలు ఏమి లేవు.'

రామ్మూర్తి యిటూ అటూ చూస్తూఉంటే రామ్ రామ్ అన్నాడు. "మీరు ఏదో చెప్పాలనుకుంటున్నారు....'

'ఏమీ లేదు....'

'సరే, అయితే మీరు నాకు సాయంత్రం ఆరుగంటలకి ఫోన్ చెయ్యండి.... సావిత్రీజీ, మీరుఏడుగంటలకి రావ్‌సాహెబ్‌ని సికింద్రాబాద్ స్టేషన్‌లో ఫస్ట్‌క్లాస్ వెయిటింగ్‌రూమ్ దగ్గర కలుసుకోండి.' అని గడియారం చూసుకున్నాడు.

రామ్మూర్తి, సావిత్రీ- యిద్దరూ బయటికి వచ్చేశారు. సావిత్రి రామ్మూర్తిని ఏమీ అడగలేదు. గబ గబా నడచి బస్ ఎక్కారు. "మీతో మాట్లాడాలి.' అన్నాడు రామ్మూర్తి.

'ఏ ముంది మాట్లాడటానికి?' అంది సావిత్రి.

'చెబుతాగా.... అయినా మీకు మాట్లాడాలని లేకపోతే....'

'అదేంకాదు. పదండి వెళదాం.'

వాళ్ళు బస్ దిగి రామ్మూర్తి యింటికి వెళ్ళారు. పనివాడు 'టీ' చేసి తీసుకొచ్చాడు. రామ్మూర్తి సావిత్రివి అతి తీవ్రంగానూ, ఒక్కోక్షణంలో అతి దీనంగానూ, మరోక్షణంలో ఏమీ అంతు చిక్కని భావాలతోనూ చూస్తున్నాడు. సావిత్రి మాత్రం ఏమాత్రం చలనం లేకుండా కూచుంది. ఆక్షణంలో సావిత్రి ఏమనుకుంటూందో అంతు చిక్కలేదు రామ్మూర్తికి.

'మనం అవసరమైన పనిమీద ఏదైనా ఊరువెళ్ళ దలుచుకున్నప్పుడు. మనదగ్గర విమానం మీద వెళ్ళగలిగినంత డబ్బు లేకపోయినప్పుడు రైల్లోనే వెడతాం. అది కూడా యింకొకళ్ళ డబ్బుతో.'

'మీరు చెప్పదల్చుకున్నది వేరు. చెబుతూన్నది వేరు.'

రామ్మూర్తికి సావిత్రి చెబుతూన్నది వినాలని లేదు. ఒకళ్లు చెబుతూన్న మాటలు మరొకళ్లు విన్నా, దులిపేసుకుని పోవాలిగాని పట్టించుకోగూడదు.

రామ్మూర్తికి అనుమానం వేసింది. సావిత్రి యింక తనతో ఎక్కువ కాలం ఉండ దేమోనని సావిత్రి కాకపోతే మరొకరు. మరొకరు కాకపోతే మరొకరు.........

'చూడండి మీరు రావ్‌సాహెబ్‌ని ఎందుకు అసహ్యించు కుంటున్నారు?'

'నేను ఎవర్నని మీ ఉద్దేశం?'

సావిత్రి అన్న మాటల్లోకన్న అనే పద్ధతి అనోచితంగా అనిపించింది. సావిత్రి చేత చేయించ వలసిన పను చాలా ఉన్నాయి. అవిలోనే హంసపాదైతే ఎలా? ఇప్పుడేగనక తన వైపుకు తిప్పుకో లేకపోతే యిక లాభంలేదు. ఏది మంచీ, ఏది చెడ్డా, అన్న సంశయం వచ్చినప్పుడు, ఏది మనకు మంచిదో అది చెయ్యటం మంచిది. మంచిది అంటే, మనకు మంచిదా కాదా అన్నదే కాని మరేంకాదు. ఇంకొకళ్ళు దీన్ని ఎలా చూస్తారూ అని గనక ఆలోచిస్తే, మనం యింకొకళ్ళకి పనికొచ్చేలాగ తయారౌతాం.

మనం మనకి పనికిరావటం ముఖ్యం. దానికి ఇంకొకళ్ళు మనల్ని వాడుకోకుండా చూడటం అత్యవసరం. మనకు కలిసిన వాళ్ళందరూ మనకి పనికిరావాలి. వాళ్ళను కసిగా ఉపయోగించుకోవాలి—అను కున్నాడు రామ్మూర్తి. మననం చేసుకున్నాడు.

'మీరు రావ్ సాహెబ్‌తో ఓచిన్న నాటకం ఆడటం మంచిది.' అన్న రామ్మూర్తి మాటవి పట్టుకుని నాటకమా? అని అదోలా చూపింది సావిత్రి.

'అవును, నాటకం' అని నొక్కి-నొక్కి అన్నాడు. 'మనకు కావలసింది మనకు చేతిలోకి వచ్చేదాకా మనం ఒక పద్ధతిలో ఉండాలి'. 'అంటే?'

'మనకు కావలసినవి మనచేతుల్లోకి వచ్చేదాకా మనం ఎదటి వాళ్ళకి లొంగినట్లు మసలులోవాలి. దొరికిన మరుక్షణం మనం వాళ్ళని ఖర్చురాసి పారెయ్యాలి. నిన్నటి వార్తాపత్రికలలాగ విసిరి పారెయ్యాలి....'

రామ్మూర్తి మాట్లాడుతున్నాడన్న మాటేగాని తను సావిత్రికి నిజంగా నచ్చజెప్పుతున్నాడో లేదో అనుకుంటున్నాడు. సావిత్రి మౌనంగా వింటోంది. సావిత్రికి వేరేమార్గం లేదని సావిత్రికీతెలుసు.

సావిత్రిని మళ్ళీ ఏమీ చెప్పనివ్వకుండానే అన్నాడు రామ్మూర్తి. 'రావ్‌ని గనక పక్కకు తప్పిస్తే ....'

సావిత్రి కళ్ళు మెరిసాయి. ఒక్కసారి....ఎంతోకాలం బట్టీ దాక్కున్న కోర్కెలు గుప్పునపొంగి ఉక్కిరి బిక్కిరి చేసేశాయి. మరేమీ మాట్లాడకుండా ఒక్కసారి లేచి నిల్చుంది. రామ్మూర్తిలో ఆశ్చర్యం కలిగినా, దాన్ని కనిపించనియ్యకుండా ఓ ముసుగుకప్పాడు.

రామ్మూర్తి ఏ విషయం చెబుదామని యిన్నిరోజుల బట్టీ అను కుంటున్నాడో ఆ విషయం తను చెప్పకుండానే అర్థం చేసుకుంది సావిత్రి. సావిత్రిచేత తను చేయిస్తూన్న పని, నిజానికి తనంతట తానుగా చేస్తూన్నట్టు అనిపించింది సావిత్రికి.

'సావిత్రికి యీ విధంగా ఎందుకు అనిపించింది చెప్పు మధు సూధనరావ్' అన్నాడు సామి.

'సావిత్రికి రామ్మూర్తి అర్థంకాక !'

'నీకు అర్థం అయ్యాడా రామ్మూర్తి పోనీ ? రామ్మూర్తీ, సావిత్రీ యిద్దరూ కలిసినప్పుడు ఊరుని కొనెయ్యగలరు. తగలెయ్యగలరు. ఇద్దరూ వెనక పూచికపుల్లలేనివాళ్ళు. ఇద్దరికీ కావలసింది ఏమిటి ? లోకాన్ని లూటీచేసే ఉపాయం. అది దొరికిందంటే ఇంక ఏంకావాలి ?' నాకు కూడా కావలసింది అదే !'

'ఊఁ.... నాకు తెలియదూ ఘనశ్యామ్ నీ బుద్ధి ! రామ్మూర్తికి యింక చిక్కులు వచ్చినా ఫర్వాలేదు. సావిత్రిగనక రామ్మూర్తికి ధోకా ఇవ్వకపోతే....'

'ఎలా యిస్తుంది సార్ ?'

'తెలిసిందికదూ సంగతి. ఇప్పుడు నీకూ తెలుస్తూంది.'

'సామి నన్ను ఎప్పుడూ అన్యాయంగా జమకట్టలేడు....

రామ్మూర్తి కథతెలుసుకుంటాననిచెప్పి చివరికి యిది 'సెల్ఫ్ డిస్కవరీ' అవుతుందేమోననే అనుమానం కలుగుతూంది. అదీ ఒకందుకు మంచిదే అనిపించింది మళ్ళీ.

సామి కుర్చీలోంచి లేచాడు అప్పటికి కథ అయిపోయిందన్న మాట. రాబోయే రోజుల్ని తలచుకుని సంబరపడటంకన్న వేరే మార్గం కనిపించలేదు.

*   *   *   *

## 15. పోటీలేని లూటీ

'నువ్వు చేస్తూన్న ఉద్యోగం యింకా ఎంతకాలం చేద్దామని ?'

సామికి నామీద ఆగ్రహం వచ్చిందో, అనుగ్రహం వచ్చిందో తెలియదు. మొత్తానికి నా ఆషాడభూతి శిష్యరికం కొంతలో కొంత రాణించినట్టే. రామ్మూర్తి దగ్గర శిష్యరికం చేసి చేసి సామి ఒక బిజినెస్ మేన్ అయ్యాడు. నేను యీ టక్కుటమార విద్యలూ నేర్చుకోవాలంటే కేవలం కథ వింటూ కూచోటంవల్ల ఏమీ జరగదని

నాకూ తెలుసు. కాని, నాకూ సామికీ మధ్యన యీ కథ ఒక బ్రిడ్జి లాంటిది. అందుకే నా ఉద్యోగం సంగతి అడగ్గానే నేను అను కుంటూన్న విషయం ఓరకంగా నిజం అయిందనిపించింది.

'నేను ఉద్యోగం చెయ్యాలని చెయ్యటం లేదు.'

సామి కొర కొరా చూసాడు. మళ్ళీ సన్నగా నవ్వాడు.

'చూడు జోషీభాయ్, నువ్వు కావాలని ఉద్యోగం చెయ్యటం లేదు. ఆ ఉద్యోగమే నిన్ను చేస్తోంది. నువ్వు గనక ఉద్యోగంచేసి ఉంటే. నిన్ను ఉద్యోగం చెయ్యదు. అందుకే నువ్వు యింకా ఇలా అలాటపాగా, చిత్రిక పట్టని చెక్కలాగ ఉన్నావ్.'

'నువ్వు అమాయికుడివి కాదు. అది నీకూ తెలుసు. అసలు అమాయికుడంటూ ఎవ్వడూలేడు. అంతా నాటకం. కొందరికి అవ కాశాలు వస్తాయి. అంటే కొందరిని అవకాశాలు వెదుక్కుంటూ వస్తాయి. వాళ్ళనించి సమస్యలు ఆమడదూరం పారిపోతూన్నట్టు కనిపిస్తాయి. కాని, కిటుకు ఏమిటంటే. నీళ్ళ సమస్యలకి పరిష్కారం వెదకటంలోనే వాళ్ళ సమస్యలు తీరుతాయి, ఎదటివాడు లూటీచేద్దా మని వచ్చి లూటీ అయిపోవటం అంటే ఏమిటో తెలుసుకో!

'రామ్మూర్తి అహాళ సాయంత్రం ఆరుగంటలకి సేట్‌కి ఫోన్ చేశాడు. ఫోన్ చేసేటప్పుడు రామ్మూర్తి పక్కన సావిత్రి ఉంది. రామ్ లామ్ మాటలు ఆందోళనగా ఉన్నాయి.

'మీరు సావిత్రీజీని కలుసుకోవాలి వెంటనే.'

'ఆవిడని ఏడు గంటలకి రావ్‌ని కలవమన్నాను. కాని కలిసే ముందర ముఖ్యంగా కొన్ని విషయాలు చెప్పాలి....'

'ఊఁ....'

'ఆ మాటలు వింటున్నట్టేగా.... మీరు యింట్లోనే ఉండండి. నే నే వస్తున్నాను అరగంటలో. ఈ లోగా సావిత్రీజీని కలుసుకుని మీ రున్న చోటికి రప్పించండి. తర్వాతనే అవిడ వెళ్ళవలసింది....'

'ఓకే.'

'ఫోన్ పెట్టెయ్యొచ్చు యింక.'

సావిత్రి ముఖంలో ఏదో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది.

ఫోన్ క్రాడిల్‌లో పెట్టెయ్యగానే రామ్మూర్తి అన్నాడు. 'మీరూ, నేనూ అనుకున్నవన్నీ అవటానికి ఆట్టేకాలం పట్టేలాగలేదు....'

'అంతా గడబిడగా ఉంది నాకైతే....'

'ఒక్క అరగంట ఆగండి....'

'ఆ మాత్రం ఓపిక పట్టగలను లెండి....'

బయట కారు చప్పుడైంది. పనిచేసేవాడు గబ గబా లోపలికి వచ్చి సేట్ వచ్చాడని చెప్పడం, రామ్ రామ్ లోపలికి రావటం యించుమించు ఒకేసారి జరిగాయి. లోపలికి రాగానే, ఇంట్లో యింకా ఎవరున్నారు....?' అన్నాడు.

'సావిత్రీజీ.'

'మనం మాట్లాడాలి. చాలా జరూరు....'

అదే క్షణంలో వాళ్లు ముగ్గురూ ఒకేచోటికి వచ్చేశారు. రామ్మూర్తి సావిత్రిని పక్కకు పిలిచి చెవిలో ఏదో ఊదాడు.

'మీకు తెలిసిందిగా యిప్పుడు?'

ఇంక ఒకళ్ల కొకళ్లు చెప్పవలసిందేమీ లేదనిపించింది.

మర్నాటి పొద్దున్నే రావ్‌సాబ్ సేట్ దగ్గరకు వచ్చాడు. అప్పటికే సేట్ చాలా 'బిజీ'గా ఉన్నాడు. రావ్‌ని చూసి కూచో మన్నాడు. రావ్ ఎందుకో చాలా ఆందోళనగా కనిపిస్తున్నాడు. ఒక్క పదినిమిషాల్లో సేట్ కాగితాలు ఒక ఫైల్లో పెట్టి రావ్ ముందర పెట్టాడు.

రావ్ మొట్టమొదటిసారిగా కొంచెంజంకాడు ఎందుకో. 'రాత్రి జరగవలసినట్టుగా ఏదో జరగలేదు....' రావ్ ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది.

'మీరు ఎవరితో ఎలా ఉన్నారో నాకు అనవసరం....' అని కొంచెం ఆగి అన్నాడు మళ్ళీ సేట్. 'మనతో పనిచేసే వాళ్ళతో మీరు అరకంగా ప్రవర్తిస్తారని నేను అనుకుంటే....'

'మీకు ఎవరో పొరబాటుగా చెప్పారు....నేను అటువంటి పనులు....'

సేట్ రివాల్వర్ లాగి ఒకఫైర్ తీశాడు. గజకంత్రీ రావ్

సాహబ్ ఒక్కసారి ఒణికిపోయినట్టయ్యాడు. 'ఈఫొటోల్ని కూడా పొరబాటే అనరాదూ ?'

'బ్లాక్ మెయిల్....' అవి అరవబోతూంటే సేట్ నోటికి రుమాలు అడ్డంపెట్టాడు. 'ఇంకమీరు యీ పరిస్థితుల్లో నాతో పని చెయ్యటం కుదరదు....'

రావ్‌సాబ్ ఒక్కసారి లేచాడు, సేట్ బెల్ నొక్కటం, రామ్మూర్తి లోపలికి రావటం ఒకేసారి జరిగాయి. క్షమించాలి.... మళ్ళీ వస్తానని బయటకు వెళ్ళబోతూంటే సేట్ ఆగమన్నాడు రామ్మూర్తిని.

'మీరు యికనుంచి రావ్‌సాహబ్ చేసేపని చెయ్యాలి.'

'ఓ....'

'ఇదంతా మోసం ? పచ్చిమోసం.'

'ఏది మోసం ?'

'ఏదికాదు ? రాంరాం సేట్ ! మనం చేస్తూన్న గొటాలా బిజినెస్‌లోంచి యీనాడు నన్ను తప్పించాలనుకున్నా తప్పించలేరు. ఈ చిక్కుల్లోంచి బతికుండగా బయటపడలేరు ఎవ్వరూ. నన్ను వదలుకుంటే నీ ట్రేడ్‌సీక్రెట్స్ పోలీస్‌స్టేషన్లో, తర్వాత కోర్టులో. ఆలోచించుకోండి ! అయిదునిమిషాల వ్యవధి ఉంది....'

ఇంతలో తలుపుని సన్నగా కొట్టారు ఎవ్వరో. అవాళ పనివాడు అక్కడలేడు. ఆవిధంగా తలుపుకొట్టి లోపలికి రావటం ఆ బంగళాలో ఎప్పుడూ జరగనిపని. 'నేను రావచ్చా ?' అంటూ లోపలికి వచ్చేసింది సావిత్రి.

రామ్‌రామ్ యింతగా తెగిస్తాడనీ, యింత వెంటనే తనని వదులుకుంటాడనీ అనుకోలేదు రావ్‌సాహబ్, రామ్మూర్తినీ, సావిత్రినీ చూడగానే రావ్‌కి అర్థమైంది - ఇది 'కాన్స్పిరసీ కుట్ర' అని.

రావ్ యీ విషయాలన్నీ ఆలోచించేలోపలే సేట్ రివాల్వర్ తీసి పక్కనేపెట్టాడు. పైలుతీసి 'ఈ కాగితాలపైన సంతకాలు పెట్టండి....'

రావ్‌కి ఒక్కక్షణం తలతిరిగినట్లయింది. ఎదురుగా రివాల్వర్. తనదగ్గిరా ఎప్పుడూ ఉంటుంది రివాల్వర్. అది బయటకు ఎక్కడికివెళ్ళినా ఆతనివెంట ఉంటుంది. సేట్‌దగ్గరకు వస్తూమాత్రం రావ్ దాన్ని తీసుకురాలేదు. దాని అవసరం కలుగుతుందని అనుకోలేదు గనక. ఆ గిలాలిమీద వందేళ్ళు పెట్టుకపోతే?

"ఏమౌతుందో మీకు తెలుసు"

రామ్మూర్తి ఆ రివాల్వర్ పుచ్చుకుని సావిత్రివైపు పరధ్యాన్నంగా ఉన్నట్లు చూశాడు. రివాల్వరు దగ్గర ఉన్నట్లయితే షూట్ చెయ్యటానికి యింతకన్న మంచి అవకాశం రాదు. జేబులు వెతుక్కో బోతూంటే రామ్మూర్తి ఒక సిగరెట్ వెలిగించి, రివాల్వర్‌తో కాగితాలవైపు చూపించాడు. సావిత్రి ఏమీ తెలియని గోవులాగ చూసింది. రావ్ తలుపువైపు చూశాడు. తలుపులు వేసివున్నాయి.

టెలిఫోన్ మోగింది. ఒక్కసారి సేట్ కదలబోయాడు. సావిత్రివైపు సంజ్ఞచేశాడు సావిత్రి టెలిఫోన్ తీసుకుని 'మెసేజ్' నోట్ చేసుకుంది.

'మీ ట్రిక్స్ నాకు తెలుసు.

'ఆఫ్‌కోర్స్'

రామ్మూర్తి రివాల్వర్ 'లోడ్' చేసివుందని చెప్పటంకోసం పైకి చూపించి ఎదురుతిన్నప్పుడు ఏమైనా 'షూట్' చేస్తేట్టు సంజ్ఞ చేశాడు.

'రివాల్వరు లోడ్ చేసివుందని తెలుసు.'

'మరెందుకు ఆలస్యం?'

ఒక్క ఊపులో రావ్ రామ్మూర్తి చేతిలో రివాల్వర్ లాక్కోడానికి ప్రయత్నించాడు. రామ్మూర్తి ఒక్కకుదుపులో విదల్చుకుని బయటపడ్డాడు.

రాంరాం పక్కజేబులోంచి మరో రివాల్వర్ తీశాడు. సావిత్రి గబుక్కున దాన్ని అందిపుచ్చుకుంది. రావ్‌కి కళ్ళు తిరిగాయి. వీళ్ళు ముగ్గురూకలిసి తనని తప్పించేస్తున్నారన్న సంగతి తెలుసుకుని షాక్ తిన్నాడు.

'ఏవి కాగితాలు' అవి కాగితాలన్నిటిమీద సంతకాలు పెట్టే వాడు. 'అందులో డబ్బుఉంది. అప్యాకెట్ తీసుకోండి. అప్పు డప్పుడు కలిపిస్తూఉండండి. ఇన్నేళ్ళబట్టీ మనయిద్దరిమధ్య ఉన్న వ్యవహారాలు బయటపడకూడదు....పడితే!....'

కాగితాల్లో ఏముందోనని రావ్ అడగలేదు. అది ఏదైనా తప్పనప్పుడు ఎందుకు తెలుసుకోవటం? రావ్ బయటకి వెడుతూ సడన్‌గా ఒక్కసారి మళ్ళా వెనక్కుతిరిగాడు. ఇదేమీ డిటెక్టివ్ కథ కాదు. గబగబా బుల్లెట్లు దూసుకుపోవటం. చివరిసీనుకి పోలీసులు రావటం—ఏమీలేదు.

జీవితంలో డ్రామా, మెలోడ్రామా ఉన్నా, అవి చప్పగానే ఉంటాయి చాలామంది బతుకుల్లో రావ్‌కి ఎన్ని ఆలోచనలు వచ్చినా, అన్నిటినీ వెంటనే మింగేసి బయటపడ్డాడు.

అన్నీ తెలిసిన మహాజ్ఞానిలాగ రావ్ తప్పుకున్నాడు. రాం రాంకి గాని రామ్మూర్తికిగాని రావ్ ఎందుకు అంత ఇదిగా తప్పు కున్నాడో తెలియలేదు. రావ్ వెళ్ళిన పదినిమిషాలదాకా ఎవ్వరూ అక్కడనుంచీ కదల్లేదు. సావిత్రి మాత్రం కళ్ళు అప్పగించి చూస్తూ నిల్చుంది.

రామ్మూర్తి రాంరాం వైపు అదేపనిగా చూశాడు. రాంరాం చూపులు పక్కకు తిప్పాడు. సావిత్రి మాత్రం పుల్లలు పీకేసిన గూడులాగ చూస్తూంది. ఏమిటి వీళ్ళ ఉద్దేశం? ఎవర్నయినా పూచిక పుల్లలాగ తీసి పారెయ్యగలగటం అంటే ఏమిటో చూస్తూంది కళ్ళ ముందర సినిమాలాగ.

'ఇందులో జరిగిన తమాషా ఏమిటి కేశవరావ్ చెప్పు?' అన్నాడు సామి.

నేను ఏ ప్రశ్నకీ సమాధానం చెప్పలేనని తెలుసును గనకనే అంత ధీమాగా అన్నాడు. ఏ ప్రశ్నకీ నాదగ్గర సమాధానం లేదని తెలుసు సామికి. అందుకే నన్ను కీలకమైన ప్రశ్న అడగటం. అంతకుముందే సంఘటనని ఒక క్రయిసిస్‌లో వదలి పెట్టటమూను.

'రావ్ యింత కంత్రీ. యింతకాలంబట్టీ సేట్‌తో యీగొటాలా వ్యాపారం చేస్తున్నాడు గదా మరి యింత తేలికగా లొంబడిపోయి, వెళ్ళిపోయాడు. ఎందుచేత? రావ్‌కి ఎన్ని రహస్యాలు తెలిసినా, సేట్‌కి కూడా రావ్‌ని గూర్చి అన్ని సంగతులూ తెలుసు. బయట పడటంవలన లాభం లేకపోగా ముందర ముందర నష్టంకూడాను. అది గాకుండా, సేట్ యిచ్చిన డబ్బుకాక రావ్ బాగా సంపాదించాడు. అందువల్ల ఆ మాత్రం మర్యాద ఉండగానే తప్పుకోవటం మంచిదని పించింది. అయినా రావ్ ఎందువల్ల తప్పుకున్నాడో తెలిసిందా?'

'ఒక రకంగా తెలిసింది. మరో రకంగా తెలియలేదు'

'నువ్వు ఆ తెలిసీ తెలియని స్థితిలో ఉండటమే మంచిది' రావ్ దగ్గర అన్ని నక్కజిత్తులు ఉన్నా, సేట్‌కి లొంగిపోయినట్టు నటించాడు. రామ్మూర్తి యీ కలిసివచ్చిన అవకాశాన్ని జారవిడవ లేదు. సావిత్రి రామ్మూర్తిని అంటుకునే ఉంది.

రామ్మూర్తి రావ్ చేస్తూన్న పనిలో మునుపే తర్ఫీదు అయ్యాడు గనక టక టకామని నెలల్లో రహస్యాలన్నీ యించు మించు తెలుసు కున్నాడు.

'రామ్ రామ్ సేట్‌కి తలలో నాలికలాగ మెలుగుతూ....'

'ఆగండి ఒక్క నిమిషం. మీరు ముఖ్యమైన వాట్లని దాటిం చెయ్యకండి!' అన్నాను.

సామి పక పకా నవ్వబోయి ఆపుకున్నాడు, 'నీకు అన్నీ చెప్పేస్తానని నేను ఎప్పుడూ చెప్పలేదే? రామ్మూర్తిని నేను 'బ్లాక్ మెయిల్' చేస్తానా? రావ్ దగ్గరనుంచి రామ్మూర్తి ఏ రకంగా చేతి పంటీ కొట్టేశాడో నేను రామ్మూర్తి దగ్గర్నుంచి ఏవిధంగా కొట్టేసి పైకి వచ్చిందీ అంతకన్నా చెప్పను. రామ్మూర్తి చవలాయి కాదు. నేను సరే సరి. నేనూ నీకు ఎంచక్కా తాంబూలంలో పెట్టి కండువా కప్పి ఏదో యిస్తాననుకోబోకు.'

నేను అటూ యిటూ చూసి, గుర్రుమిటకరించి ఊరుకున్నాను.

* * * *

# 16. ఈకథకి ముగింపు లేదు గనక లేదు

నన్ను గురించి నేను చెప్పుకో గూడదు గాని. నేను కూడ ఓ రకంగా కంత్రీని. నాకంటా కంత్రీగా ఉండేవాళ్ళు వీథి వీథికీ. చెత్త కుండీ చెత్తకుండీకీ, ప్రతి ఎలక్ట్రిక్ పోల్‌కీ మధ్య తెగిన వైర్లల్లాగ రోడ్డువెయ్యక ముందు అషామాషీగా పడి ఉన్న కంకర్రాళ్లల్లాగ కొట్టుకుంటున్నారు. వాళ్ళ పేర్లు అవీధిచరిత్రలోకి గూడా ఎక్కవు.

నేను పైకి రాని కారణం నాకు కంత్రీతనం లేకకాదు, నాకున్న కంత్రీతనం నాకుంది. కాని అది చాలదు. అందుకే ఆవాళ సామి.

'తాళాలు తయారుచేసే వాళ్ళకన్న, తాళాలు పగలగొట్టేవాళ్ళు గొప్పవాళ్లు. ఎందుకో తెలుసా?' అనంగానే నేను గాబరాపడక పోయినా, కొంచెం కంగారు పడటనిపించింది.

'తాళాలు పగలగొట్టటానికి ఒక ప్రత్యేకమైన టెక్నిక్ ఉంది, తాళాలు తియ్యడానికి తాళం చెవులు కాకుండా తెలివితేటలు ఉపయో గించినప్పుడు ఏంజరుగుతుంది? అయినా తాళంచేతులు ఉపయోగిం చక్కర్లేదంటే. తాళాలు పగల గొట్టటంచేతనౌ నన్నమాట,

'రామ్మూర్తి, రావ్‌ని మింగేసి రామ్ రామ్‌ని మింగెయ్యటానికి రెడీగా ఉన్నాడు. ఒకడిని మింగిన తర్వాత మరొకడిని మింగటం ఏమంత కష్టమైన పనికాదు, అసలుమింగెయ్యటం మనం తిమింగలం నుంచి నేర్చుకోవాలి....'

'మనుషులుకూడా మనుషుల్ని మింగేస్తున్నారు గదా?'

'నీకూ తెలుసు. నాకూ తెలుసు. కాని. ఎలా మింగెయ్యటం అన్నదే మనకు కావలసింది. ఎదటివాడు మనల్ని మింగెయ్యకముందే మనం వాడిని మింగెయ్యాలి. అదీ అందులో ఉన్న రహస్యం....'

'వాడు మింగనిస్తే కదా?'

చిన్నచేపలు పెద్దచేపల నోట్లోకి ఎలావెడతాయి లోహితాస్యా ఆలోచించావా? 'చిన్నచేపకి తను పెద్దచేపకి టిఫిన్ అయిపోవాలని

ఉండదు. పెద్దచేపకి అంతకన్న మరో పెద్ద కంత్రీచేప పొట్టలోకి పోయి 'ఖతం' అయిపోదామని ఉండదు. ఏ మేకకీ గొర్రెకీ కైమా అయిపోదామని ఉండదుగదా? ఏ కోడికైనా పిల్లలుకావలసిన తన గుడ్లని ఆమ్లెట్లుగా వేసుకుని పెప్పర్, సాల్ట్‌తో నంచుకుని తినేస్తున్నారని తెలిస్తే ఏ కోడితల్లి గుండె చెరుక్కుపోదు?

ఎవడిని తినేస్తే ఎవడికిజాలి? వాడిని వీడు తినెయ్యకపోతే, వీడే వాడిని నమిలేస్తాడు.

రామ్మూర్తి మీద వ్యాపారం అంతా వదిలి ఒక్కసారిగా రామ్ రామ్ వెళ్ళిపోలేదు. సావిత్రి రామ్మూర్తికి బిజినెస్ పార్టనర్‌గా మారినప్పటినుంచీ రామ్మూర్తికిభార్యగా మారిపోదామని ప్రయత్నించింది.

బిజినెస్‌లో తనతో కలిసివున్న సావిత్రి జీవితాన్ని పంచుకుంటానంటే రామ్మూర్తి ఒద్దేసుకుంటాడా? అయినా సావిత్రిని వదులుకుంటాడా? అంతుచిక్కనియ్యడు.

సావిత్రి రామ్మూర్తికి దూరం అయిపోలేదు. రామ్మూర్తి రానిచ్చినంత దగ్గరగానే రాగలిగింది అంతే. రామ్మూర్తినివదలి రామ్‌రామ్‌సేట్ ఒకసారి కలకత్తా వెళ్ళాడు అంతే. మళ్ళీ వచ్చేసరికి ఒక తమాషా జరిగింది.

రామ్‌రామ్ తిరిగి వచ్చేసరికి రాం రాం అయిపోయింది.... ఇటువంటి వ్యాపారాల్లో బ్యాంకుల్లో డబ్బు నిలవ ఉంచరుగదా? 'ఎక్కడ ఉంచుతారు' అని అడగక! అటువంటి ప్రశ్నలు నువ్వు అడగకు. ఈ లావాదేవీల్లో సేట్ చేతుల్లోంచి రామ్మూర్తి చేతుల్లోకి తాళంచేతులు వచ్చేశాయి.

రామ్‌రామ్ గనక రావ్‌ని వదులుకోకపోతే ఏం జరిగేది? రావ్ గనక రాంరాంని ఉల్లరిపెట్టి ఉంటే ఏం జరిగేది? రావ్ రామ్మూర్తిని గూండాలచేత తన దారిలోంచి తప్పించేసి ఉంటే ఏం జరిగేది? సావిత్రిగనక సేట్‌కి ఆఖరుక్షణంలో ఎదురుతిరిగి వుంటే ఏం జరిగేది?

రామ్‌రామ్ రామ్మూర్తిని దారిలోంచి తీసేస్తే ఏంజరిగేది? ఇవన్నీ జరిగిన తర్వాత సావిత్రి పళ్ళికిలించి నువ్వెవరవని దబాయించి,

'బ్లేక్ మెయిల్' చేసి డబ్బులు రాలగొట్టుకు పోతేనో ? అప్పుడు సామి అనే మరో మునిసిపాలిటీ చెత్తడబ్బా దొరక్కపోతే ?'

'అయితే రామ్మూర్తి సేట్ డబ్బా వ్యాపారం నిర్దాక్షిణ్యంగా పుచ్చేసుకున్నాడా ఏమిటి ఖర్మ ?'

'ఖర్మ ఏంలేదు యిందులో. ఇది లోకధర్మం. నువ్వు 'హిప్‌పాకెట్'లో పర్సు పెట్టుకు తిరిగి, యింటికి వచ్చేలోగా ఎవడో కొట్టేశాడని ఏడిస్తే ఎవడి తెలివితక్కువ తనం గనక ? జుట్టు తడుపుకుని కాస్త మేధకుడిగా కనిపిస్తే ఇంగిత జ్ఞానంఉన్న మంగలివాడు వదిలిపెడతాడు గనక ?

'మీరు అనవసరమైన విషయాల్ని కాస్తా దాటిస్తున్నారు !'

'నీకు యీకథ పూర్తిగా ఎవ్వరూ ఎప్పుడూ చెప్పరు. నువ్వు మరీ తంటాలు పడుతున్నావు గనక నీకు మరికొన్ని సంగతులు చెబుతాననుకో. అన్ని సంగతులూ నీకు చెప్పకపోవటానికి కారణం నాకుకూడా తెలియదు గనక. మరోసంగతి. రామ్మూర్తి మనమధ్యనే ఉన్నాడు, మంచి టావ్‌లో ఉన్నాడు. నా బతుకు రామ్మూర్తితో కలిసి ఉంది. ఏదో ఒక క్షణంలో నన్ను మెల్లిగా పట్టుకుని నన్ను ఒప్పించావు. ఎందుకు ఒప్పుకున్నానో నాకే తెలియదు. బహుశః నాలోకూడా యీకథ యింకొకళ్ళకి చెప్పాలనే కోరిక తహతహగా మారి ఉండాలి. లేకపోతే, నువ్వు ఎవడో ఏదో అడిగాడని మొదటి నుంచి ఏకరువు పెట్టడం బుద్ధిఉన్నవా డెవడూ చెయ్యడు.

నీకు అంత మనసుగా ఉంటే రామ్మూర్తి దర్శనంకూడా చేసుకుందువుగాని ? కాని నువ్వు ఏం కావాలని అనుకుంటున్నావో అది మాత్రం దొరకదు. నీకు కావలసినది నీకు నువ్వే సంపాదించుకోవాలి. ఇది వేదాంతంకాదు, రాయుడూ. కేవలం లౌక్యం.

రామ్మూర్తితో గూడా పరిచయం అవుతుందని తెలియగానే నాకు కావలసిన దానికన్నా మరోటన్ను సంతోషం కలిగింది. నిజంగా రామ్మూర్తీ గనక కలిస్తే ఏం అడగను ?

నా ఆలోచనలు తోసుకువివచ్చాయి. నన్ను ఒక్కసారి తోసుకువచ్చాయి. ఈలోగా సామి అన్నాడు—

రామ్ రామ్ కలకత్తానుంచి కొంచెం ఆలస్యంగా వచ్చాడు. వెళ్ళేటప్పుడు చాలా ముఖ్యమైన వ్యవహారాలు అప్పచెప్పి వెళ్ళాడు. రామ్మూర్తి చాలా నమ్మకంగా ఉన్నవాడుగనక ఏమీ ధోకాలేదను కున్నాడు. కాని నమ్మకం అన్నది ఘనపదార్థమా ఖాయిా ?

'కాదు.'

'నిన్ను నేను నమ్మాలంటే నాకు కొన్ని నిదర్శనాలు కావాలి. అవునా ? కాని అన్నివిధాలుగా నమ్మకం కలిగినతర్వాత ఏదో ఒక క్షణంలో మనిషి మారిపోతే ? మారిపోతే ఏమిటి ? ఎందుకుమారడు గనక ? 'రామ్ రామ్ వచ్చేసరికి రామ్మూర్తి పద్ధతిలో మార్పువచ్చినట్లు కనిపించింది. రామ్ రామ్‌కీ వయస్సు ముదిరింది. ఈ షాక్ తట్టు కునేలోపల గుండెనొప్పి వచ్చి చచ్చిపోయాడు. ఎంత వీలుగావుంది నరసింహారావ్ ?'

డబ్బున్న ప్రతివాళ్ళూ, ఓ బుద్ధిమంతుణ్ణి చేరదీసి వ్యవహారా లన్నీ అప్పగించి వీలుగా గుండెనొప్పివచ్చి తప్పుకోగూడదూ ?

'ఎంతాశోయ్ సుబ్బిశెట్టీ ? నా దగ్గరగనక నిన్ను చేరదీస్తే మా యింట్లో నేను చేసుకునే బ్లేడుతోనే నా జేబు నాకే తెలియకుండానే కోసెయ్యగల 'ట్రైనింగ్' నీకు వచ్చేసింది.

సామి నాలో వస్తూన్న మార్పు పసిగట్టేశాడు. నేను ఎంత ఆషాడభూతిగా నటించినా, నాలోని ఆషాడభూతిత్వాన్ని ఆ తత్వాన్ని వంటబట్టించుకోటానికి సామే 'యిన్‌స్పిరేషన్' గనక నా పాచిక పారదు. 'మీ దగ్గరనుంచి నేను ఏం తెలుసుకున్నానన్నది నేను బాగు పడటం మీద ఆధారపడి ఉంటుంది....'

'ఉపన్యాసం మొదలు పెట్టటం లేదు కదా ? రామ్మూర్తి దగ్గరకి నిన్ను తీసుకు వెడతాను. రేపు పొద్దున్నే కనిపించు....'

సామి గనక నన్ను రామ్మూర్తి దగ్గరకు తీసుకువెడితే ఎంత బాగుంటుందో ఊహించుకోలేక పోయాను. సామిదగ్గర నేనుచేస్తున్న శిష్యరికం తప్పకుండా పనికి వస్తుంది. అది నాకు తెలుసు.

ఈకథకి ఒక మొదలులేదు. ఒక చివర అంటూ లేదు. నేను వేసే ప్రశ్నలకి ఒక అర్థంలేదు. నాజీవితం ఏరకంగా మలచుకుండా

మని నా ప్రయత్నం? ఏరకమైన భవిష్యత్తు కోసం నేను కలగం టున్నాను? రామ్మూర్తి, సామి, సావిత్రి నాజీవితానికి ఆదర్శం అవుతారా? ఆదర్శంగా పెట్టుకోవాలంటే వాళ్లు స్వార్థత్యాగులే అయి ఉండాలా? ఊళ్ళకు ఊళ్ళు లూటీచేసేవాడు ఓరకంగా గొప్పవాడు కాదంటే నేను ఒప్పుకోను. రూపాయి రూపాయిగా కూడబెట్టి జాగ్రత్తగా మడిపెట్టి ఎవడు యిస్తాడు గనక? నేనే యివ్వాలి యిస్తే.

రామ్మూర్తికీ, సామికీ లేని వీళ్ళు నాకు ఉన్నాయి. అంటే అప్పట్లో వాళ్ళకు లేని వీళ్ళు నాకు యిప్పుడు ఉన్నాయి వాళ్ళు మైనారిటీ వెళ్ళకుండానే రోడ్డుమీద పడ్డారు, వాళ్ళకు ముందూ వెనకా చూసుకోవటానికి ఏమిలేదు. ఊరూ పేరూ లేదు. చదువూ, సంధ్యా అంతకన్నా లేదు.

ఇంతకీ ఉన్నదల్లా ఒంటిమీద లాగూ, చొక్కా. లోకాన్ని తినేసే ఆశ. ఉత్సాహం. కసీను. కసి పిచ్చి కుక్క లాంటిది. కనిపించిన ప్రతివాడినీ కాటేస్తుంది. ఏమాత్రం సందేహం అక్కర్లేదు. కాటేయబడ్డ ప్రతివాడూ కర్ణుడుకాదు అడగంగానే కవచ కుండలాలు యిచ్చేయ్యటానికి. కాటెయ్యగానే నురగలు కక్కుకుని చస్తారు. ఎక్కిన విషానికో, తిన్న షాక్కో. ఇప్పుడు నాదృష్టిలో ప్రతివాడూ ఒక కెరీరిస్టు. లేకపోతే ఎనార్కిస్టు. అంటే, అరాచకం అయినప్పుడుగదా మనసు పనిచేసేది? అవకాశాల్ని కాకుల్లాగ, గద్దల్లాగ తన్నుకుపోయేవాళ్ళు తన్నుకు పోతూంటే. దిక్కులుచూస్తూ కూచున్నవాళ్ళపైన జాలి ఎవరికి?

రామ్మూర్తికి వెనక ఏమీ లేకపోవడమే నిజానికి ఒక పెద్ద పెట్టుబడి. ఏమీలేక పోవడమే ఒక పెద్ద అవకాశం. వెనక్కి తిరిగి చూసుకోవడం వెనక ఏదైనా ఉన్నప్పుడు. ఒకరకంగా చూస్తే ఇది ఎవళ్ళను వాళ్ళు వెనక్కి లాక్కోవటం.

సామిని చూసిచూసి నేను కొంచెంలో కొంచెం మారినమాట నిజం. నాలోవచ్చే మార్పుని చూడగా చూడగా సామికి అనిపించింది నేనుకూడా పనికి వస్తానని. ఎవడినైనా వాడుకోవచ్చునంటే ఎవడు వదులుకొంటాడు గనక?

నేను సంచిమోయటం మాట అలాఉంచి, చెప్పులు మోయ మన్నా సిద్ధంగా ఉన్నాను. ఆఫీసులో ఫైళ్ళుమోసిమోసి కుర్చీలో మేకులా కూచుని, అదే విరిగిన కుర్చీలో సమాధి అయిపోవటంకన్న తీసిపోయేదేముంది గనక? నన్ను నేను ఒక్కసారి, మరోసారి చూసుకున్నాను. సామితోబాటు రామ్మూర్తి దగ్గిరికి వెళిపోదామనే ఆశ నాలో ఎన్నో కోర్కెల్ని రేపింది. నేను చేస్తున్న విరిగిన మంచం కోడులాంటి ఉద్యోగం, ఎదుగూ బొదుగూలేని జీవితం, తెలివితేటలు ఉన్నాయేమోనని మాటిమాటికీ కలిగే అనుమానం — యివేనన్ను యిటూ ఆటూ కాకుండా చేస్తున్నాయి.

నాకు రామ్మూర్తి కథ తెలుసుకోవటంవల్ల ఏం లాభం? నేను సామిని రాత్రింబగళ్ళు కాకబట్టి సాధించిన దేమిటి? ఒకసారి బహా నీలు తిని, మరోకాపిసి కబుర్లు చెబితే ఏమిటిలాభం?

కాని నేను యీవిధంగా వీధివీధికీ విస్తరాకులాగా ఎగిరిపోయే స్థితిలో ఉండదల్చుకోలేదు. నేను బతకాలి, ఏదో లాగూ చొక్కా వేసుకుని ఎలాగో బండి లాగించెయ్యటంకాదు. నాక్కావలసినట్టు, నేను బతకగలగాలి. అది సామి కాళ్ళ పట్టుకుంటే సాధ్యం అవుతుం దనిపించింది అప్పుడు. ఇప్పుడు రామ్మూర్తి కాళ్ళుగూడా పట్టటం అవసరంలాగ ఉందిచూస్తే. వసుదేవుడు నా ఐడియల్!

* * * *

## 17. ఈ కథలో కీలకం

బషీర్‌బాగ్‌లో ఉంది రామ్మూర్తి యిల్లు. నేను సామీ వెళ్ళాం పొద్దున్నే. హాలు చాలా అట్టహాసంగా ఉంది. గోడలకి మోడర్న్ పెయింటింగ్స్ ఉన్నాయి. మేము కూచున్న రెండునిమిషాల్లో రామ్మూర్తి, సావిత్రి మరో యిద్దరూ వందిమాగధుల్లాంటి వాళ్ళూ వచ్చారు.

సామిని చూపి, పలకరించి మరో అరగంటలో వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు రామ్మూర్తి. అర్జంటుగా పనిమీద వెళుతున్నారు వాళ్ళు. మరో అరగంటదాకా ఆగాలి. నీ ఆఫీసుకు యివాళ రావటంలేదని యిక్కడనుంచి ఫోనుచెయ్యి....'

నేను ఏదో ఆలోచిస్తూంటే, 'నువ్వు ఉన్నా వెళ్ళినా నేను మాత్రం ఉండాలి. నాకు మాట్లాడవలసిన వ్యవహారాలు చాలా ఉన్నాయి' అని ఒక సిగరెట్ ముట్టించాడు సామి నాకు కొత్తా అనిపించింది. సిగరెట్ అలవాటు లేకపోయినా అడిగి తీసుకుని మరీ కాల్చాను. 'నీ వంటికి సిగరెట్ పడుతుందీ' అన్నాడు నవ్వుతూ సామి. నేను పాలుతాగే పసివాడిలాగ కనిపిస్తున్నానులా ఉంది. ఇక్కడిదాకా వచ్చినతరవాత ఒకరోజు సెలవుపెడితే ఏంపోతుందిగనక ? అక్కడ నించే ఫోనుచేశాను ఆఫీసుకు ఇవాల్టికి రావటంలేదని.

రామ్మూర్తి రాగానే సామి గబగబా లేచాడు. హు యీజ్ ఒప్ బోయ్ ? అన్నాడు. నీ కళ్ళకు నేను అలా కనిపిస్తున్నానా, అందామనుకుని, మళ్ళీ నోరుమూసుకూరుకున్నాను. సామీ రామ్మూర్తి ఏదో గుసగుసలాడారు.

మరో పదినిమిషాల్లో ఓ గదిలో కూచున్నాం మేమంతా. ఒక బోయ్ మాకందరికీ 'టీ' పట్టుకొచ్చి యిచ్చాడు. 'మీరు ఏదో ఆఫీసులో పనిచేస్తున్నట్టున్నారు. సెలవుపెట్టారా ఇవ్వాళ ?'

'ఊఁ'

ఇంతలో యిందాక రామ్మూర్తితో బయటికి వెళ్ళిన ఆవిడ అక్కడకువచ్చింది. ఆవిడకూడా నన్నో పురుగులాగ తీసిపారేసి నట్లుగా 'హు యీజ్ దిస్ బోయ్' అంది. నోటిదాకా మాటవచ్చి మళ్ళా ఆపుకున్నాను. వెధవ విగ్రహం !

'ఈ కుర్రాడికి మనం ఏ విధంగా పైకివచ్చామో కావాలట ? మన 'సక్సెస్ స్టోరీ' చెబితే కాపీ చేస్తాడట' అని రామ్మూర్తి ఓ సిగరెట్ వెలిగించి అందరికీ ఆఫర్ చేసి ఆవిడవైపు చూసి, 'దిస్ బోయ్ సావిత్రీజీ, మన సామికి శిష్యుడు.'

'ఓ....చాలావుంది కథ....' అని నేను లోపలికి వెళ్ళి పని చూసుకోవాలి మరి. ఇంటర్వ్యూ కాగానే చెప్పండి. పదకొండు గంటలకి మీకు ఓ ముఖ్యమైన అపాయింట్ మెంట్ ఉంది....' వెళ్ళిపోయింది సావిత్రి.

'చూడు సామీ. మీరు యితన్నిగూర్చి అనుకుంటున్నదానిలో ఫిఫ్టీపర్సెంట్ నిజం. ఫిఫ్టీపర్సెంటు అబద్ధం.'

'నేను....' అని నేను ఏదో అనబోతుంటే రామ్మూర్తి నన్ను పక్కకు తోసేసినంత విసురుతో అన్నాడు' మిమ్మల్ని గూర్చి మీరు అభిప్రాయం చెప్పకండి....అది మాకు వదిలెయ్యండి....'

సామి నావైపు తిరిగి 'నువ్వు గనక నాతో పనిచెయ్యదలుచు కుంటే నీ ఉద్యోగం వదులుకోనక్కర్లేదు. నిజానికి నువ్వు ఓ పర్మనెంట్ ఉద్యోగంలో ఉండటం అవసరం....!

నేను రామ్మూర్తితోగాని సామితోగాని పనిచేస్తానని చెప్పలేదు. ఎందువల్ల నేను యీ విషయం స్పష్టంగా చెప్పలేకపోయాను ? రోజుకు రోజు నేను తాజా 'యింట్రెస్టు' తో కథ వినటం కేవలం హరికథా కాలక్షేపం కాదని నాకు తెలుసు. నాను యింత నమ్మకంగా పొందికగా చెప్పటం తనకు పనిచేసే ఆపరేటివ్‌గా మార్చటానికా ? హా హతవిధీ!

రామ్మూర్తి నా కళ్ళముందే ఎనిమిది టెలిఫోన్‌కాల్స్ ఆన్సర్ చేశాడు. సెక్రటరీని తప్పించుకునివచ్చిన 'అన్‌లిస్టెడ్' నంబరుపైన.

రామ్మూర్తి వేషాన్నిబట్టిగాని, మాటనిబట్టిగాని తెలుగువాడని ఎవ్వడూ అనుకోడు. కేవలం తెలుగు మాట్లాడేటప్పుడు మాత్రం తెలుస్తూంది. అదికూడా అప్పుడప్పుడు విసిరే విసురుళ్ళ వల్ల.

సామికీ, రామ్మూర్తికీ చాలా లోతైన సంబంధాలు ఉన్నట్టు తెలుస్తూనే ఉంది. రామ్మూర్తి యిల్లు ఒక సినిమాసెట్టులాగా ఉంది. ఇదేదో 'యింటర్నేషనల్ రాకెట్' అయి ఉండాలి. ఇందులో నేనెవర్ని ? మయసభలాంటి యింట్లో అప్సరసల్లాంటి వాళ్ళు

తిరుగుతారు. ఈ పర్షియన్ కార్పెట్లు, వాల్ హాంగింగ్స్, షాండ్లియర్స్, యివన్నీ చూసి కళ్ళు తిరగటంవల్ల నావెర్రితనం తెలివితక్కువ తనం బయటపడటం కన్న ఏముంది?

'సరే రాత్రి ఎనిమిది గంటలకి పార్టీ ఉంది. కలవండి.' అని 'నో క్రైమ్' అని వెళ్ళిపోయాడు కళ్ళల్లో మైనాన్ని చల్లుతూ.

'రామ్మూర్తి వెళ్ళిన తర్వాత సామి నావైపు తిరిగి 'చూశావుగా సుబ్బరాయిడూ రామ్మూర్తిని....' 'అవును 'లెజండరీఫిగర్!' అన్నాను.

'నువ్వు యింకొకళ్ళ గొప్పదనాన్ని గూర్చి గాబరాపడ్డంత కాలం నీకూ తుప్పుపట్టిన సీనారేకు డబ్బాకీ ఏమీ తేడా ఉండదు. లే.... పోదాం....' అని నన్ను రెక్కపుచ్చుకు లేవదీశాడు....

దారిలో సామి నన్ను పక్కకు పిలిచి, రావ్‌సాహబ్‌ని కలుస్తావా అన్నాడు? 'నిజంగా? ఇదేమన్నా తెలుగు సినిమాకథా గురువుగారూ?' అన్నాను.

'కాదు. హాలీవుడ్ మిరకల్!' అని ఓ గడ్డం పెంచుకున్న ఓ నడివయస్సు వ్యక్తిని పరిచయం చేశాడు. 'ఈయన శ్రవణానంద్ యీఆశ్రమంలో....' 'ఈయనపేరు బన్సీలాల్, తల్లి తాతలు తెలుగు దేశంలో సెటిల్ అయిపోయారు' అని నన్ను పరిచయం చేశాడు. శ్రవణానంద్ చిన్మయానందాన్ని చిలకరించాడు, సామి ఇంటికి వచ్చే లోగా నేను రంగులరాట్నం ఎక్కి తిరిగినట్లయింది.

'స్వామి శ్రవణానంద్ ఎవ్వరివల్లాకాని జబ్బుల్ని బాగుచేస్తున్నారు! భారతీయ వేదాంతాన్ని పంచిపెడుతున్నారు దప్పిగొన్న వారికి. వారు పూర్వాశ్రమంలో రావ్‌సాహబ్. తెలిసిందా పోలిసెట్టీ?'

'నేను మీదగ్గర కొంతకాలం ట్రెయినింగ్ లాంటిది పొందాలి. మీరు చెయ్యమిచ్చిన ప్రతిపనీ చేస్తాను. గడ్డిచెక్కి గొడ్లకు వెయ్యమన్నాసరే నన్ను వాడుకోండి' అని చేతులు పట్టుకుని యివి కాళ్లనుకోండి' అన్నాను.

'దారిలో రామ్‌రామ్ గోరీకూడా చూపిస్తారా గురూజీ?'

'ఎంత అమాయికత్వమోయ్ సీది జగానంద్! సేట్‌కి గోరీ కట్టడానికి వాడేమన్నా సాయిబాబా అనుకున్నావా? లేకపోతే ఎవడన్నా యుగపురుషుడనుకున్నావా? రామ్మూర్తి బతికున్నాడంటే సేట్ గోరీమీదే కదామరి?'

ఒకడిగోరీ మరొకడి యిల్లు. ఇదిలోక ధర్మం. నీకు ఏ మాత్రం యింగితజ్ఞానం ఉన్నా యిది తెలుసుకో! నాదగ్గర నువ్వు పుచ్చుకోవలసిన ట్రెయినింగ్ ఏమీలేదు. నిజానికి ఎవనికీ ఎవడూ ఏమీ చెప్పలేదు. ఎవడైనా నీకు ఏమన్నా చెబుతానన్నాడంటే అది ఉట్టి బుకాయింపు. నమ్మకు నేను చెప్పినాసరే!'

సామితోపాటు యింటికి వెళ్ళాను. నాకు ఆఫీసుపైన రోత పుట్టింది. కాని, నామీద నాకు రోత పుడితే పోయి ఎందులోనూ దూకలేముకదా? ఎంత దౌర్భాగ్యజీవితమైనా, భరించవలసిందే.

ప్రతివాడూ వాడి జీవితానికి భర్త. జీవితపు బొంతను వదల లేడు. వచ్చినట్టు బతుకుతూంటాడు. సామి నాకు ఓ వందరూపాయల నోటు యిచ్చి. 'దీన్ని సాయంత్రంలోగా ఖర్చుపెట్టి కనిపించు. రామ్మూర్తితో ఎనిమిది గంటలకి విందు. ఏడు గంటలకి యిక్కడికిరా. ఇంక నన్ను వదిలేసుకోసి' నా వైపు చూడకుండానే వెళ్ళిపోయాడు సామి.

నేను ఆ వందరూపాయల నోటు పుచ్చుకుని ఏం చేద్దామా అని ఆలోచిస్తూ చేతులు జేబులో పెట్టుకుని బయటకు నడిచాను.

'ఆ వందరూపాయలు ఖర్చుపెట్టటం చేతకాకపోలేదు. వంద రూపాయల నోటు ఖర్చుపెట్టలేనంత వాజమ్మని కానే! మరి సామి నామీద వందరూపాయలు విసరటంలో ఏమిటి ఉద్దేశం?'

కోటీకి వచ్చి కాఫీతాగి వందరూపాయిల నోటు చూపించాను. నా పరువు కాస్త పెరుగుతుందని నా నమ్మకం. ఆ వందరూపాయల నోటుని వాడు ఓ చిత్తుకాగితం లాగ చూసి, సరసరా తొంభై తొమ్మిది రూపాయల చిల్లర యిచ్చేశాడు. నేను హోటలు ప్రొప్రయి

టరు దగ్గరకు వెళ్ళి నేనెవరినో చెప్పాలని నాతహతహ. నేను ఎవర్నీకాదు గనక ఏమీ చెప్పలేకపోయాను.

ఓ గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్లు పెట్టె కొన్నాను. సిగరెట్ నాకు అల వాటులేదు. కాని, సిగరెట్ కావాలని అడిగి తాగాను. తరవాత సిగరెట్ పెట్టె కొన్నాను. ఏ బార్‌లోకో ఒకళ్ళిద్దరు మిత్రులతో వెళితే పంద రూపాయలలో మిగిలినది అయిపోవటమే కాకుండా యింకొంత అప్పు మిగులుతుంది.

అయినా, నాకు పందరూపాయలనోటు యిచ్చింది దేనికి? కాస్సేపు ఆలోచించి చూశాను. ఏదో లీలగా తట్టింది. క్షుణ్ణంగా భోంచేసి సాయంత్రందాకా ఊరుతిరిగి ఏడుగంటలకి చేరుకున్నాను సామి యింటికి.

నేను రాగానే నన్ను తీసుకుని 'పద పోదాం' అన్నాడు. నాకు ఏమీ మాట్లాడటానికి ఛాన్సు యివ్వకుండానే. 'నువ్వు ఆ పంద రూపాయలు ముందర యిలాతే అని' గోళ్లూడగొట్టి లాక్కుంటాడను కున్నా. దాని సంగతే ఎత్తలేదు.

దారిలో అయిదుచోట్ల ఆగాడు సామి. ఎనిమిదికి అయిదు నిమిషాలు ఉండగా రామ్మూర్తి బంగాళాకు చేరాము. అప్పుడే హడా విడిగా నాలుగుకార్లు జారిపోతున్నాయి జెర్రిపోతుల్లాగ.

మేం లోపలికి వెళ్లగానే అక్కడ అటెండెంట్ ఒకడుసామికి సలాంకొట్టి, 'అయ్యగారు హాల్లో ఉన్నారు.' అన్నాడు. హాల్లోకి వెళ్లగానే 'ఓ, మీరూ వచ్చారా?' అన్నాడు. సావిత్రి అక్కడలేదు.

భోజనానికి కూచున్నాం. సామి నన్నుగూర్చి అంతకుముందే చెప్పడంవల్ల రామ్మూర్తి అంత అనుమానంగా చూడలేదు. సామి మాత్రం అన్నాడు: 'నీకు ప్రొద్దున్న యిచ్చిన పందరూపాయలు ఖర్చుపెట్టెయ్యమన్నాను. అందులో మాకు చెప్పదలిచిన ఖర్చులకి లెక్కలెప్పు.'

నా ముఖంలో రంగులు మారతాయనుకున్నది మారకపోవ

టంతో కాస్త యిబ్బందిగా పెట్టాడు ముఖం సామి. రామ్మూర్తి సీరియస్‌గా భోజనం చేస్తున్నట్టు కనిపిస్తున్నాడు. సావిత్రిమాత్రం విలాసంగా చెంచా ప్లేటుకేసి టంగ్ టంగ్ అని మోగించింది. చప్పుడువిని పనివాడు వచ్చాడు. ఒక టెలిఫోన్ నెంబరుయిచ్చి ఫోన్ చెయ్యమంది. 'మీరు మాట్లాడతారా?' అని వాడు అనేసరికి 'ఎంతకాలం బట్టీ ఈ యింట్లో పనిచేస్తున్నావు?' అని కసురుకుని 'మన డైరెక్టరీలో ఉన్న నంబరునుంచి ఫోన్‌చేస్తున్నానని చెప్పు. వాళ్ళు విన్నా ఏమీ అడగరు. వాళ్ళు ఏమన్నా చెబితే విని చెప్పు.... వాడు ఇంకా కదలకపోతే—'యింకా ప్రశ్నలు ఉన్నాయా?'

వాడు గబగబా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

నేను సమాధానం చెప్పక తప్పదు. ఆ చెప్పే సమాధానం బట్టి నాకూ సామికీ ఏమన్నా 'బిజినెస్' యికముందర.

'ఓ గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ పెట్టె. ఓ కప్పుకాఫీ మిగతాడబ్బు ఉంది.'

'వందరూపాయలు ఖర్చుపెట్టలేక పోయావుటోయ్....' అన్న రామ్మూర్తి మాటపట్టుకుని. 'పనికిరావచ్చు....ఎందుకూ పనికిరాక పోవచ్చు' అంది సావిత్రి.

సామి ఏదో అనబోతూంటే రామ్మూర్తి అందుకుని అన్నాడు, 'ఇట్ డిపెండ్స్....' అని.

'వందరూపాయలు 'మార్చి ఓ గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్‌పెట్టె కొని ఓ కప్పు కాఫీ తాగేసరికి నేనొక క్రిమినల్‌లాగ కనిపించాను.

నేను సంపాదించని డబ్బు ఉల్పాగా ఖర్చు పెట్టటం ఎందుకో అన్యాయంగా కనిపించింది. మీరు వందరూయిపాల నోటు యిచ్చి నప్పుడే తిరిగి యిచ్చేద్దామనుకున్నాను. కాని, యిచ్చినడబ్బు తిరిగి ఇయ్యబుద్ధిపుట్టలేదు. తీరా తీసుకున్న తర్వాత ఖర్చుపెట్ట బుద్ధి పుట్టలేదు. వందరూపాయలు ఖర్చుపెట్టటం అంతకష్టం కాదని ప్రతి పుల్లయ్యకీ తెలుసు....'

'దారిలోకి వచ్చినట్టే ...' అన్నాడు సామి.

'నీకు కొన్ని పనికివచ్చే లక్షణాలు ఉన్నాయి. నీలో మామూలుగా ఉండేకొన్ని గుణాలు లేవు. నమ్మకం లాంటిది నీమీద కలగచ్చు. ఇంకొకళ్ళ డబ్బుమీద నీకు విరక్తి లేదు. కాని, యితరులకి కష్టపెంచేటంత ఆత్రంలేదు. ఇంక నీకు నేర్చుకుందామనే ఆశ ఉన్నట్టు నువ్వు యిన్ని రోజులబట్టీ చేస్తున్న ఆషాఢభూతి శిష్యరికం చెబుతూనే ఉంది....'

'నన్ను నమ్మరన్న మాటేగా....?'

రామ్మూర్తి నవ్వాడు సావిత్రినవ్వింది. సామి పకపకా నవ్వాడు ఆర్కెస్ట్రాలో ఒక్కసారి మోగే వాద్యాల్లాగ.

నాకు మామూలుగా అయితే మతిపోవల్సిందే. కాని యింత కాలంబట్టీ వింటూన్న కథ. నాలోగూడా కాస్త యింగితజ్ఞానాన్ని పెంచినట్టేఉంది చూస్తే.

ఎవడు ఎవడినీ నమ్మడు లోకంలో. నమ్మకం అనేది ఘన పదార్థంకాదు. గాలిలాంటిది. అందుకే దాని విలువ ప్రాణవాయువు లాంటిది.

తెలివైనచేప గాలంలోపడదు. ఎరని కొరికేసి యీతకొట్టేస్తూ దూసుకుపోతుంది. మరోచిన్నచేపని మింగేసి మరో ఎరకోసమో, మరో చేపకోసమో చకచకా యీత కొట్టేస్తుంది.

డబ్బు ఒకడు యిస్తే పుచ్చుకునేదికాదు. ఒకడిస్తే పుచ్చుకుందామనుకున్న వాడికీ, మబ్బులవైపు చూస్తూ మడిలో నీళ్ళు వదిలేసిన వాడికీ తేడాలేదు.

కష్టపడి డబ్బు సంపాదించి సుఖపడదామను కోవటంలో దురాశ. ఊపిరి పీలుస్తూ బతకదల్చుకున్నవాడు అటువంటి ఆలోచనని ఓఫర్లాంగు దూరంలో ఉంచాలి.

ఎవడూ ఎవడినీ బాగుచెయ్యలేడు. ఒకొకడు బాగుచేస్తే బాగుపడదా మనుకునేవాడు అరడుగుల పొడుగు రెండడుగుల వెడల్పు గల గొయ్యి తవ్వుకుని. అందులో అగరొత్తులు వెలిగించుకుని పువ్వులు చల్లుకుని సొంతంగా పాతరైపోవటం మంచిది.

ఏది మంచీ, ఏది చెడ్డా అని కావలసిన దానికన్నా ఎక్కువ ఆలోచించే 'హామ్లెటియన్ ఇన్ డెసిషన్' గలవాడు వెయ్యనిస్తే నాటకాలు వెయ్యటానికి పనికిరావచ్చు. మరెక్కడా మారడు.

అనుమానం, అవమానం బతుకు తెరువుకు కీలకాలు. ప్రతివాడినీ నమ్మకుండా, నమ్మినట్టు నటించి వాడిని అనుమానించాలి. ముందుకు పోయే టప్పుడు దార్లో వచ్చే అవమానాలన్నీ భరించి, అదను వచ్చి నప్పుడు గట్టి దెబ్బ కొట్టాలి. అవమానం భరించగలవాడే లోకంలో నెగ్గుకు రాగలడు.

సామిదగ్గర నేను కథ విన్నందుకు నాకు ఏమి ఫలితం దక్కిందీ అన్నది బేరీజు వేసుకోవలసింది యిప్పుడు కాదు.

ఇది కాలక్షేపం కాదు. విన్నవి దులుపుకు పోతే నాకే నష్టం. ఏదైనా పనికి రావాలంటే, దాన్ని వాడుకోవటం తెలియాలి. అంటే నాలో జీవపదార్థం ఉండాలి, మెరికలాంటి ఆ జీవనాడి ఉంటే, యీ అణాకానీ ఉద్యోగం మానేసి లోకాన్ని లూటీచేసి బతుకుతాను, లేకపోతే.....

సమాప్తం

